



# వేదాలలో

# సూర్యకిరణ చికిత్స




రచయిత :

సుమ్నార్ధి

డా॥ కోదూరి సుబ్బారావు



గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ

గాయత్రీ గ్రంథమాల : 34

వేదాలలో సూర్యకిరణ చికిత్స

ద్వితీయ ముద్రణ ప్రతులు : 1000



సృష్టిసంవత్సరము : ః 197, 29, 49, 119
విక్రమాబ్దము : 2075
కలియుగాబ్దము : 5119

శ్రీ విళంబినామ సం॥ కార్తీక మాసం (దీపావళి) 2018

**మూల్యము : రూ. 80-00**

ప్రతులకు :

1. గాయత్రీ ఆశ్రమ ట్రస్టు,
   కార్యదర్శి : కె.పి. నర్సింగరావు,
   12-10-586/6, ఆర్యసమాజము, వారాసిగూడ,
   సికింద్రాబాద్ - 500 061.
   సెల్ : 98480 11073, 6301044860

2. డా॥ కోడూరి సుబ్బారావు, వైదికవానప్రస్థాశ్రమం,
   హనుమాపురం (B.O.) ; (Via.) భువనగిరి గంజ్ - 508 116.
   సెల్ : 9290604641, 9908994084.

3. ఆర్యసమాజ మందిరము, రైల్వే ఫ్లైఓవర్ దగ్గర,
   సీతాఫలమండి - 500 061. సెల్ : 9133134156

4. ఆర్యసమాజము, కూచిపూడి - 522 313 (తెనాలి తాలూకా).
   ఫోన్ : 08644-252789.

*Printed at :*

**PRINTSHOP** - 040-6632 0300.



## ముద్రణవ్యయ దాతల సంక్షిప్త పరిచయం

ఇందూరు (నిజామాబాద్) వాస్తవ్యులు శ్రీ ఐచ్చు వెంకటరాజయ్య ఆర్య గారు నిష్ఠాగరిష్ఠులైన వైదికులు - వైదిక ధర్మానుయాయులు. నిత్య సంధ్యాగ్నిహోత్రులు. నిత్యస్వాధ్యాయశీలురు. వైదిక ధర్మంపై అనన్యశ్రద్ధా భక్తులు కలవారు. వీరికిప్పుడు 93 సంవత్సరాలు, అయినా యువకులలో ఉన్నత ఉత్సాహంతో ఉంటారు. తనకు తెలిసిన జ్ఞానాన్ని, నీతులను పిల్లలకు, పెద్దలకు బోధిస్తూ ఉంటారు. వీరు 5 సం॥ వయస్సులో ఉండగానే తండ్రి శ్రీ ఐచ్చురాజారాంగారు దివంగతులయ్యారు. తల్లి శ్రీమతి గౌరమ్మగారే వీరిని, వీరి తమ్ముడు శ్రీ లక్ష్మీనారాయణ, చెల్లులు రాజమణి గార్లను పెంచి పెద్దచేసి విద్యాబుద్ధులు చెప్పించారు. వీరుకూడా తల్లిలోనే తన సర్వస్వాన్ని చూసుకుంటూ తల్లి సేవయే పరమావధిగా భావించి సేవించారు. అంతా కలిసి ఒకే కుటుంబంగా ఉంటూ ఆదర్శంగా ఉండేవారు, విధివశాత్తు కొంతకాలం క్రింద తమ్ముడు, చెల్లెలు దివంగతులయ్యారు.

శ్రీ వెంకటరాజయ్యగారు నీతిగా నిజాయితీగా టోకు (హోల్‌సేల్) వ్యాపారం చేసేవారు. వీరి విద్యాభ్యాసం ఆర్యసమాజ విద్యాలయంలో జరగటంవల్ల చిన్నతనంలోనే వైదిక సిద్ధాంతాలతో పరిచమయ్యింది. పూర్వజన్మ సంస్కారాల వల్ల వీరిలో వివేకం వికసించింది. వైదిక సిద్ధాంతాలపై అనన్య శ్రద్ధాభక్తులేర్పడ్డాయి. అవే కుటుంబంలో అంతా వ్యాపించాయి. దీనికి తోడు సమానగుణకర్మ స్వభావాలు గల సతీమణి శ్రీమతి లక్ష్మీబాయిగారు లభించటం వీరు పూర్వజన్మలలో చేసుకున్న సుకృతఫలం. ఈ అమ్మగారు స్వపరభేదం లేకుండా కుటుంబంలోని వారినందరిని ప్రేమతో చూసుకుంటున్నారు. విశేషంగా "అతిథి దేవో భవ" అనే ఆర్యసూక్తిని నిజ జీవితంలో ఆచరిస్తూ ఆదర్శంగా నిలుస్తున్నారు. వీరి ఆతిథ్యాన్ని స్వీకరించిన వారెవ్వరూ ఆమె ప్రియవచనాలను మరువలేరు. ఈ దంపతుల ఆదర్శజీవనమే, వారి సంతానానికి, మనుమలకు, మనుమరాండ్రకు ఆదర్శంగా నిలస్తున్నది. బంధుమిత్రులకును, అతిథి అభ్యాగతులకును అది ఆదర్శమే.

ఈ ఆదర్శ దంపతులకు ముగ్గురు అబ్బాయిలు, నలుగురు అమ్మాయిలు, మొత్తం 7 గురు. సంక్షిప్తంగా వారి సంతాన వివరాలు :

**అబ్బాయిల పరిచయం :**

(1) **ప్రథమ పుత్రుడు :** శ్రీరాజ్ ప్రకాశ్, వీరి శ్రీమతి చంద్రకళ. వీరికి ముగ్గురు సంతానం. ఓం ప్రకాశ్, వేదప్రకాశ్, కవిత. వీరందరికి వివాహాలయ్యాయి. పెద్దబ్బాయి శ్రీ ఓం ప్రకాశ్ భార్య రాధిక. ఈ దంపతులకు ఇద్దరు సంతానం, అమ్మాయి పేరు అక్షర, అబ్బాయి పేరు ఆర్యన్. ద్వితీయ పుత్రుడు శ్రీ వేదప్రకాశ్. వీరి శ్రీమతి సూర్యకళ. అమ్మాయి కవిత. భర్తపేరు శ్రీ గాలి హరి. ఈ దంపతులకు ఒక అమ్మాయి. పేరు అదితి.

(2) **ద్వితీయ పుత్రుడు :** శ్రీ. డా. రాజేంద్రప్రసాద్, వీరి శ్రీమతి నిషా. ఈ దంపతులకు ఇద్దరు సంతానం. వికాస్, జయ్

(3) **తృతయ పుత్రుడు :** శ్రీ శ్రీనివాస్, వీరి శ్రీమతి సునీత, ఈ దంపతులకు ఒక అమ్మాయి. పేరు స్నేహిత.

**అమ్మాయిల పరిచయం :**

(1) **పెద్దమ్మాయి** – సుశ్రీ స్వరూపరాణి. వైదిక ధర్మప్రచారానికి అంకితమయ్యారు.

(2) **రెండవ అమ్మాయి** – శ్రీమతి అనురాధ. ఈమె భర్తపేరు శ్రీ గోవిందు లక్ష్మీనారాయణ. ఈ దంపతులకు ఒక అమ్మాయి, ఒక అబ్బాయి. అబ్బాయి వేదమిత్ర భార్య శ్రీమతి మౌనిక. అమ్మాయి శృతి. భర్తపేరు శ్రీ మాంకాల మనీశ్. ఈ దంపతులకు ఒక అమ్మాయి. పేరు ఆద్య.

(3) **మూడవ అమ్మాయి** – శ్రీమతి లలిత, ఈమె భర్తపేరు శ్రీ నంగునూరి రాంకుమార్. ఈ దంపతులకు ఇద్దరు అమ్మాయిలు. పేర్లు మేధాశ్రీ, శ్రద్ధాశ్రీ. పెద్దమ్మాయి మేధాశ్రీకి శ్రీ వీరమల్లి ప్రీతమ్ గారితో వివాహం నిశ్చయమయ్యింది.

(4) **నాల్గవ అమ్మాయి** (చిన్నమ్మాయి) శ్రీమతి శ్రీదేవి. ఈమె భర్తపేరు శ్రీ తాటిపాముల శ్రీనివాస్. ఈ దంపతులకు ఒక అబ్బాయి. పేరు బాలాదిత్య.

పరమేశ్వరుని పరమకృపవల్ల వీరంతా ఉన్నత విద్యావంతులై దేశ విదేశాలలో

ఉద్యోగాలు చేసుకుంటూ సుఖసంతోషాలతో ఆనందంగా జీవనం సాగిస్తున్నారు. దూరంగా ఉన్నా మాతా పితలైన శ్రీమతి లక్ష్మీబాయి, శ్రీ వెంకటరాజయ్యగార్ల క్షేమ సమాచారాలను తెలుసుకుంటూ శ్రద్ధా భక్తులతో చూసుకుంటున్నారు. అందుచే ఈ వృద్ధ దంపతులకు ఏ చీకూచింతా లేదు. వీరు ఇంటిలోనే ఉన్నా వానప్రస్థులవలె తాపసిక జీవితం గడుపుతున్నారు. వీరి ఆదర్శజీవనమే కుటుంబానికంతటికి మార్గదర్శకం. వీరి ఆదర్శాలేమంటే –"తల్లిదండ్రులను గౌరవించటం, సేవా ప్రవృత్తి, అంకితభావం, పరోపకారం, వైదిక సంస్కారాలపట్ల శ్రద్ధాభక్తులు కలిగిఉండటం. వీరి ఉపదేశాలు కూడా సరళంగా ఉంటాయి. వీరేమంటారంటే – "జీవితంలో సుఖంగా ఆనందంగా ఉండాలనుకుంటే – వేద విహితమైన సత్కర్మలను సదా ఆచరిస్తూ ఉండాలి. నిషిద్ధ కర్మలను త్యజించాలి. తాను చేసిన ఉపకారాలను, ఇతరులు మనకు చేసిన అపకారాలాను మరిచిపోవాలి. అందరితో మైత్రితో వ్యవహరించాలి. పరులను విమర్శించడం విడిచిపెట్టాలి. ఆత్మ విమర్శ చేసుకుంటూ ఉండాలి" అంటూ ఇంట్లో వారికి, బయటివారికి కూడా ఉదేశిస్తూ ఉంటారు. ఆ ఉపదేశాలనే వారు తు.చ. తప్పకుండా ఆచరిస్తారు.

ఈ ఆర్య ఆదర్శ దంపతులు ఈ పుస్తక ముద్రణకు 'వేదాలలో సూర్యకిరణ చికిత్సావిజ్ఞానాని'కి రూ. 25,000/- దానంగా అందచేశారు. వారికి మా హృదయపూర్వక ధన్యవాదములు. సర్వవ్యాపక సర్వేశ్వరుడు వీరికి శతాధిక ఆయువునిచ్చి, ఆశీర్వదించునుగాక. కుటుంబంలోని వారందరికి దీర్ఘ ఆయురారోగ్య ఐశ్వర్యాలనిచ్చి కాపాడును గాక. శుభమస్తు

– గాయత్రీ ఆశ్రమ ట్రస్టు



# ఈశ ప్రార్థన

**యామ్ ఋషయో భూతకృతో మేధాం మేధావినో విదుః।**
**తయా మామద్య మేధయాగ్నే మేధావినం కృణు ॥**

**(అథర్వ. 6-108-4)**

ఓ జ్ఞాన ప్రకాశ స్వరూప పరమేశ్వర ! అంతర్యామిన్ ! ఏ మేధా బుద్ధిని ఋషులు, ఆదర్శ పురుషులు, మేధావులు (విద్వాంసులు, విజ్ఞాన వేత్తలు) చక్కగా తెలిసికొని ఉపాసించిరో అట్టి మేధస్సుతో నన్నిప్పుడే మేధావిని చేసి నీదరి జేర్చికొమ్ము.

ప్రార్థించు
ఒక ముముక్షువు
**కోడూరి సుబ్బారావు**

# ఆధార గ్రంథావళి


(1) ఋక్ యజుస్సామ అథర్వవేదములు : పరమేశ్వరుడు

(2) బ్రాహ్మణ ఆరణ్యక ఉపనిషదాదులు : జ్ఞాత అజ్ఞాత మహర్షులు

(3) నిఘంటు, నిరుక్తములు : మహర్షి యాస్కుడు

(4) సత్యార్థ ప్రకాశము, ఋగ్వేదాది భాష్యభూమికా వేద భాష్యములు : మహర్షి దయానందుడు

(5) ఆయుర్వేద గ్రంథములు

(అ) అథర్వ వేదీయ చికిత్సా శాస్త్రం : స్వామీ బ్రహ్మముని పరివ్రాజక

(ఆ) 'వేదోంమే ఆయుర్వేద్' మరియు 'జ్ఞాన్ విజ్ఞాన్ కా అనుపమ్ సోత్‌వేద్' : డా. కపిల్ దేవ ద్వివేదీ

(ఇ) స్వస్థవృత్తము: డా. శివకుమార్ గౌడ్

(ఈ) వైదిక్ వాఙ్మయ్‌మే విజ్ఞాన్ : డా. రామేశ్వర దయాల్ గుప్త

(6) సూర్యకిరణ చికిత్సా గ్రంథములు

(అ) 'ది హ్యూమన్ కల్చర్ అండ్ క్యూర్ : డా.ఇ.డి. బాబిట్

(ఆ) సూర్యకిరణ చికిత్స : గోవింద బాపూజీ టోంగూ

(ఇ) సూర్యకిరణ చికిత్స : రాజేశ్

(ఈ) సూర్య చికిత్స : దీక్షిత

(ఉ) విశ్వరూపం : నండూరి రామమోహనరావు

(ఊ) భారతీయ విజ్ఞానవేత్తలు : డా. పుల్లెల శ్రీరామచంద్రుడు.

(7) ఆయుర్వేద ఉపన్యాసములు : డా. దీపక్ చోప్రా (క్యాసెట్స్)

(8) దయానందవేదభాష్య టిప్పణులు : యుధిష్ఠిర మీమాంసక

(9) వేదోంమే విద్యుత్ విద్య : బ్ర. ప్రదీపార్యనైష్ఠిక్

(10) అనేక అమూల్య వేదవ్యాఖ్యాన గ్రంథములు : 'ఆర్షగురుకులం' కామారెడ్డి పుస్తకాలయం

(11) 'సూర్య' పద నిర్వచన సంకలనాలు : ఆచార్య ఆనంద్ ప్రకాశ్ (ఆర్ష కన్యాగురుకులం, బోయిన్‌పల్లి)

(12) 'ఖగోళ విజ్ఞాన' ఉపన్యాసములు : ఆచార్య వేదవ్రత మీమాంసకుల ఆర్షగురుకులం (కామారెడ్డి)

వారి సూచనలు, వివరణలు, సహకారాలు.

## ఈ గ్రంథములో ....



చదవండి చదివించండి ఆలోచించండి

వేద విజ్ఞానాన్ని అనుసరించి అభ్యుదయాన్ని
ఉపాసించి నిశ్శ్రేయసాన్ని (ఆత్మోన్నతిని) పొందండి

# పాఠకుల అభిప్రాయము

శ్రీ సుమ్నార్థిగారికి - నమస్తే

మీరు పంపిన పుస్తకాలు అందనవి, ధన్యవాదములు, అందులో కొన్ని చదివాను, మరికొన్ని చదువుచున్నాను. వేదాలపై మీకున్న ఆసక్తి, ఆ జ్ఞానాన్ని ఎటువంటి ఫలాపేక్షాలేకుండా సరళభాషలో ఇతరులకు అందించాలన్న తపన నాకు చాలా నచ్చినవి. మీ పుస్తకాలు అత్యంత వైజ్ఞానికాలు, మీ భాష అత్యంత సరళము. నేటి యువతరాన్ని కూడా ఆలోచింపచేసే విధంగా, ఆచరింపచేసే విధంగా ఉన్నాయి. వైజ్ఞానిక మరియు వైదిక ప్రమాణాలతో అందిస్తున్న మీ రచనా శైలికి నా అభినందనలు. మీరు రచించిన పుస్తకాలలో ముఖ్యంగా మానవుని కర్తవ్యాలు, బాధ్యతలు, గృహస్థులు పాటించవలసిన గృహస్థధర్మాలు, శాంతియుత జీవనానికి ఉపాయాలు, తల్లిదండ్రుల యెడ మరియు దేశవాసుల యెడ మన కర్తవ్యం, బాధ్యత, మన దేశం యొక్క గొప్పతనం మొదలైన అనేక అంశాలు ఉంటున్నాయి. వాటిని నేటి సమాజానికి ఉపయోగపడే విధంగా వేద ప్రమాణాలతో వైజ్ఞానికంగా పొందుపరచారు. ప్రతీ అంశం పాఠకులను ఆలోచింపచేసేవిధంగా ఉన్నాయి.

ఉదాహరణకు : 'అగ్నిహోత్రం 100శాతం వైజ్ఞానికం' పుస్తకంలో అగ్నిహోత్ర ప్రక్రియలో చదివే వేదమంత్రాలకు, వాక్యాలకు నేటి విజ్ఞానాన్ని అనుసంధానపరుస్తూ వివరించిన తీరు అత్యంత ముదావహంగా ఉంది. అదేవిధంగా "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" అనే పుస్తకంలో "వస్యాం ఇంద్రాసి మే పితరుత..." అనే ఋగ్వేద మంత్రం ద్వారా తల్లిగొప్పతనాన్ని చాలా బాగా వివరించారు. అట్లే, వేదాలలో మనో విజ్ఞానం-మానసిక చికిత్స" అనే పుస్తకం చాలా బాగుంది. "మనస్సు అంటే ఏమిటి? దాని చికిత్స ఎలా సాధ్యం?" అనే విషయాలను మీరు చాలా చక్కగా వివరించారు. "గంగాధర శివుడు" అనే పుస్తకం చాలా బాగుంది. సామాన్య బుద్ధి కలవారికి కూడా అర్థమయ్యేవిధంగా వేదాలలో వర్ణించిన శివ స్వరూపాన్ని - గూఢమైన వైదిక విజ్ఞానాన్ని సరళభాషలో సరళంగా తెలిపారు. ఈ విధంగా మీ ప్రతీ పుస్తకం ఒక ఆణిముత్యం, వైజ్ఞానికం. ఆలోచింపచేసేది, ఆచరించ ప్రేరేపించేది. ఇదీ మీ రచనల గురించి నా సంక్షిప్త అభిప్రాయం.

- బ్ర. స్వరూపారాణి (M.A.) (హిందీ)

సంస్కృతంలో (వ్యాకరణాచార్య)

## "ఋషిపీఠం" మాసపత్రికలో ప్రచురింపబడిన సమీక్ష (20-2-1958)

ఆర్షవాఙ్మయానికి చెందిన మరో పరిశోధనాత్మక గ్రంథం "వేదాలలో సూర్యకిరణ చికిత్స" అనే పుస్తకం. ఆరోగ్యప్రదాతగా ఆరాధింపబడే సూర్య భగవానుని ప్రశస్తి వేద వాఙ్మయంలో అనేకచోట్ల ప్రస్తావించబడినది. సూచన ప్రాయంగా పేర్కొనబడ్డ వేదమంత్రాలను రచయిత డాక్టర్ కోదూరి సుబ్బారావుగారు ఈ గ్రంథంలో ఉల్లేఖించారు.

నాలుగు వేదాలను,ఉపనిషత్తులను, శ్రీ దయానందులవారి సత్యార్థ ప్రకాశాన్ని క్షుణ్ణంగా పరిశీలించి, సమకాలీన రచయతలు వ్రాసిన అనేక విజ్ఞాన శాస్త్ర పుస్తకాలను దాదాపు ఇరవైదాకా పరిశోధించి ఈ గ్రంథాన్ని మనకు అందించారు శ్రీ సుబ్బారావు గారు.

కాలగణనకే అందని మన ప్రాచీన ఖగోళ శాస్త్రాలలో "గోళాధ్యాయం" లో ఈ విశ్వం గుండ్రంగా ఉన్నదని చెప్పబడినది. ప్రపంచంలో మరే ఇతర మత గ్రంథాలలోనూ లేనంత విజ్ఞాన భండారం వేదాలలో ఉన్నదనే విషయాన్ని పేర్కొంటూ, నేటికీ అంతుబట్టని రహస్యాలకు సమాధానాలు అందులోనే లభిస్తాయంటారు.

అథర్వవేదంలో బీజ రూపంలో పేర్కొన్న అనేక అంశాలను ఆధునికుల పరిశోధనలలో ప్రస్ఫుటమవ్వడం ఇందుకు ఉదాహరణంగా ఈ గ్రంథంలో పేర్కొన్నారు.

సూర్యునివల్ల ఏ విధంగా, ఏయే రోగాలు నివారించబడతాయో ఓ అధ్యాయంలో వివరించారు. సప్తవర్ణాల ఆవిష్కర్తలైన భారతీయ ఋషులు పేర్కొన్న 'సూర్యకిరణ చికిత్స' గురించి, ఆధునికులు అంటున్న 'క్రోమోథెరపీ' గురించి వివరంగా రచయిత పేర్కొన్నారు.

గ్రంథారంభంలో 'శ్రీ ఆచార్య వేదవ్రత మీమాంసక' (ఆర్ష గురుకులం, వడ్లూరు, కామారెడ్డి) వ్రాసిన భూమిక పుస్తకానికి నిజమైన 'సమీక్ష' సూర్యప్రశస్తి ఉన్న ఎన్నో మంత్రాలను ఇందులో ఉదహరించారు.

150 పేజీల ఈ విజ్ఞాన పుస్తకంలో 17 అధ్యాయాలు వున్నాయి. సూర్యుని ఉత్పత్తి, ప్రాచీన ఋషుల, ఆధునిక వైజ్ఞానికుల దృష్టిలో సూర్యుడు, వేదాలలో సూర్యుని ప్రస్తావన, ప్రాచీన ఆధునిక సూర్యకిరణ చికిత్సా పద్ధతులు, పరికరాలు... ఇలా ఎన్నో ఈ గ్రంథంలో పేర్కొనబడ్డాయి.

ఈ పుస్తకం 'విద్వాంసులకు' పరిశోధనా ప్రేరకం ! సూర్యుని నుండి భూమికి చేరే కొద్దిపాటి (!) సౌరశక్తిని మనం చక్కగా వినియోగించుకొనేలా పరిశోధనలు జరగాలనే రచయిత ఆకాంక్షించారు. సంస్కృత విద్వాంసులు, వేదాచార్యులూ, ఆధునిక వైజ్ఞానికుల సమిష్టి కృషితో ఈ పని జరగాలంటూ గ్రంథాన్ని ముగించారు రచయిత.

సంవత్సరములో ఎక్కువ దినాలు 'సూర్యకిరణాలు' ఉండే మన దేశంలో, వేదాచార్యులు, విజ్ఞానవేత్తలు కోకొల్లలుగా ఉన్న మనదేశంలో కాక ఈ పరిశోధన మరెక్కడ జరుగుతుంది ?

– బి.ఎస్. శర్మ

# వ్యాధులపై ఇంద్ర ధనుస్సు ప్రభావం

(ఉపోద్ఘాతము)

'అందాల హరివిల్లు (ఇంద్ర ధనుస్సు) ఆరోగ్యాన్నిస్తుంది' అంటే ఆశ్చర్యంగా ఉందా? తెలియని వారికి ఆశ్చర్యంగానే ఉంటుంది. వాతావరణం నీటి తుంపరలతో నిండి ఉన్నప్పుడు సూర్యాభిముఖంగా ఆకాశంలో కనువిందు చేసే ఇంద్ర ధనుస్సులో ఏడు రంగు లుంటాయి. ఒక్కొక్క రంగులో ఒక్కొక్క విశేషత ఉంది. అందులోని నీలం రంగులు (VIB), చలువ చేస్తే ఎరుపు రంగులు (YOR) వేడి చేస్తాయి. మధ్యలో ఉండే ఆకుపచ్చ (G) శీతోష్ణాలు రెంటిని సమపాళ్ళలో ఉంచే ఒక అద్భుతమైన రంగు. అదే సృష్టికి సౌందర్యాన్ని మనకు ఆహారాన్ని, ఆరోగ్యాన్ని, అందాన్ని, ఆనందాన్ని యిస్తున్నది. నీలం రంగులైన ఊదా, గాఢ నీల, ఆకాశ నీలాలు పిత్తోద్రేకాన్ని తరతమ భేదాలతో శమింపచేస్తాయి. ఉద్రేక ఉద్రిక్తల నుండి కాపాడుతాయి. ఎరుపు రంగులైన పసుపు, నారింజ ఎరుపు రంగులు తరతమ భేదాలతో వాతశ్లేష్మాలను శమింపచేస్తాయి.. ఆకుపచ్చరంగు రక్తాన్ని శుద్ధి చేసి, వాత పిత్త కఫాలను సరియైన స్థితిలో ఉంచుతూ ఆరోగ్యాన్ని యినుమడింపచేస్తుంది. ఇంతేగాక ఈ ఏడు రంగులలో దేని ప్రత్యేకత దానికుంది. ఒక్కొక్క రంగు ఎన్నెన్నో వ్యాధులను పోగొడుతుంది. యుక్తితో ప్రయోగిస్తే ఈ ఏడు రంగులు సమస్త వ్యాధులను పోగొట్టగలవు. అవి ఏయే వ్యాధులను ఏ విధంగా పోగొట్టగలవో ఈ పుస్తకంలో వివరించబడింది.

పరమేశ్వరుడు సృజించిన పంచ భూతాలలో పృథివ్యాపస్తేజో వాయురాకాశాలలో మూడవ భూతం (ఉనికి గల పదార్థం) తేజస్సు. దానినే ప్రకాశం - కాంతి - వెలుతురు - వేడి అని పిలుస్తూ ఉంటారు. దాని రంగు తెలుపు. అట్లని పాలవంటి తెలుపుకాదు. అది ఏడు రంగుల కలయికతో ఏర్పడిన స్వచ్ఛమైన పారదర్శక తెలుపు. అది ఏ రంగును త్యాగం చేస్తుందో ఆ పదార్థం ఆ రంగుగా కనబడుతుందని వర్ణ సిద్ధాంతం చెబుతుంది.

నలుపు రంగు ఏడు రంగులను మ్రింగేస్తుంది. కనుక అది నల్లగా కనబడుతుంది. నలుపు స్వార్థి. అందుచేతనే దానిని తమస్సు అన్నారు. తెలుపు రంగు ఏడు రంగులను త్యాగం చేస్తుంది. అప్పుడు ఆ ఏడు రంగులు కలిసిపోయి తెల్లగా ప్రకాశిస్తుంది. అందుచే అది త్యాగి - సత్త్వం. రంగు అద్దంలో నుండి కాంతి ప్రసరించినప్పుడు అది తన రంగును మాత్రమే రెండవ వైపు ప్రసరింపనిస్తుంది. మిగిలిన రంగులను మ్రింగివేస్తుంది (తనలో విలీనం చేసుకుంటుంది). అందుచే మనకు ఏ రంగు కాంతి అవసరమో దానిని ప్రకాశం

నుండి వేరుచేసి విడిగా పొందవచ్చు.

ప్రకాశం ఒక పదార్థం. ప్రకాశించే వస్తువులనుండి అనేక సూక్ష్మపరమాణువులు నియమిత తరంగ చలనంతో ఆకాశంలో నలు దిక్కులా ప్రసరిస్తాయి. సామాన్యంగా కాంతి సూర్య చంద్ర నక్షత్రాదుల నుండి, వివిధ దీపాల నుండి, అగ్ని నుండి, రేడియం వంటి కొన్ని ధాతువులలో నుండి ప్రసరిస్తుంది. వీటన్నిటిలో సూర్య ప్రకాశమే అన్నిటికన్న పెద్దది. చికిత్సకు కూడా సూర్య ప్రకాశమే (కిరణాలే) శ్రేష్ఠతమంగా ఉంటుంది. ఆ కిరణాలకు శరీరంలోనికి పదార్థాలలోనికి చొరబడే శక్తి ఎక్కువగా ఉంటుంది. అవి మన శరీరంపై ప్రసరించినప్పుడు చర్మం ద్వారా లోపలి అవయవాలలోనికి చొచ్చుకుపోగలవు. మనం మందులుగా నిర్మించదలచుకొన్ని నీరు, చెక్కర, తైలం మొదలైన పదార్థాలలోనికి బాగా చొచ్చుకొనిపోయి చాలాకాలం వరకు అందులో నిలువ ఉండగలవు. వాటిని మనం సేవించినప్పుడు శరీరంలో ప్రవేశించి వ్యాదులను పోగొట్టగలవు. అనేక విధములైన ఔషధ చికిత్సల కన్నను, ఆహార జల వాయు విద్యుత్ అయస్కాంత చికిత్సల కన్నను సూక్ష్మమైన చికిత్స యిది. అందుచేతనే దీనిని సునిశిత చికిత్స (Fine Force Treatment) అన్నారు.

ప్రకాశ కిరణాలన్నిటిలో ఉండే పరమాణువులు ఒకే విధమైనప్పటికి అవి సప్త విధాల తరంగ దీర్ఘతలతో ప్రసరిస్తాయి. ఒకొక్క తరంగ దీర్ఘత ఒక్కొక్క రంగును సృష్టిస్తుంది. అందులో ఏ రంగు ప్రత్యేకత ఆ రంగుకు ఉంది. ఒక రంగు చేయగల పని మరొక రంగు చేయలేదు. ఉదాహరణకు రోగ క్రిమి సంహారకముగా ఆకాశ నీలం కాంతి పనిచేసినంతగా మరొకరంగు చేయలేదు. అది గొప్ప క్రిమి సంహారిణి అందుకు నా స్వానుభవమే సాక్ష్యం. సుమారు ముప్పై ఐదు సంవత్సరముల క్రింత నా క్షయ వ్యాధిని (క్రిములను) ఆనాటి స్ట్రెప్టోమైసిన్, పి. ఎ.ఎస్., ఐసోనియాజిడ్ అధిక పరిమాణములో ఇచ్చినా పోగొట్టలేక పోయినవి. అప్పుడు ప్రాకృతిక చికిత్సకు వెళ్ళగా వారు ఆహార నియంత్రణతో బాటు ఛాతికి నీలం కాంతిని ప్రసరింపచేసి తడికట్టు (చురుకుకట్టు) వేసేవారు. దానితో ఏ విధమైన మందులు లేకుండానే రెండు, మూడు నెలలో క్షయ క్రిములు పూర్తిగా నశించి పోయాయి. లోపలి గాయాలు (Cavities) పూర్తిగా మానిపోయాయి. అప్పటి నుండి ఇప్పటి వరకు (చాలా తక్కువ ఆహారంతో చాలా కాలం చాలా బలహీనంగా ఉన్నా) క్షయ క్రిములు నా శరీరంపై ఆక్రమణ చేయలేక పోయాయి.

ఈ చికిత్స కొంతవరకు జీవరసాయనిక చికిత్స ( Bio Chemic Treatment) ను పోలి ఉంటుంది. మన శరీరంలో పోషకాహార లోపంవల్ల లేదా సప్తధాతు నిర్మాణ ప్రక్రియ (Metabolism) దెబ్బతినడం వల్ల కొన్ని రసాయనాల (లోహలవణాదుల) లోపం ఏర్పడుతుంది. అప్పుడు శరీరంలో కొన్ని వ్యాధులు, బాధలు ఏర్పడుతాయి. మరల ఆ

జీవ రసాయనాలను ఆహార, ఔషధాల ద్వారా పూరిస్తే ఆ వ్యాధులు, బాధలు పోతాయి. అట్లే శరీరంలోని అవయవాలలో ఏడు రంగులుంటాయి. ఒకటిగాని, రెండు, మూడు రంగులు గాని కలిసి ఉండవచ్చు. ఆ రంగులు ఉండవలసిన పరిమాణములో కన్నా ఎక్కువ తక్కువలు ఏర్పడితే కొన్ని వ్యాధులు, బాధలు వస్తాయి. మరల వాటిని సూర్యకిరణ చికిత్స ద్వారా సరిచేస్తే ఆ వ్యాధులు, బాధలు పోతాయి. ఉదాహరకు శరీరంలో ఇనుము (Iron) లోపిస్తే రక్తలేమి (Anaemia), నీరసం, నిస్సత్తువ, గుండెదడ, ఆయాసం మొదలునవి కలుగుతాయి. అప్పుడు ఇనుముగల ఆహార పదార్థాలను ఇవ్వటంవల్ల లేదా స్థూల సూక్ష్మరూపంలో ఇనుమును ఔషధముగా ఇచ్చుటవల్ల పై బాధలు పోతాయి.

అల్లోపతి వైద్యులు ఇనుమును స్థూల రూపంలో ఐరన్ టాబ్లెట్లుగా ఇస్తారు. ఆయుర్వేద వైద్యులు ఇనుమును శుద్ధిచేసి పుటములు పెట్టి భస్మము చేసి లోహభస్మముగా ఇస్తారు. హోమియో వైద్యులు శుద్ధి చేసిన ఇనుమును 3X, 6X, 12X పొటెన్సీలుగా మార్చి ఇస్తారు. ఔషధ ప్రక్రియలో ఇవి ఒకదానికన్న ఒకటి శ్రేష్ఠంగా ఉంటాయి. విచిత్రమేమంటే పై ఆహార, ఔషధాలు ఏమి లేకుండానే కేవలం ఎరుపు రంగు కాంతిని ప్రసరింపచేసిన నీటిని త్రాగిస్తే కూడా ఇనుముయొక్క లోపము పోయినట్లు డా. బాబిట్ గారి పరిశోధనలో వెల్లడయ్యింది. ఇది మేధావులు గమనించవలసిన, ఆలోచించవలసిన విషయము.

సూర్యుని నుండి వెలువడే ప్రకాశ కిరణాలలో ఎన్ని రంగులున్నాయి? అనే విషయంలో న్యూటన్ కన్న పూర్వులలో రకరకాల అభిప్రాయాలున్నాయి. అరిస్టాటిల్ పసుపు, తెలుపు, నలుపు ప్రధాన వర్ణత్రయమని, వాటి నుండే మిగతా రంగులన్ని నిర్మించబడ్డాయని అన్నాడు. పైథాగరస్ పసుపు, తెలుపు, ఎరుపు, నలుపు ప్రధాన వర్ణములన్నాడు. కంటిలో అంతర్ముఖమగు తేజస్సువల్లనే ప్రకాశకిరనాలు కనబడుతున్నాయని ప్లేటో భావించాడు. అందుచేతనే నేటి వైజ్ఞానికులంతా సూర్యకిరణాలలో సప్తవర్ణాలున్నాయని చెప్పిన మొదటి వ్యక్తి న్యూటన్ అనే అనుకుంటున్నారు. అది పొరపాటు.మన ప్రాచీన బ్రాహ్మణ, ఆరణ్యక, స్మృతి పురాణ ఇతిహాసాలైన వైదిక సాహిత్యంలోనూ, కావ్య పురాణాదులలోను, చివరకు జనపద గేయాలలో కూడా సూర్యుడు సప్తాశ్వరథారూఢుడని అలంకారికంగా వర్ణించబడ్డాడు. అశ్వపదానికి (అశు గచ్ఛతి) వేగంగా పయనించేది అని యర్థము. కాంతి వేగం అన్నిటికన్న ఎక్కువని మన అందరకు తెలిసిందే. అట్టి వేగవంతమైన అశ్వములు (కిరణాలు) ఏడు ఉన్నవని ఆ వర్ణనల అభిప్రాయం. కావున, సప్త వర్ణాల ఆవిష్కర్తలు భారతీయ ఋషులే. వారి ఈ జ్ఞానానికి మూలం పరమేశ్వర ప్రదత్త వేదం - జ్ఞానం - విజ్ఞానం. వేదాలలో సూర్యుని గురించి, సూర్యకిరనాల గురించి ఎంత స్పష్టంగా వర్ణించబడిందో "సృష్టికర్త (వేదాల) దృష్టిలో సూర్యుడు" అనే ప్రకరణం చదివితే అవి ఎంత మహత్త్వ పూర్ణమైనవో మీకే బోధపడుతుంది.

ఆరు బయట ఎండలో పని పాటలు చేసుకొనే వారికి సామాన్యంగా వ్యాధులు రావు. అరుదుగా వచ్చినా ఉపవాస, జల చికిత్సలతో 2, 3 రోజులలోనే నయమౌతాయి. ఎప్పుడూ నీడ పట్టునే ఉంటూ సరియైన ఆహార పానీయాలు, వ్యాయామం లేనివారే తరచు రోగాలకు గురౌతారు. అట్టి సుకుమారులకు వ్యాధి నయం కావడం కూడా ఆలస్యమౌతుంది. వారు దీర్ఘ వ్యాధులతో బాధపడుతు, అల్లోపతి మందులతో తాత్కాలిక ఉపశమనం పొందుతు సతమత మౌతుంటారు. అట్టి వారికి ప్రాకృతిక చికిత్సలు గొప్పమేలు చేస్తాయి. వాటివల్ల రోగ నివారణ యగుటయేగాక శరీరం నుండి రోగ పదార్థం బయటకు పోవడంవల్ల ఉత్సాహంగా, ప్రసన్నంగా ఉంటారు. ఆరోగ్యంగా ఉన్నవారు సౌమ్యమైన ఎండలో వీలైనంత తక్కువ దుస్తులు ధరించి కొంతసేపు విహరిస్తే సరిపోతుంది. సామాన్య సూర్యరశ్మి నుండి కావలసిన రంగులను వారి శరీరం గ్రహిస్తుంది. కాని, వ్యాధి దశలో సూర్యరశ్మి నుండి శరీరం కావలసిన రంగును గ్రహించలేకపోతుంది. అప్పుడు రోగికి అవసరమైన రంగును సూర్యరశ్మినుండి వేరుచేసి అందించవలసి ఉంటుంది. అందుచేతనే ఈ సూర్య కిరణ చికిత్సను (Chromo Therapy) రూపొందించవలసి వచ్చింది. ఆ పరిశోధనలలోనే సప్త వర్ణాలు అద్భుతమైన సప్త ఔషధాలని వెల్లడయ్యింది. కాన, సప్త వర్ణాల ఇంద్ర ధనుస్సు వ్యాధులను పారద్రోలే అద్భుతమైన ఆయుధం.

సూర్యకిరణాల వల్ల కేవలం పై ఔషధ ప్రయోజనమే కాక ప్రకాశం, శక్తి (Heat and Energy). విద్యుత్తు అనే మూడు ముఖ్య ప్రయోజనాలు సిద్ధిస్తాయని వేదం చెపుతోంది. సృష్ట్యాదిలోనే మన ఋషులు ఆ జ్ఞానాన్ని అందుకొని అద్భుతమైన ఆవిష్కారాలు సాధించారు. అందలి కొన్నిటిని మాత్రమే నేటి వైజ్ఞానికులు అందుకున్నారు. మరికొన్నిటికై తీవ్రంగా కృషి చేస్తున్నారు. ఉదాహరణకు భరద్వాజ మహాఋషి తన బృహద్ విమాన శాస్త్రంలో పెట్రోలు, బొగ్గు వంటి ఇంధనము లేకుండానే సూర్యకాంతినుండి నేరుగా విద్యుత్తును గ్రహించి విమానాలు నడుపవచ్చని తన అనుభవాన్ని ప్రకటించాడు. కాని, నేటి విజ్ఞాన శాస్త్రం ఎంత పురోగమించినా నేటికీ అట్టి విమానాలు నిర్మించలేకపోయింది. కలియుగ మహర్షిగా కొనియాడదగిన మహర్షి దయానందుడు తన వేదభాష్యంలో "సూర్యుని నుండి విద్యుత్తును సేకరించి యంత్రాలను నడుపవచ్చు" నని చేసిన సూచనను వంద సంవత్సరాల తర్వాత నేటి విజ్ఞానం అందుకొని టెలిఫోన్లను, చిన్న యంత్రాలను నడుపుచున్నది. "సూర్యుని నుండి విద్యుత్తు, ప్రకాశం, శక్తి" అనే ప్రకరణం చదివితే ' ఋషులు విజ్ఞానవేత్త' లనే ఆర్యోక్తి అతిశయోక్తి కాదని మీకు అర్థమౌతుంది.

సూర్యకిరణ చికిత్సకు మూలం సూర్యుడు. కనుక సూర్యుని గురించి ఈ పుస్తకంలో విశేషంగా చర్చించబడింది. సూర్యుని ఉత్పత్తి నుండి ప్రారంభించి నేటి వరకు సూర్యుని గురించి ప్రాచ్య పాశ్చాత్య మేధావుల - విజ్ఞాన వేత్తల అభిప్రాయాలు చర్చించబడ్డాయి.

మానవ మేధస్సుకు ఆదిమూలమైన వేదాల నుండి సూర్య పరమైన, ముఖ్యంగా చికిత్సా పరమైన మంత్రాలు కొన్ని వ్యాఖ్యానించబడ్డాయి. విదేశీ తత్త్వవేత్తలకు ఈ సృష్టి ఏ మూల పదార్థంతో నిర్మించబడిందో దాని సరియైన అవగాహనయే లేదన్నను అతిశయోక్తి కాదు. ఏలన థేల్స్ సర్వ పదార్థాలకు బలమే కారణమన్నాడు. మరికొందరు విద్యుత్తు కారణమన్నారు. నేటి విజ్ఞాన వేత్తలు పరమాణువులు కారణమంటున్నారు. ఐతే మన ప్రాచీన ఋషులు మరింత లోనికి వెళ్ళి సత్త్వరజస్తమస్సులనే సూక్ష్మతమ పరమాణువులు కారణమన్నారు. వీటికే ప్రకృతియని నామకరణం చేశారు. దాని నుండి ఈ సృష్టి ఎలా ఉద్భవించిందో "సూర్యోత్పత్తి" ప్రకరణంలో సంక్షిప్తంగా చర్చించబడింది. తినబోతూ రుచి అడగనేల? చదవండి. అన్ని మీకే అవగతమౌతాయి.

నేను గురువుల నాశ్రయించి విద్య నభ్యసించిన విద్వాంసుడను కాను. విజ్ఞాన శాస్త్ర పట్టభద్రుడను కాను. స్వాధ్యాయ మనన చింతనా ధోరణులు గల ఒక సామాన్య జిజ్ఞాసువును మాత్రమే. నా బుద్ధి గ్రహించ గలిగినంత వ్రాసితిని. ఇందేవైనా దోషములున్న విజ్ఞులు తెలిపిన పునరాలోచించి మలి ముద్రణమున సవరించుకొనగలను. కొందరు మిత్రుల సూచనమేరకు ఈ పుస్తకం నేటి వ్యవహార భాషలో వ్రాసాను. పాఠకుల స్పందన ఎట్లుండునో వేచి చూడాలి.

**మేధార్థి తిరిగి ముముక్షువుగా..**

పది సంవత్సరాల క్రిందట నాకు ఈ కామారెడ్డి ఆర్షగురుకులంతో సంబంధమేర్పడింది. అప్పటి నుండి నెలకొక వారం దినాలు ఈ గురుకులంలో గడుపుతూ యోగ మార్గాభిరుచిని పెంచుకొంటిని. నా ప్రవృత్తిని గమనించిన ఈ గురుకులాచార్యులు నాకు 'ముముక్షువు' అనే ఉపనామం పెట్టారు. తదుపరి దీర్ఘకాలంగా ఉన్న మందాగ్ని వ్యాధివలన నా శరీరం క్రమంగా క్షీణిస్తూ 3 సంవత్సరాల క్రిందట ఏమి చేయ్యలేని అశక్తుడనయ్యాను. అప్పుడు అన్ని వ్యాపకములు విరమించుకొని ఆర్ష గురుకులం (కామారెడ్డి) చేరుకొంటిని. ఇక్కడి స్వచ్ఛమైన గాలి, నీరు, విశ్రాంతి వల్ల విచిత్రంగా కొంత శక్తి సమకూరింది. సంస్కృతం నేర్చుకుంటూ దర్శనాల నధ్యయనం చెయ్యాలని ప్రయత్నించాను. కాని అంత శ్రమను నా శరీరం ఓర్చుకోలేక పోయింది. అందుచే మితంగానే స్వాధ్యాయ మనన చింతనలు చేస్తూ వ్రాయుటకు ప్రయత్నించాను. 'వేదాలలో జల చికిత్సా విజ్ఞానం' మరియు ఈ పుస్తకంలో కొంత భాగం వ్రాయగలిగాను. కాని, మరల మందాగ్ని ఆక్రమణతో అశక్తుడనయ్యాను. ఎట్లో ఈ పుస్తకం పూర్తి చేసాను. అప్పటి ఉత్సాహంలో 'మేధార్థి' కలం పేరుతో కొన్ని పుస్తకాలు, వ్యాసాలు వ్రాయలని ఉబలాటపడి ముందు పుసక్తంలో మేధార్థి పేరు వ్రాసుకున్నాను. కాని, ఇప్పటి దేహ పరిస్థితిని బట్టి

మరల పుస్తకాలు వ్రాయగలిగే శక్తి (ఆరోగ్యం) కనుచూపు మేరలో కనబడుట లేదు. అందుచే ఆ కలం పేరు ఆ పుస్తకం వరకే పరిమితం చేసి ముముక్షువుగా ఈశ్వర ప్రార్థనోపాసనలలో శేష జీవితం గడపాలనుకుంటున్నాను.

## కృతజ్ఞతలు

ఇటీవల వ్రాసిన రెండు పుస్తకాలు ఈ గురుకులాచార్యులు ఆచార్య వేదవ్రత మీమాంసకుల వారి పూర్తి సహాయ సహకార ప్రోత్సహాలతోనే వ్రాయగలిగాను. వారే దోషాలను సవరించారు. సైద్ధాంతిక పొరబాట్లను సూచించారు. తెలియని వేద పదాలకు అర్థం చెప్పారు. సమ్మతి వ్రాసి సంతోషపరిచారు. వారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు. శ్రీ మనస్వీ వానప్రస్థిగారు భాషా దోషాలు సవరించి సహకరించారు. బ్రహ్మచారిణి స్వరూప (ఇందూరు) మరియు విద్యార్థిని విద్యాశ్రీ గార్లు ముద్రణాలయ ప్రతిని వ్రాసి పెట్టారు. ఈ గురుకుల బ్రహ్మచారులు, కర్మచారులు నాకు ఏ యిబ్బంది కలుగకుండా అనేక సేవలు చేశారు. ఈ గురుకులానికే అంకితమై సేవ చేయుచున్న శ్రీ మనస్వీ వానప్రస్థి గారు మరియు యువాచార్యులు శ్రీ సత్యవీర్ గార్ల సత్సంగ సానుభూతి సహకారాలు మరువరానివే. వీరందరికి నా హృదయపూర్వక ధన్యవాదములు.

ఈ గురుకులం నాకెన్నెన్నో సేవలు చేయుటయే గాక వార్షికోత్సవ సందర్భమున వేదికపై సన్మానించి పదివేల రూపాయలను పారితోషికంగా యిచ్చినది. అర్హత లేని నాకు ఆ సన్మానం భారమే అయ్యింది. గురుకులం వారి ఆదరణను కాదనలేక అంగీకరించాను. దానితో ఈ గురుకులానికి, వైదిక ధర్మానికి మరింత ఋణపడ్డాను. ఆ పారితోషికమును ఈ పుస్తక ముద్రణకై మా 'గాయత్రీ ఆశ్రమ' న్యాసమున కొసంగుచున్నాను. మరొకసారి గురుకులవాసు లందరికి కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

ఆర్షగురుకులం, కామారెడ్డి
వృష యుగాది

విన్నవించు
ఒక ముముక్షువు
**కోడూరి సుబ్బారావు**



# సూర్య విజ్ఞానం-మరికొన్ని విశేషాలు

(భూమిక)

ఆచార్య వేదవ్రత మీమాంసక

ప్రపంచమున ప్రథమ పౌరుషేయగ్రంథము మనుస్మృతి. ఈశ్వరీయ జ్ఞానము తరువాత అదియే మానవులకు ఆది సంవిధానము. అందు భూతం భవ్యం భవిష్యచ్చ సర్వం వేదాత్ ప్రసిద్ధ్యతి॥ మను.12-97॥ భూతభవిష్యత్‌వర్తమానకాలాలలో సకల పదార్థముల సమస్తజ్ఞానము వేదములనుండియే లభించు నని తెలుపబడినది. అటులే యాజ్ఞవల్క్యస్మృతియందు

న వేదశాస్త్రాదన్యత్తు కించిచ్ఛాస్త్రం హి విద్యతే ।
నిస్సృతం సర్వశాస్త్రం తు వేదశాస్త్రాత్ సనాతనాత్ ॥

వేద శాస్త్రమును మించిన వేరొక శాస్త్రము లేనేలేదు. ప్రతిశాస్త్రము శాశ్వత జ్ఞానమైన వేదశాస్త్రమునుండి వెలువడిన దని వ్రాయబడినది. ఇటులే వేదముల గూర్చి అనేక ఆర్షగ్రంథములందు వ్రాయబడినది. సమస్త వేదానుయాయులు "వేదములు ఈశ్వరునిచే మానవునికి ప్రసాదింపబడిన సకల విద్యాగ్రంథము"లని విశ్వసింతురు.

దాదాపు 3800 మూడువేల ఎనమిదివందల సంవత్సరములకు పూర్వము అరబదేశవాసి యగు "లాబీ" యనబడు ఒకానొక కవి నాలుగు వేదము లీశ్వరునిచే ప్రకటింపబడిన గ్రంథము లని, అవి విశ్వసౌభ్రాతృత్వమును బోధించుచున్న వని, వాటి ననుసరించుట వలన ముక్తి లభించు నని తన కవిత్వములో పొందుపరచియున్నాడు."

"బేరట్ పబ్లిషింగ్ కంపనీ, బేరట్, పాలస్టైన్" చే ప్రకటించబడిన గ్రంథమునుండి (ఈ పుస్తకము యొక్క హిందీ అనువాదము ఆర్షగురుకులము వడ్లూరునందు గలదు.)

ప్రొఫెసర్ హీరేన్ (Prof. Heeren) ఒక ప్రసిద్ధ పరిశోధకుడు, ఇతిహాసవేత్త, క్రైస్తవ విద్వాంసుడు. వేదముల గూర్చి ఆయన మంతవ్యము క్రింద వ్రాయబడుచున్నది.

They (The Vedas) are without doubt the oldest works composed in Sanskrit. Even the most ancient Sanskrit writings allude to the Vedas as already existing. The Vedas stand alone in their solitary splendour standing as beacon of Divine light for the onward march of Humanity.

Historical Researches by prof. Heeren. Vol. II. P. 127

అర్థము: వేదములు సంస్కృతమునందు ప్రాచీనతమ గ్రంథములు. సంస్కృతమున లభించు అన్నిటికన్న పురాతన గ్రంథములందు సహితము అవి యున్నటుల స్పష్టమైన సంకేతములు కాననగును. అవి తమ అద్భుత గౌరవమున సకల మానవుల ఉన్నతికొరకు దివ్యప్రకాశస్తంభము వలె ఉపకరించుచున్నవి.

ఇదేవిధముగ దేశ విదేశములందలి వివిధ విద్వాంసులు వేదముల గౌరవమును కొని యాడిరి. వాటి నన్నిటి నిచట పేర్కొనుట అసాధ్యము. అనవసరము. పైన కేవలము రెండు ప్రమాణములు మచ్చున కొసగబడినవి.

పూర్వము ప్రపంచమునందలి మానవులందరు వేదములు ఈశ్వరునిచే ప్రదానము చేయబడిన సమస్త విద్యల గ్రంథము లని, వాటినుండి సమస్త విద్యలు వెలువడిన వని. అవియే ప్రపంచమున వ్యాపించిన వని భావించుచుండి రనియు తెలిసినది.

వేదములలో పృథివిమొదలుకొని సూర్యునివరకు గల సకల పదార్థముల విజ్ఞానము గలదు.

మనము ఈ పృథివిపైన జన్మించితిమి. దీనిపైననే జీవించుచున్నాము. మన జీవితానికి భూమివలెసూర్యుడును ఆధారము. సూర్యుని నిర్మించి, ధరించి దానితోపాటు దాని నాశ్రయించి తిరుగుచున్న సమస్త గ్రహోపగ్రహములను అదుపులో నుంచినవాడు సర్వేశ్వరుడు. ఇదే విధముగ వేదములలో పేర్కొనబడియున్నది.

**యేన ద్యౌరుగ్రా పృథివీ చ దృఢా యేన స్వః స్తభితం యేన నాక ః ।**

**యో అంతరిక్షే రజసో విమానః కస్మై దేవాయ హవిషా విధేమ ॥ ఋగ్. 10-121-5॥**

అర్థము : ఉగ్రస్వరూపముగల ద్యులోకము (సూర్యుడు) మరియు దృఢమైన పృథివి (భూమి) ఎవనిచే నియంత్రితమై యున్నవో, ఎవనిచే సుఖము ధరించబడి యున్నదో, ఎవడు అంతరిక్షము (ఆకాశము) న లోకములను వివిధ ఆకారములతో కూర్చి తన స్వాధీనములో నుంచుకొని వివిధ సునిశ్చిత మార్గములలో నుంచి త్రిప్పుచున్నాడో, అట్టి ఆనందస్వరూపుడైన పరమాత్మునికి శరీరము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, జ్ఞానము సుఖము మున్నగు సకలపదార్థములు మనవి కావని అతనివే యని సమర్పించి అతని నుపాసింపవలయును.

పరమేశ్వరుడు అనేక సూర్యగోళములను వాని నాశ్రయించు గ్రహములను, గ్రహముల నాశ్రయించు ఉపగ్రహములను నిర్మించును. గ్రహములపై మానవులను పశుపక్ష్యాదులను నిర్మించును. వాటి జీవితమున కవసరమగు అన్నాదులను నిర్మించును. గ్రహోపగ్రహములు, వాటియందలి సకల పదార్థములు, సూర్యాది నక్షత్రములు వాటియందలి సర్వపదార్థములు ప్రాణుల సుఖముకొరకే యని తెలియవలయును. ఒక్కమాటలో పేర్కొనదలచిన ఎడల సమస్త ప్రపంచము, వేదజ్ఞానము ప్రాణుల సుఖము కొరకే యనవచ్చును.

కర్మయోనులు భోగయోనులు అని ప్రాణులు రెండు విధములు. మానవులు కర్మయోనులు, భోగయోనులు. ఇతర ప్రాణులు కేవలము భోగయోనులు. భోగయోనులు తమ స్వాభావిక జ్ఞానమును ఎక్కువ తక్కువ చేసికొన జాలవు. కావున అవి సృష్టినియమముల

నుల్లంఘించజాలవు. మానవు డటుల కాదు. అతనికి ఉన్నతిని అవనతి ననుభవించు సామర్థ్యముకలదు. దానిచే అతడు వేదములను చదివి, ధర్మము నాచరించుచు, సకల ప్రాణుల సుఖముకొరకు ప్రయత్నించుచు సకల దుఃఖములను వదలగలడు. అధర్మము నాచరించుచు సృష్టి నియమములను వ్యతిరేకించి రాత్రింబవళ్ళు విషయ భోగములలో, పరుల కపకారము చేయుటలో నిమగ్నుడై దారుణ దుఃఖము ననుభవించగలడు.

మానవుడు కర్మల నాచరించుటలో స్వతంత్రుడు. కావున అతడు సర్వవిద్యలకు నిలయమైన వేదములను చదివి వానిని తెలిసికొనవలసి యుండును, అనుసరించవలసి యుండును. దానితో సమస్త సుఖముల ననుభవించుచు ఇతరులకు సుఖముల నొసగవలసి యుండును. ఇది మానవునికి సాధ్యము.

మానవుడు సుఖము ననుభవించుటకు దుఃఖమునుండి విముక్తు డగుటకు తెలిసికొనవలసిన అనేక విషయములలో మొదటిది సర్వశ్రేష్ఠమునైనది ఆరోగ్యవిద్య. ఆరోగ్యమున కవసరమగు అనేక విషయములలో ఒకటి సూర్యుడు.

సూర్యునిగూర్చి వేదములలో విశదముగా వివరించబడినది. ఉదాహరణకు :- అథర్వవేదమునందలి 13వ కాండము. అందు సూర్యునకు సంబంధించిన అతి సూక్ష్మవిజ్ఞానము గలదు. నాలుగు వేదాలలో సూర్యునికి సంబంధించి అనేక సూక్తములు, మంత్రములు గలవు.

వేదములలోగల శబ్దములు యౌగికములు - అన్వర్థకములు. వేదార్థము నెరుగగోరు వారీ విషయమును దృష్టియం దుంచుకొనవలయును. వేదములలో సూర్యునికి వివిధ నామములు గలవని వేదమువలననే తెలియుచున్నది. ఉదాహరణకు :

**స ధాతా స విధాతా స వాయు : ..॥ అథర్వ. 13-4-3 ॥**

**సో z ర్యమా స వరుణః స రుద్రః స మహాదేవః ॥ అథర్వ. ॥ 13-4-4**

**సో అగ్నిః స ఉ సూర్యః స ఉ ఏవ మహాయమ : ॥ అథర్వ. ॥ 13-4-5**

**అర్థము** : అతడు ధాతా, విధాతా, వాయువు, అర్యమా, వరుణుడు, రుద్రుడు, మహాదేవుడు, అగ్ని. అతడే సూర్యుడు. అతడే మహాయముడు.

ఈ మంత్రములలో సూర్యునికిగల నామములలో ఉదాహరణకొరకు కేవలము దశనామములు సూచించబడినవి. వేదములలో కేవలము ఈ నామములతోనే సూర్యుడు పేర్కొన బడలేదు. సవితాది అనేక ఇతర నామములును గలవు.

సూర్యుడు, ధాతా మున్నగు నామములచే ఎందుకు వ్యవహరించబడు నను ప్రశ్నకు వేదమే సూచనప్రాయముగా సమాధాన మొసగుచున్నది. చూడుడు: -

**స వరుణః సాయమగ్నిర్భవతి స మిత్రో భవతి ప్రాతరుద్యన్। స సవితా భూత్వాంతరిక్షేణ యాతి స ఇంద్రో భూత్వా తపతి మధ్యతో దివం... ॥ అథర్వ. 13।3।13॥**

**అర్థము:** అతడు వరుణుడు, సాయంకాలము అగ్నియగును. అతడు ప్రాతఃకాలమున ఉదయించుచు మిత్రు డగును. అతడు సవితయై అంతరిక్షమార్గమున పయనించును.

అతడు ఇంద్రుడై ద్యులోకమున తపించును.

ఇదేవిధముగ సూర్యుని గుణములను బోధించు అనేకనామములు గలవు. బ్రాహ్మణాది అర్షగ్రంథములలో అనేక నామములతో సూర్యుని గుణములు పేర్కొనబడినవి. లౌకిక సంస్కృత భాషలో సూర్యునికి దాదాపు 60 అరువది శబ్దములు గలవు. అవి సూర్యుని విభిన్నగుణములను బోధించును. ఆశబ్దములలో కొన్నింటికి అర్థములు నిఘంటు నిరుక్తములలో, మరికొన్నింటికి బ్రాహ్మణగ్రంథములలో, ఇకకొన్నింటికి సత్యార్థ ప్రకాశము ప్రథమసముల్లాసములో మరికొన్నింటికి అమరకోశము రామాశ్రమీ టీకా, ఉణాదికోశము మున్నగు గ్రంథములలో లభించగలవు. వేదములలో ఆయానామములతో సూచించబడిన అతని (సూర్యుని) గుణములను సమగ్రముగ తెలిసికొనుట శ్రమ సాధ్యము. బహుశః అందుకు ఒకమానవుని ఆయుష్యము సరిపోకపోవచ్చును.

వేదములు, బ్రాహ్మణములు, అరణ్యకములు, ఉపనిషత్తులు, వేదాంగములు, ఉపాంగములు, అష్టాంగ ఆయుర్వేదము, వాటివ్యాఖ్యానములు, ఉపవ్యాఖ్యానములు, వైదిక సంస్కృత సాహిత్యము, రామాయణ మహాభారత పురాణ కావ్యాది లౌకిక సంస్కృత సాహిత్యమునందుగల నామవాచక శబ్దములు, క్రియావాచక శబ్దములు తమలో గొప్ప విజ్ఞానమును నింపుకొని యున్న వనునది ఒక గుప్త సత్యము, రహస్యము. ఈరహస్యమును తెలిసికొన్నవాడు సంస్కృతభాష, వైదిక సాహిత్యము, వేదములు విజ్ఞాననిధు లని ఒప్పుకొనక తప్పదు. ఈనాడు ప్రపంచమున సంస్కృత భాష ఎడ అభిరుచి పెరుగుచున్నది. దాని పరిణామముగ బహుశః సంస్కృత భాషాకోవిదులు ఈ సత్యమును గుర్తించ వచ్చును.

వేదములలో సూర్యునిగూర్చి వ్రాయబడిన కొన్ని ప్రముఖ గుణముల నిచట పేర్కొనుచున్నాను.

**సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ . . ॥ యజుర్. 7-42 ॥**

సూర్యుడు స్థావర జంగమములకు ఆత్మవంటివాడు = ఆధారము.

**యద్ ఏకం జ్యోతిః బహుధా విభాతి.**

ఒక సూర్యుడు అనేక విధముల ప్రకాశించుచున్నాడు. ద్యులోకమున కాంతి, అంతరిక్షమున విద్యుత్తు, భూమిపైన అగ్ని, భూగర్భమున ఊష్మారూపమున ప్రకాశించుచున్నాడు.

వేదములలో సూర్యుని కిరణములు మూడు విధములుగా పేర్కొనబడినవి.

**1 - అమీ యే సప్తరశ్మయః ..॥ ఋగ్. 1 - 105 - 9 ॥** ఆ కిరణములు సప్తవిధములు.

**2 -సప్త త్వా హరితో రథే వహంతి దేవసూర్య . . .॥** ఋగ్. 1 - 50 - 8 ॥

దివ్యగుణములతో నొప్పు నో సూర్యుడా ! నిన్ను రథములో నుంచుకొని సప్తవిధ కిరణములు వ్యాపించుచున్నవి.

ఈ మంత్రములలో సూర్యుని కిరణము లేడు విధములని పేర్కొనబడినది.

**శతమశ్వాః యది వా సప్త బహ్వీః ॥ అథర్వ . 13 -2-6, 7॥**

శీఘ్రగాములైన శత (వంద) విధముల కిరణములు లేక సప్తవిధకిరణములు వ్యాపకములు.

ఈ మంత్రములలో సూర్యకిరణములు శతవిధము లని, వేరొక విధముగ సప్త విధము లని పేర్కొనబడినది.

**3 - ఇంద్రో మాయాభి : పురురూప ఈయతే యుక్తా హ్యస్య హరయః శతా దశ**

**॥ ఋగ్ .6-47-18 ॥**

సూర్యుడు తన సామర్థ్యముచే అనేక రూపములను ధరించును. హరణశీలము లైన పదివందల (వేయి విధముల) కిరణములు అతనితో యుక్తములై యున్నవి.

పై మంత్రమున వేయివిధముల కిరణములు సూర్యునికి గలవని తెలుపబడినది.

సూర్యుని సప్తవిధ కిరణముల నామములు.

**ఆరోగో భ్రాజ : పటర : పతంగ : । స్వర్ణరః జ్యోతిషీమాన్ విభాస : ॥**

తైత్తి . అర . 1-7-1 ॥

ఆరోగ, భ్రాజ, పటర, పతంగ, స్వర్ణర, జ్యోతిషీమాన్, విభాస.

ఇదే విధముగ సూర్యుని వందవందకిరణముల నామములు కోశములలో వ్రాయబడియున్నవి. ఒక్కొక్క కిరణముయొక్క నామము అన్వేషించిన సాహిత్యములో లభించవచ్చును. ఇది అన్వేషించదగిన విషయము

వేదములలో పేర్కొనబడిన సూర్యుని నామములు మరి కొన్ని : -

1. **జ్యోతిరుత్తమం** - ॥ ఋగ్ . 1-50-10 ॥ సూర్యుని జ్యోతి ఉత్తమ జ్యోతి. అనగా ఇతర జ్యోతులకన్న ఉత్తమము.

2. **శ్రేష్ఠః రశ్మిః** ॥యజుర్. 2-26॥ సూర్యనిరశ్మి శ్రేష్ఠము.

3. **వర్చోదః** ॥యజుర్॥ 2।26 ॥ సూర్యరశ్మి బ్రహ్మవర్చస్సును ప్రదానము చేయును.

4. **దేవానాం మిత్రస్య వరుణస్య అగ్నేః చక్షుః** ॥ ఋగ్. 1-115-1 ॥

మిత్రస్య =ప్రాణమునకు, వరుణస్య=అపానమునకు ; అగ్నేః=అగ్నికి నేత్రము వంటివాడు. వీటిని ప్రదర్శించువాడు.

5. **అశ్వాః హరితః ఏతగ్వా : అనుమాద్యాసః** .. ॥ ఋగ్.1-115-3॥

శీఘ్రగాములు, క్రిములను, రోగములను, బలహీనతను హరించునవి, సప్తవిధ కిరణములు, హర్ష దాయకములు, స్తుతించదగినవి.

6 **నిరంహసః దేవాః** . . ॥ ఋగ్. 1-115-6 ॥

సూర్యునికిరణములు దివ్య గుణములు గలవి, దోష రహితములైనవి.

7. **అమృతాః** ॥ అథర్వ. 13-1-44 ॥ జీవనశక్తిని ప్రదానము చేయునవి.

8. **ఘృతపావా** ॥ అథర్వ. 13-1-24॥ శరీర కాంతిని రక్షించునవి.

9. **వహిష్ఠాః** ॥ అథర్వ. 13-2-7 ॥

శరీరమును రక్షించియుంచుటలో అతిగా సహకరించునవి.

10. **పావకః** ॥ అథర్వ. 13-2-21 ॥ దోషరహితుడు, పవిత్రముచేయువాడు (సూర్యుడు)

11. **శుంధ్యువః** ॥ అథర్వ . 13-2-24 ॥ మలినమును తొలగించునవి.

12. **ద్రవిణేన తేజసా** ॥ అథర్వ. 6-2-15 ॥

సంపదలకు నిలయమైన తేజస్సుతో నొప్పునవి.

పైన పేర్కొనబడిన కొన్ని నామముల వలన కిరణముల మహత్త్వమును ఒకింత తెలిసికొనవచ్చును.

సూర్యునికి సంబంధించిన మరికొంత విజ్ఞానమును తెలిసికొన యత్నింతము.

**యో మారయతి ప్రాణయతి** ॥ అథర్వ. 13-3-3 ॥

సూర్యుడు మానవుల జీవన మరణములకు కారణము. సూర్యవిజ్ఞానము తెలిసికొని దాని కనుకూలముగా ఆచరించినచో మానవుడు జీవించును. తెలిసికొనక విరుద్ధముగ వ్యవహరించినచో మరణమును పొందును.

**ఉద్యన్త్సూర్య ఇవ సుప్తానాం ద్విషతాం వర్చ ఆదదే ॥ అథర్వ. 7-14-2 ॥**

ఉదయించుచున్న సూర్యుడు ఆ సమయమున నిద్రించువారి వర్చస్సును, బ్రహ్మ వర్చస్సును లాగుకొనును. సూర్యోదయ సమయమున నిద్రించువారికి ఆరోగ్య విషయములో చాల కీడు జరుగును.

నా అనుభవము ననుసరించి ప్రముఖముగా

1. శరీరస్ఫూర్తి, మనఃస్ఫూర్తి, క్షీణించును. 2. ఉత్సాహము క్షీణించును. 3. సూక్ష్మ విషయములను గ్రహించు శక్తి క్షీణించును. 4. జీర్ణశక్తి మందగించును. 5. మలబద్ధకము ప్రారంభమగును. 6. శరీరబలము క్షీణించును. 7 . కార్యశక్తి క్షీణించును 8. గురుత్వము= మజ్జుతనము ఆవరించును. విద్వాంసులు, బలవంతులు, కలాకారులు, సంగీతజ్ఞులు, మేధావులు, ఆరోగ్యవంతులు, దీర్ఘాయుష్కులు కాగోరువారు కనీసము సూర్యోదయము కన్న ఒక గంట మొదలు మేల్కొనవలయును. సమస్త మహాపురుషులు విద్వాంసులు, బలవంతులు, కలాకారులు, సంగీతజ్ఞులు, ఆరోగ్యవంతులు, దీర్ఘాయుష్కులు ఉదయము బ్రాహ్మముహూర్తమున మేల్కొనువారే.

**పూర్వామను ప్రదిశం పార్థివానామృతూన్ ప్రశాసద్విదధావనుష్ఠు ॥ ఋగ్. 1-95-13 ॥**

ఆదిత్యుని రూపములో నున్న అగ్ని, వసంతము మున్నగు ఆరు ఋతువులను, నియమించుచు .. అనగా సూర్యుని గతివలన భూమిపై ఋతువు లేర్పడునని తెలియవలయును.

**యస్మాద్ వాతా ఋతుథా పవంతే యస్మాద్ సముద్రా అధి విక్షరంతి. ... ॥**

అథర్వ. 13-3-2 ॥

దేనినుండి ఋతువు ననుసరించి వాయువులు ప్రవహించునో, దేనివలన సముద్రము అనేక విధములుగా ప్రవహించునో ఆసూర్యుని ........

సూర్యుని వలన సముద్రములు జలమును ప్రవహింపజేయుచున్నవి. సముద్రములు రెండు విధములు. 1. అంతరిక్షములో నున్న జలము, 2. భూమితలముపైనున్న జలము. ఈ రెంటికి ఆధారము సూర్యుడే.

ఉషస్సు, దినము, రాత్రి, శుక్లపక్షము, కృష్ణ పక్షము, ఋతువులు, ఉత్తర దక్షిణాయనములు, వృష్టి, విద్యుత్తు, అగ్ని, వాయువు, ఉష్ణత, కాంతి, మున్నగు వాటిచే ప్రత్యక్షముగా పరోక్షముగా మానవులకు శారీరకముగ, మానసికముగా సిద్ధించుచున్న ప్రయోజనములు, వర్ణనాతీతము. వీటికి సంబంధించిన విజ్ఞానము వేదములలో పుష్కలము.

**అవదివస్తారయంతి సప్త సూర్యస్య రశ్మయః ।**

**ఆపః సముద్రియాః ధారాస్తాస్తే శల్యమసిస్రసన్ ॥ అథర్వ. 7-112-1 ॥**

సూర్యుని యొక్క సప్తకిరణములు సముద్రముయొక్క జలధారలను ద్యులోకము నుండి క్రిందికి కొనితెచ్చును. ఆ జలధారలు మానవుని బాధలను పోగొట్టును.

ఋగ్వేదము మొదటి కాండము, సూక్తము 50లో 11, 12 వ మంత్రములలో సూర్యుడు హృదయ రోగమును, పాండు రోగమును హరించు నని పేర్కొనబడినది. ఋగ్వేదము దశమమండలము 161 వ సూక్తమున ఇంద్రాగ్నులచే వివిధ రోగముల నివారణ పేర్కొనబడినది.

అథర్వవేదము పంచమ కాండములోని 22వ సూక్తములో అనేక రోగములు రోగోత్పాదకక్రిములు, సూర్యుడు చంద్రుడు అగ్ని మున్నగు సాధనములచే వాటి చికిత్స పేర్కొనబడినది. ఇరువది మూడవసూక్తములో రోగోత్పాదక క్రిముల వివిధ స్వరూపములు విశదముగా పేర్కొనబడినవి.

అథర్వవేదము ద్వితీయకాండము 31వ సూక్తమున విభిన్న ప్రదేశములలోనుండు వివిధ క్రిముల స్వరూపములు సూర్యునిద్వారా వాటి నివారణ పేర్కొనబడినది. 32, 33వ సూక్తములందు వివిధక్రిముల స్వరూపము, వాటిద్వారా శరీరములోని వివిధ అంగములలో సంభవించు వివిధ రోగములు, సూర్యునిద్వారా క్రిములనాశనము, రోగముల చికిత్స వర్ణించబడినది.

వేదము సమస్త సత్యవిద్యల గ్రంథ మగుటవలన చికిత్సా విజ్ఞానమునకు సహితము అదియే మూలము. ప్రముఖముగా ఋగ్వేదము మరియు అథర్వ వేదము ఆధారము.

అష్టాంగ ఆయుర్వేదమునకు వేదమే మూలము. ఆయుర్వేదమునందలి కాయచికిత్సా గ్రంథమగు చరక సంహిత చివర **"యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్ క్వచిత్ "**

**అర్థము :** ఈ శాస్త్రమున పేర్కొనబడిన చికిత్సా విజ్ఞానమే ప్రపంచమున గోచరించును. ఇందులో లేని చికిత్స ప్రపంచమున ఎచ్చటయు లేదని వ్రాయబడినది. చరకము చదివిన వారి కిది సత్యమని తెలియగలదు. సుశ్రుత సంహిత శల్య చికిత్సాశాస్త్రము, అందలి శల్యాపకరణ విద్య సాటిలేనిది. ఈ నాటి శస్త్ర చికిత్స దాని పరిణామమే యనిన ఆశ్చర్యము కాదు. దానిని బలపరచుటకు ఇట నొక ఉదాహరణమును పేర్కొనుచున్నాను.

ఘాణేకర్‌గారు సుశ్రుతసంహిత సూత్రస్థానము 16వ అధ్యాయము 52 శ్లోకవ్యాఖ్యాన ందర్భమున నీక్రింది విధముగ వ్రాసియున్నారు. "ఈ అధ్యాయమున కర్ణపాలీ, నాసా, ుదవి తెగినపుడు శరీరముయొక్క ఇతర అవయవములనుండి చర్మము తీసికొని దానితో ు తెగిన అవయవములను అనుసంధానము చేయు యుక్తి దానితోపాటు ఆ చికిత్సకుల స్త్రకర్మయొక్క అపూర్వనైపుణ్యము వర్ణించబడినది. ఇది ఆధునిక శల్యవిజ్ఞానము నందలి ంధాన విభాగము (Plastic Surgery) నకు మూలము. ఏలన వాటి పరిజ్ఞానము తరువాతనే ురోపావాస శల్య చికిత్సకులకు శస్త్రకర్మ (Plastic Surgery) చేయు ఊహ జనించినది ంరియు ప్రోత్సాహము లభించినది.

The Plastic Surgery of the 19th Cenutry was stimulated by the example of ndian methods. (Dr. Nuberger's History of Medicine)

నేటి 19వ శతాబ్దపు అనుసంధాన చికిత్స భారతీయ శస్త్రకర్మ పద్ధతులవలననే ప్రేరేపింపబడినది.

నాసానుసంధానకర్మ (Rhinoplastic Operation) సుశ్రుతములోవర్ణించిన పద్ధతి ంనుసరించియే ఆధునిక శల్య శాస్త్రమున అనుకరించబడినది. ఆ పద్ధతి (Indian Method) అనియే పేర్కొనబడుచున్నది.

They have already borrowed from them the operatin of rhinoplasty. (Weber's History of Medicine.)

ఆ తరువాత ఐరోపాయందలి ఇటలీ, ఫ్రాంసు, తదితరదేశముల శల్య చికిత్సకులు ాసానుసంధానమునకు సంబంధించిన యుక్తుల నుపయోగించి క్రొత్తక్రొత్త పద్ధతుల ావిష్కరించిరి. కొంతకాలము వరకు ఉపయోగించిరి. కాని వాటిలో ఇసుమంతయు ొప్పతనము లేకపోవుటచే అవి వెనుకబడిపోయినవి. ఈనాడు "భారతీయ పద్ధతి" ామముతో సుశ్రుతముయొక్క పద్ధతియే ముఖ్యముగా ప్రచలితమైనది. రోజ్ మరియు ార్లేస్‌చే వ్రాయబడిన సౌశ్రుతీ (Rose and Carless Manual of Surgery) యొక్క ూర్వముద్రణలలో ఇటలీ, ఫ్రెంచ మరియు ఇతర దేశములలో ప్రయోగించబడిన ాసానుసంధాన పద్ధతులు వర్ణించబడియుండెను. నవీన ముద్రిత ప్రతిలో కేవలము భారతీయ ద్ధతియే. వర్ణించబడినది. Many methods of Rhinoplasty have been devised, but nly one will be described.

The so called Indian method employed for the construction of the nose a ıp of the skin from the forehead, and is, for most cases, the method of choice.

The flap is more or less pyriform, and has its pedicle based on supraorbital ssels. Occasionally the pedicle is so arranged as to contain the superficial mporal vessels,. The construction of the nose calls for the supply of lining d framework in addition to covering skin. If skin is not available in this re-

gion, hinged flaps may be obtained from the skin of the cheeks bordering on the lateral margins of the defect, (Rose and Carless Surgery 1947)

ఆ విధముగా ప్రసిద్ధినిపొందిన భారతీయ (శస్త్ర చికిత్సా) పద్ధతి ననుసరించియే నేడు నాసికాపునర్నిర్మాణము జరుగుచున్నది. చాలమంది రోగులకు నుదుటి భాగమునుండి వదులుగా నున్న చర్మముయొక్క ముక్కను తీసికొని నాసికను సరిచేయుచున్నారు. ఆ నొసటిభాగపు చర్మమే కొద్దియో గొప్పనో Pyriform ఆకారము మరియు కనుగుంటలపై చర్మపు రక్తనాళములతో కలుపబడి యుండును. అరుదుగా ఈ రక్తనాళపు అతుకులు కణతలకు చెందిన రక్త నాళములతో కలుపబడియుండును. నాసికా నిర్మాణము కేవలము పై ఆకారనిర్మాణమునకే కాక లోని రక్తనాళాదుల ధామ నిర్మాణమునకు గూడా అనుగుణమైనదిగా నుండవలెను. ఒకవేళ నుదుటి భాగములో అట్టి (వ్రేలాడు, కదలుచున్న) చర్మము లభించకున్నఎడల చెంపలలోని అతుకవలసిన భాగపు (ప్రక్కలనుండి తీసికొనవలయును) (రోస్ అండ్ కారలేస్ సర్జరీ - 1942)

చర్మముయొక్క సంధానమున సఫలత లభించిన తదుపరి చర్మమువలె ఎముకలు స్నాయువులు మరియు ఇతర అవయవముల సంధానము ఊహించబడినది.

"భాస్కరగోవిందఘాణేకర రచిత ఆయుర్వేద రహస్య దీపిక- ద్వితీయావృత్తి విక్రమసంవత్సరము 2009 సుశ్రుత సూత్రస్థానము పుట 133 "

మేధావులైన పాఠకు లిచట గ్రహించవలసిన వేరొకవిషయము కూడ కలదు. సంస్కృతభాషలో నాసికకు నస్, నసా, నాసా, నాసికా, నస్యా మున్నగు నామములు గలవు. నస్ శబ్దమే అంగ్లములో నోస్ (Nose) గా మారినది. రినోప్లాస్టిక్ శబ్దమునందలి నో " శబ్దము "నస్" శబ్దమే. దీనితో అంగ్ల భాష సంస్కృతభాష శబ్దములపైననే ఆధారపడి యున్నదని, సంస్కృత భాషయందలి విజ్ఞానము అంగ్లభాషయందలి విజ్ఞానమునకు మూలము. ఆధారమనియు తెలియుచున్నది.

భాస్కర గోవింద ఘాణేకర్ అనబడు ప్రసిద్ధ ఆయుర్వేదజ్ఞుడు మొదట ఆధునిక విద్యాపద్ధతి ననుసరించి చికిత్సా విజ్ఞానము చదివెను. తదుపరి ఆయన సుశ్రుత సంహిత (ఆయుర్వేదము) చదివెను. ఆయన దానిలో ప్రతిపాదించబడిన విశాల విజ్ఞానమును చదివి ఆశ్చర్యాన్వితుడై తన జీవితమును సుశ్రుత సంహితకై సమర్పించెను. దానికై ఆయన తన (దాదాపు) తొంబై సంవత్సరముల జీవితమును ధారపోసెను. ఆయన ఆయుర్వేదము ననుసరించి అనేక ప్రామాణిక గ్రంథములను రచించెను. అందులో సుశ్రుత సంహితయొక్క వ్యాఖ్యానము పేర్కొనదగినది. దాని భూమికయం దాయన

**"కాయబాలగ్రహోర్ధ్వే చ జరాదంష్ట్ర విషే తథా ।**

**యదన్యత్ర తదిహాస్తి శల్యం చాస్య న క్వచిత్ ॥** అని పేర్కొనెను.

**అర్థము** : కాయచికిత్స, బాలచికిత్స, క్రిమి చికిత్స, ఊర్ధ్వాంగచికిత్స, దంష్ట్రలతో కాటువేయుట వలన కలుగు రోగములచికిత్స, విషద్రవ్యములతో చేయబడు చికిత్సల గూర్చి

ఈనాటి వికసిత ప్రపంచమున గల చికిత్స సుశ్రుతములో గలదు. కాని సుశ్రుతములో పేర్కొనబడిన చికిత్స ప్రపంచములో నెచటను లేదని ఉచ్చస్వరముతో ఉద్ఘోషించెను. దీనిని ఎవరు కాదనగలరు ?

అతి సూక్ష్మ విజ్ఞానమున కాధారభూతమైన వేదవిద్యాప్రతిపాదకగ్రంథములను, గ్రంథాలయములను విదేశీయులు నిర్దాక్షిణ్యముగ దగ్ధము చేసిరి. మిగిలిన గ్రంథములలో నుండి ఆంగ్లేయులు కొన్నింటిని తమ దేశమునకు గొనిపోయిరి. మిగిలిన వాటిని వారు, వారి అనుచరులైన భారతీయులు మహత్త్వహీనముగ చిత్రించిరి లేదా ఉపేక్షించిరి. వారు సమస్త వైదిక విజ్ఞానమునకు విద్యలకు ఆధారభూతమైన వేదములను ఆటవికుల పాటలుగా చిత్రించిరి. సత్యాసత్యము తెలిసికొననివారు తెలిసికొనుట కిష్టపడనివారు ఆంగ్లేయుల మాటలను వేదవాక్కులవలె సత్యమని నమ్మిరి. అందుచే ఈనాటి పద్ధతి ననుసరించి చదువువారు ఆంగ్లేయుల మిథ్యా, కుటిల, కపట వ్రాతలను పరీక్షించి పరిశీలించుటకు, సత్యమును స్వీకరించుటకు సిద్ధముగా లేరు. ఆంగ్లేయుల మిథ్యాప్రతిపాదనను ఉదాహరణమునకిట పేర్కొనుచున్నాను.

We must at present do our best to form a class who may be interpreters between us and the millions whom we govern, a class of persons Indian in blood and colour, but English in tastes, in opinions, in morals and in intellect" (Macaulay's Minute of 1835)

మనచే పాలింపబడుచున్న కోట్ల భారతీయులకును మనకును మధ్య · ఒకరి అభిప్రాయము ఒకరికి తెలుపుట కుపయోగపడు ఒక వర్గమును భారతదేశములో ఉత్పన్నము చేయుటకు ప్రస్తుతము మనము అత్యధికముగా శ్రమించవలయును. ఆవర్గము వారు రక్తములో మరియు రంగులో భారతీయులై యుండియు తమ రుచి, భాష, భావము, బుద్ధిలో ఆంగ్లేయులై యుండవలయును.

ముగ్గురు ప్రసిద్ధ పాశ్చాత్యవిద్వాంసులలో ఒకరు మోనియర్ విలియంస్. ఆయన ఆక్స్‌ఫోర్డ్ విశ్వవిద్యాలయములో సంస్కృత వ్యాఖ్యాత, బోడన్ ట్రస్టుకు రెండవ అధ్యక్షుడుగా అనేక సంవత్సరములు పనిచేసెను. ఆయన తన ఇంగ్లీషు కోశముయొక్క భూమికలో బోడన్ ట్రస్టు యొక్క ఉద్దేశ్యము నీ క్రింది విధముగా పేర్కొనెను.

That the special object of his (Boden's) Munificent bequest was to promote the translation of the Scriptures into Sanskrit, so as to enable his countrymen to proceed in the "Conversion of the natives of India to the Christian religion.

(సంస్కృత ఆంగ్లకోశము భూమిక పుట 9 - ముద్రణ 1899)

బోడన్ మహానుభావుడు చేసిన ఉదారదానముయొక్క ముఖ్య ఉద్దేశ్యము (బైబిలుమున్నగు) ధార్మిక గ్రంథములను సంస్కృతములో అనువదించుటకు ప్రోత్సహించుట.

వాని ఉద్దేశ్యము భారతీయ మూలనివాసులను క్రైస్తవమతములో దీక్షితులను చేయుట మనదేశవాసులను ప్రోత్సహించుటకు సమర్థులను చేయుట.

ప్రొఫెసర్ మాక్సుముల్లర్ తాత్కాలిక భారతమంత్రియగు డ్యూక్ అఫ్ అర్గాయల్‌కు 16 డిసంబర్ 1868న వ్రాసిన ఒక ఉత్తరము లభించినది. అందాయన భారతదేశముయొక్క ధార్మికస్థితిని వర్ణించెను. ఆ సందర్భములో క్రైస్తవ మతముయొక్క కర్తవ్యము నుట్టంకించుచు వారి నుత్తేజిత పరచుటకు వ్రాసిన వాక్యములను క్రింద ఉదహరించుచున్నాను.

The ancient religion of India is doomed and if Christianity does not step in, whose fault will it be ? (వేదోంకా యథార్థస్వరూప్ పుట 33 నుండి)

ప్రస్తుతము భారతదేశముయొక్క ప్రాచీన ధర్మము నిశ్చయముగా నశించ నున్నది. క్రైస్తవమతము వచ్చి దాని స్థానమును గ్రహించనిచో ఎవరి తప్పుకాగలదు ?

ఇదే విధముగా మాక్స్ మూలర్ తన భార్యకొక ఉత్తరమును వ్రాసెను. వ్యక్తి తన ప్రియజనులకు ఇతరులముందు వ్యక్తము చేయవీలులేని మనో భావములను ప్రకటించును. ఈ భావములు కృత్రిమములుకావు. కేవలము స్వాభావికములు. వీటిని గూర్చి సందేహించవలసిన అవకాశముండజాలదు.

I hope I shall finish that work and I feel convinced though I shall not live to see it, yet this edition of mine (of the Rigveda) and the translation of the Vedas will here after tell to a great extent on the fate of India and on the growth of millions of souls in that country. It is the root of their religion and to show them what the root is, I feel sure, 'the only way of uprooting all that has been sprung from it during the last three thousand years.

(వేదోంకా యథార్థ స్వరూప్ - పుట. 33 నుండి)

అర్థము : నేను ఆ (వేదముల సంపాదన) కార్యమును పూర్తిచేయగలను. నేను దానిని చూచుటకు జీవించియుండనప్పటికి ఋగ్వేదముయొక్క నా ఈ సంస్కరణము, వేదముల అనువాదము భారతదేశము యొక్క భాగ్యము పైనను మరియు లక్షలాది భారతీయుల ఆత్మవికాసముపైనను ప్రభావము చూపగలదని నానిశ్చయము. ఇది (వేదము) వారి ధర్మమునకు మూలము. మూలము ఎట్టిదో వారికి చూపించుట గత మూడువేల సంవత్సరములలో పొందిన ఉపలబ్ధిని కూకటివ్రేళ్ళతో పెకలించుటకు సర్వోత్తమ ఉపాయము.

ఇటుల మాక్సుమూలర్ వేదములను మూడు వేల సంవత్సరములకు పూర్వపు రచన యని బాహాటముగా ప్రచారము చేసెను. నిజముగా వేద భూమియైన మనదేశమున గల అతిప్రాచీన చరిత్ర, అపారసాహిత్యములో దీనిని బలపరచుట కేవిధమైన ఆధారములు లేవు. అంతేగాదు. వేదములు సృష్ట్యారంభములో అనగా నేటికి ఒక అర్బుదముతొంభై ఏడుకోట్లకన్న ఎక్కువ సంవత్సరములకు పూర్వము ఈశ్వరునిచే ప్రకటింపబడిన వని అనేక గట్టి అధారములు గలవు. ఆంగ్లేయులు మన సర్వవిధ ఉన్నతికి ఆధారమైన వేదముల

నేవిధముగా కలుషితము, భ్రష్టము చేయుటకు సామూహికముగ, పథక పూర్వకముగ ప్రయత్నించిరో దీనివలన తెలియుచున్నది.

మాక్సమూలర్ మిత్రుడైన ఈ.బీ.పుసె అయనకు వ్రాసిన ఉత్తరము ఈసందర్భములో చెప్పకొనదగినది. పుసె అయనను ఏ రూపములో చూసెనో దీనితో తెలిసికొనవలయును.

Your work will form a new era in the efforts for the conversion of India' and Oxford will have reason to be thankful that by giving you a home, it will have facilitated a work of such primary and lasting importance on the conversion of India, and which by enabling us to compare that early 'false religion' with the true, illustrates the more than blessedness of what we enjoy.

అదే పుస్తకము పుట 33 అర్థము:- భారతీయులను క్రైస్తవులుగా మార్చుటకు చేయు నీ కార్యము నవ యుగమును కొని తెచ్చునదిగానుండును (అనగా నవయుగమునకు నాంది పలుకునది యని అభిప్రాయము). ఆక్సుఫోర్డు నీకు ఆశ్రయ మొసగి భారతదేశమును క్రైస్తవముగా చేయు ప్రథమము, అత్యవసరము నైన కార్యమును చేసినందుకు అది తనను ధన్యమనుకొను అవకాశము లభించనున్నది. దానితోపాటు మేము పురాతన మిథ్యా ధర్మము (వేద ధర్మము)ను సత్య ధర్మము (క్రైస్తవమతము)తో పోల్చి ఆనందించుటకు మీ కార్యము మమ్ము సమర్థులను జేయును.

పై వాక్యములలో మాక్సుమూలర్ యొక్క ఆంతరిక ఛద్మవేషము, అతడు ఎంత మతపిచ్చి గలవాడో తెలియుచున్నది. క్రైస్తవులు మనధర్మమును మనలను ఏ దృష్టితో చూచుచుందురో గమనించదగిన విషయము.

The Rigveda and Vedic religion గ్రంథ రచయిత Clayton. ఆయన తన గ్రంథము పుట 156లో మాక్సమూలర్ గూర్చి ఈవిధముగా పేర్కొనియున్నాడు.

Prof. Maxmuller did not hesitate to say, it must not be forgotten that though the Historical interest of the Vedas can hardly be exaggerated, large numbers of the Vedic hymns are 'Childish in the extreme' tedious and common place. Many of them convey no clear meaning or are full of vain repetitions. It is not the rule but the exception to find in this great collection of literature a cry of the soul any glimpse of a spiritual instinct any grasp of a high revelation.

(The Rigveda and Vedic Religion by Clayton P. 156)

అర్థము : ప్రొ. మాక్సముల్లర్ ననుసరించి వేదములయొక్క ఐతిహాసిక మహత్త్వము చాల గలదు. దీనిని మరువగూడదు. ఐనను వైదిక సూక్తములలో అత్యధిక సంఖ్య బాలిశములు, మూర్ఖత్వముయొక్క పరాకాష్ఠతో నిండియున్నవి. నీరసములునైన క్షుద్రభావములతో నిండియున్నవి. వాటిలోని చాల సూక్తములకు ఒక స్పష్టమైన అర్థము కానరాదు. అవి పునరుక్తములతో నిండియున్నవి. సామాన్యముగా కాదు కాని అరుదుగ

మాత్రము ఒకచో ఆత్మయొక్క ప్రతివేదన, ఆధ్యాత్మిక ప్రభయొక్క చిత్రము, ఉచ్చఈశ్వరీయ జ్ఞానము యొక్క దర్శనము గోచరించును.

ఆంగ్లేయులకు సామాన్య సంస్కృత భాష తెలిసికొను యోగ్యత లేనపుడు విజ్ఞానమయ గ్రంథము లెటుల అర్థము కాగలవు. త్రివేంద్రములో 73 సంవత్సరముల క్రితము ప్రాచ్యవిద్యా సమ్మేళనమున కధ్యక్షతవహించిన ప్రొ. ఎఫ్.థామస్ గారు శ్రీ పండిత ధర్మదేవవిద్యా మార్తండగారు, సంస్కృతములో మాట్లాడినపుడు సంస్కృతములో మాట్లాడలేక తన అసామర్థ్యమును ఈ విధముగా తెలిపెను. How I wish I could speak in Sanskrit fluently like you, but unfortunately I have no practice. మీవలె సంస్కృతములో ధారాప్రవాముగ మాట్లాడవలయునని నా కోరిక కాని దౌర్భాగ్యమువలన నాకా అభ్యాసము లేదు. (వేదోంకాయథార్థ స్వరూప్ పుట. 43 నుండి)

(క) ప్యారిస్ విశ్వవిద్యాలయమున భారతీయ విద్యకు అధ్యక్షుడు ప్రో. రెనూ. ఆయన దిల్లీ విశ్వవిద్యాలయమున సంస్కృతసాహిత్యము గూర్చి ఉపన్యసించెను. ఆయన శ్రీ ధర్మదేవవిద్యామార్తండగారి ప్రశ్నకు సమాధాన మొసగుచు "విదేశాలలో సంస్కృతజ్ఞులైన విద్వాంసులు సహితము మూల సంస్కృత గ్రంథములను అర్థము చేసికొను యోగ్యత దాదాపు కలిగియుండరు. ఆంగ్లభాషలో వాటి అనువాదములున్న ఎడలనే వాటిని చదివి అర్థము చేసికొనగలరు. అందుచే అచ్చట (విదేశాలలో సంస్కృత) గ్రంథముల ప్రచారము జరుగలేదు

(ఖ) ఇదేవిధముగ వేరొక ఉదాహరణము వ్రాయుచున్నాను. ట్రాన్స్‌వాల్ (ప్రిటోరియా)కు చెందిన ఒక ప్రసిద్ధ విద్వాంసుడు టామిస్ ఫిట్జ్ తన ఉపన్యాసములో నిటుల పేర్కొనెను. ' "కొందరు పాశ్చాత్య విద్వాంసులు వేదములగూర్చి తెలిపియున్నారు. ఈ విద్వాంసుల వక్తవ్యములపైన నాకు ఇసుమంతయు విశ్వాసము లేదు. ఏలన ఈ పండితులకు సంస్కృతము, వేదములయొక్క జ్ఞానము లేని దానితో సమానము. ఈ విషయమున కేవలము స్వామిదయానందుని భాష్యమునే మేము ప్రామాణికముగ స్వీకరింతుము.

("పాఖండన ఖండనీపతాకా" కాశీ యనబడు మాస పత్రిక 15జూన్ క్రీ.1939 సంచిక పుట. 5 నుండి)

ఈ (క ఖ రెండు ఉదాహరణములు వేదోంకా యథార్థస్వరూప-పుట 43 నాధారమున వ్రాయబడినది.)

మాక్స్‌మూలర్ వేద సిద్ధాంతమును అర్థము చేసికొన్నట్లు గాని, దానిని శ్రేష్ఠమనుకొన్న టులగాని, స్వీకరించినటులగాని నమ్ముటకు ఏ ప్రమాణములేదు. ఆయన తన జీవితాంతము క్రైస్తవ మతమునే ప్రేమించెను. ఇతరులను, వేదానుయాయులను సహితము క్రైస్తవులుగా మార్చుటకే ప్రయత్నించెను. వేదములను నీచములుగానే భావించె ననవచ్చును. దానిని స్పష్టము జేయుటకిట రెండు ప్రమాణములను పేర్కొనుచున్నాను.

భారత దేశమును క్రైస్తవము చేయవలయునని మాక్స్‌మూలర్ ఎంతవరకు

తహతహలాడుచుండెనో తెలిసికొనుటకు క్రింది సందర్భ ముపకరించగలదు. శ్రీ యన్.కే. మజూందారు అనునొక బ్రాహ్మసమాజ సజ్జనునికి ఇది మాక్స్‌మూలర్ 1899 క్రీ.సంవత్సరములో తన 76వ ఏట అనగా మృత్యువుకన్న ఒక సంవత్సరము పూర్వము వ్రాసిన ఉత్తరము :

Tell me some of your chief difficulties that prevent you and your country-men from openly following Christ and when I write to you, I shall do my best to explain how I and many who agree with me have met them and solved them... From my point of view India, at least the best part of it, is already converted to Christianity, you want no persuation to become a folllower of Christ Step boldly forward ; it will not break under you and you will find many friends there to welcome you on the other shore and among them none more delighted than your old friend and fellow labourer

F. Maxmuller

మీరు మీ దేశవాసులు యేసుక్రీస్తు శరణుజొచ్చుటకు ఉన్న ఇబ్బందులను స్పష్టముగా తెలుపుడు. వాటికి నేను నా సమాధానము స్పష్టముగా నొసగెదను. నా దృష్టిలో భారతదేశము, లేదా కనీసము దీని శ్రేష్ఠభాగము క్రైస్తవమతములో చేరినది. మీరు క్రైస్తవులగుటకు ప్రేరణకూడ అవసరము లేదు. ఇపుడు ధైర్యముతో నిర్భయముగా ముందుకు సాగుడు. ఇది... మీ స్వాగతము కొరకు ఇతరులతో పాటు మీ పురాతన తోటి మిత్రుడు మాక్స్‌మూలర్ కూడ ఉపస్థితుడగును.

మాక్స్‌మూలర్ తన జీవితమును క్రైస్తవమత వ్యాప్తికై అంకితము చేసియుండెనా లేక సత్యవేద సిద్ధాంత ప్రచారమునకా దీనితో పాఠకులకు తెలియగలదు.

మాక్స్‌మూలర్ తనపుత్రునికి వ్రాసిన ఉత్తరము : నీవు ప్రపంచమున ఒకానొక సర్వశ్రేష్ఠ పుస్తకమును సూచించగలవా ? నీ యావిధానము క్రైస్తవుల క్రొత్తనిబంధన మని నేను చెప్పుచున్నాను. ఆ తరువాత కురాన్ సుంచవలయును. అది తన నైతిక శిక్షల దృష్టితో క్రొత్త నిబంధన తరువాత సంస్కరణే. దానితరువాత పురాతన విధానము (బైబిలుకు సంబంధించిన పాతనిబంధన), దాక్షిణాత్యుల బౌద్ధత్రిపిటకము, వేదము, అవేస్తా గ్రంథము

పై ఉద్ధరణతో మాక్స్‌మూలర్ సత్యమునకు, విజ్ఞానమునకు, నిష్పక్షతకు పూర్తిగా విరుద్ధ మనవచ్చును.

శ్రీ ముముక్షువుగారు ఆరోగ్యము అనుకూలింపక పోవుటవలన ఈ గురుకులములో నివసించుచున్నారు. వీరు మేధాసంపన్నులు. వైజ్ఞానిక విషయాలను సూక్ష్మముగా ఆలోచింతురు, గ్రహింతురు. వీరికి శరీర విజ్ఞానము, చికిత్సా విజ్ఞానము ప్రియము. వీరికి హోమియోపైథిలో మంచి పట్టు గలదు. చాలా సంవత్సరముల వరకు వీరు స్వయముగా హోమియోపైథిద్వారా చికిత్స చేసి మంచి అనుభవమును, సమ్మానమును గడించియున్నారు.

వీరినుండి అనేకులు ఈ చికిత్సను నేర్చుకొనిరి. వారిలోనుండి కొందరు విదేశాలలో గూడ చికిత్స చేయుచున్నారు. వీరు ఈ చికిత్సనేగాక ప్రకృతి చికిత్సలో మంచి నైపుణ్యమును గడించియున్నారు. వీరికి వేదాలు, వేద విజ్ఞానము, వైదిక ధర్మము ఎడ అతిశ్రద్ధ. వీరు వేదములలోని విజ్ఞానమును పరిశీలింతురు. వీరు వేదములలోని విజ్ఞానమును ఈ నాటి వారికి తెలుపవలయునని ఉబలాటపడుచుందురు. వీరు ఆధునిక పద్ధతిలో చదివిన వారికి వేదములలోని వివిధ విజ్ఞానములను వెలికి ప్రకటింపగోరుదురు. దాని పరిణామమే వీరి పూర్వకృతి "వేదములలో జలచికిత్స". అది మేధావులను బాగుగా ఆకర్షించినది. దాని తదుపరి ఈ దిశలో **వేదాలలో సూర్యకిరణ చికిత్స** అనునది రెండవ పుస్తకము

సూర్యకిరణ చికిత్స ఈ నాటి సమాజములో స్థానమును సంపాదించినది. దీనిపై సాహిత్యముకూడ లభించును. దీనిని దృష్టిలో నుంచుకొని ముముక్షువు గారు వేదములను పరిశీలించిరి. వేదములలో తదితర గ్రంథములలో వికీర్ణమైన విజ్ఞానమును లోతుగా పరిశీలించిరి. దానిని తమ విచక్షణా బుద్ధితో క్రోడీకరించి వైజ్ఞానిక వివరణతో ఒక క్రమములో నుంచి ఒక పుస్తకముగా కూర్చిరి. ఇది సూర్యకిరణ చికిత్సకు ఆధారభూతమైన వేద విజ్ఞానము. చికిత్సకు సంబంధించిన వైదిక సూర్యకిరణ విజ్ఞానమును సేకరించి, వాఖ్యానించి వీరు ఆధునిక సూర్యకిరణ చికిత్సకు వైదిక పునాదులు వేసిరి. వైదిక సూర్యకిరణ విజ్ఞానములోని చికిత్సా అంశము నీనాటి కొందరు మేధావులు చికిత్సారూపమున సాక్షాత్కారము చేసికొని రనుటలో అతిశయోక్తి లేదు. వేదములలోని శాస్త్రీయ విజ్ఞానమున కీనాటి ఈ సూర్యకిరణ చికిత్స ఆచరణాత్మక మనవచ్చును. వైదిక సూర్యకిరణ విజ్ఞానమున కింతటి మహోన్నత స్థానమును సంపాదింపజేసినది శ్రీ ముముక్షువుగారని ఘంటాపథముగ చెప్పవచ్చును. ఇది వేదాభిమానులకు గర్వకారణము. దీనితో ఈ నాటి సూర్యకిరణచికిత్సను ప్రేమించు వారికి వేదముల ఎడ గౌరవము పెరుగు ననుటలో ఇసుమంతయు సందేహములేదు. ఇట్టి కృతిని అందించినందులకు వేద విజ్ఞాన ప్రియులకు సూర్యకిరణ చికిత్సా విజ్ఞులకు ముముక్షువు గారు అభినందనీయులు.

సూర్యకిరణ చికిత్సకు ఆధారము సూర్యుడు. సూర్యుని స్వరూపము తెలియక సూర్యకిరణ చికిత్స సాధ్యము కాదు. అందుచే దానిని తెలిసికొనుటకు సూర్యుని ఉత్పత్తి దానితో పాటు గ్రహోపగ్రహముల యొక్క ఉత్పత్తి, సూర్యునికి వాటికి గల సంబంధము గూర్చి వైదిక విజ్ఞానము తెలుపబడినది. ఇందులో ఆధునిక విజ్ఞానముతో పాటు అనేకార్థములు గల వేదమంత్రములలోనున్న సూర్య విజ్ఞానము తెలుపబడినది. ప్రముఖముగా సూర్యునియందలి మచ్చలు ఇప్పుడిప్పుడు తెలిసిన విషయము. దీనిని గూర్చి వేద ప్రమాణములతో విశదీకరించియున్నారు. అగ్నిహోత్రములో గర్భితమైయున్న వైజ్ఞానిక సత్యము యుక్తి ప్రమాణములతో ఇందు నిరూపింపబడినది.

మన ప్రాచీన ఆచార్యుల దృష్టిలో సూర్య విజ్ఞానము, ఆకర్షణ విజ్ఞానము, కిరణ విజ్ఞానము గూర్చి దీనిలో పేర్కొనబడినది. బ్రాహ్మణ గ్రంథములలో నిహితమైయున్న

విజ్ఞానముతో పాటు సూర్యునికి సంబంధించిన 55 శబ్దాలు వాటి అర్థాలు పేర్కొన బడినవి. ఈ అర్థాలు సూర్యుని స్వరూపమును, గుణములను బోధించుచున్నవి. ఈ అర్థములలో నిహితమైయున్న సూర్య విజ్ఞానము ఇంకా అన్వేషణీయము. మనము వంద సంవత్సరముల క్రితము దాదాపు వేదములను విస్మరించియుంటిమి. దయానంద మహర్షి తన తపోబలముతో మరల ప్రపంచమున వేదములను ప్రతిష్ఠింపజేసెను. ఆయనయే లేకున్న ఈనాడు దేశ విదేశాలలో వేదములపైన ఇంతటి పరిశోధన జరుగకుండెడిది. ఇందరు వేద విద్వాంసులు మనకు లభించెడివారు కారు. ఆ మహర్షి పేర్కొన్న సూర్య విజ్ఞానము ఇందు పొందుపరచబడినది.

వేదములలో వివిధ రూపములలో నిహితమై యున్న సూక్ష్మ సూర్యవిజ్ఞానము ఈ పుస్తకమునందు వివరముగా వర్ణించబడినది. సూర్యునివలన ఏ విధముగా రోగములు శమించబడునో వ్యష్టి, సమష్టి ఆరోగ్య లాభ మెటుల కలుగునో ఇందు విశదీకరించబడినది. సూర్యుని సంబంధించిన విద్యుత్, దాని ఉపయోగము అతి సూక్ష్మముగా ప్రతిపాదింపబడినది. సూర్య కిరణముల వర్ణములు, వాటి గుణములు, వాటిద్వారా జరుగు చికిత్స చాలా విశదముగా, సూక్ష్మముగా పేర్కొనబడినది. ఇది జనసామాన్యులకేకాక ప్రముఖముగ వైదికుల కుపయోగపడగలదు. వేదోక్త సూర్య కిరణ చికిత్సకు సంబంధించిన ఇంత సూక్ష్మ, విశద, ప్రామాణిక వివరణ నేను తెలిసికొన్నంతవరకు తెలుగులో గాని హిందీ భాషలో గాని బహుశః లేదు.

సూర్య కిరణ చికిత్స ఒకవిధమైన చికిత్స. అది ప్రాకృతిక చికిత్స. సహజ చికిత్స. ఆధునిక పాశ్చాత్య చికిత్సనే సర్వస్వముగా భావించువారు దానినే ఆశ్రయించు వారు దానివలన ఎంత ఆరోగ్య లాభమును పొందుచున్నారో పేర్కొనుట, శరీర ఆరోగ్యమును హస్తామలకమువలె నిరంతరము రాత్రింబవళ్ళు కనిపెట్టుకొని ఉండు నావంటి వానికి కఠినమే.

సమస్త రోగాలకు ఆత్మ, శరీరము కారణ మనుకొను నేను "రోగాలు వచ్చుచునే ఉండు"నను ఆధునిక చికిత్సా విజ్ఞానమును గూర్చి ఏమి మాట్లాడగలను ? ఈ పుస్తకము నాధారముగా గొని విద్వాంసులే గాక సామాన్య ప్రజలుగూడ ఉత్తమ ఆరోగ్య లాభమును పొందగలరు. బహుశః వారికి ఆధునిక చికిత్సపైననే ఆధారపడి ఉండవలసిన అవసరముండబోదు.

ముముక్షువుగారు ఈ పుస్తకమును వ్రాయుటకు అతిగా శ్రమించిరి. వీరికి తమ శరీరము ఏమాత్రము అనుకూలించుటలేదు. నేత్రములు, గుండె, హస్తములు కూడ ఏ మాత్రము అనుకూలించుటలేదు. స్వయముగా స్నానము చేసికొనలేరు. కేవలము లీటరు పాలే దైనిక ఆహారము, అంతకు మించి ఏమి జీర్ణించుకొనలేరు. గురుకులములో ప్రతిదినము సాయంప్రాతః సంధ్యాయజ్ఞము జరుగును. వీరు పూర్వము యజ్ఞములో పాల్గొనెడివారు. ఇపుడు వారు ఎంత కోరిక ఉన్నా పాల్గొనలేకున్నారు. పాల్గొన్నా 15 నిముషముల కాలము కూర్చుండలేరు. 500 (ఐదువందల) గజముల దూరము నడువలేరు. వీరి శారీరిక స్థితిని

వర్ణించునపుడు నేత్రములనుండి అశ్రుపాతమును ఆపలేకున్నాను. ఓం ఓం ఓం. ఈ స్థితిలో వీరు ఇంత మహత్త్వపూర్ణమైన పుస్తకమును వ్రాయుటకు కారణము- వేదములలో ఆధునిక విజ్ఞానమేకాక, ఆధునిక విజ్ఞానమునకందని విజ్ఞానము గలదను వీరి విశ్వాసము, దానిని పుస్తకరూపములో లిపిబద్ధము చేయవలయునను వీరి కోరిక, జీవించి యుండు నంతవరకు వేద సిద్ధాంతవ్యాప్తి జేయవలయునను వీరి తపన.

వీరికి తన శరీరము కరతలామలకమువలె కనబడును. వీరు ఇంద్రియములకులోబడి ఆరోగ్యమునకు విరుద్ధమైన ఆహార విహారములు చేసినటుల వీరిని నేనెపుడు చూడలేదు. అటుల వీరు చేసియుండి ఉందురేని వీరి శరీరము ఇంతవరకు ఉండెది కాదు. వీరు ఈ పుస్తకము వ్రాయుటకు చేసిన శ్రమ సాటిలేనిది. ఇది అతిత్వరగా ముద్రించబడి జనుల ముందుకు వెళ్ళవలయు నని వీరి విశిష్ట తపన.

అతి నిరాశాజనకమగు ఈ శరీరముతో వైదిక విజ్ఞానవ్యాప్తికి వీరి శ్రమ, వీరి తపన అనన్యసామాన్యము. వీరు ఒకవైపు శరీర బలహీనతతో ప్రబలయుద్ధము మరొక వైపు వైదిక సిద్ధాంతవ్యాప్తికి నిర్విరామ కృషి సలుపుచున్నారు. గంటలవరకు శ్రమించు వీరు విధిలేక ఇవుడు ఒకసారి ఐదు పది నిముషములకన్న ఎక్కువ శ్రమించజాలకున్నారని వ్రాయుచున్నపుడు మనస్సులో బాధ కలుగుచున్నది.

ఇప్పటికిని బలహీనతతో పోరాడుచున్న ఈ క్షణములలో నుండి కొన్ని క్షణములు మిగిలినపుడు వానిని ఆత్మోన్నతికొరకు, వేద ధర్మవ్యాప్తి కొర కుపయోగించుట మానవమాత్రుల కనుకరణీయము, ఆదర్శము. వీరు ఒకొక్క క్షణము మిగిలించి చేసిన శ్రమ వేద విద్వాంసులతో పాటు విజ్ఞాన ప్రియులకు, చికిత్సావిజ్ఞులకు ఒక వేద విజ్ఞాన సంపత్తిరూపములో లభించుచున్నది. వీరు తమ ఈ కృతితో వేదవిజ్ఞానవేత్తగా సమాజమున గుర్తింపు పొందగలరు. వీరి ఈ కృతిని అనేక భాషలలో అనువాదము చేసి విజ్ఞులు లాభపడునటుల చేయుట ఈ పుస్తకముతో లాభాన్వితులైన వారి కర్తవ్యము. వారి భక్తుల కర్తవ్యము. వేదభక్తుల కర్తవ్యము.

ఈ సూర్య కిరణ చికత్సవిజ్ఞానము ఆంధ్రలోకమునందంతంట వ్యాపింపవలయునని నా కోరిక. వేద ప్రియులు విభిన్న సందర్భములలో ఈ పుస్తకమును ఉపహారముగా (కానుకగా) నొసగి దీని వ్యాప్తికి తోడ్పడగలరని ఆశించుచున్నాను. భగవంతుడు ముముక్షువుగారికి ఆయురారోగ్య బలములను ప్రసాదించి వీరిలోనున్న జ్ఞానమును పుస్తక రూపములో మానవ సమాజమున కందించునటుల ఆశీర్వదించును గాక ! యని భగవంతుని ప్రార్థించుచున్నాను.

శమిత్యోమ్.

**ఆచార్య వేదవ్రత మీమాంసక**
ఆర్షగురుకులము, వడ్లూరు,
కామారెడ్డి, ఇందూరు

శ్రావణ శు॥ 12,
2057 విక్రమ



# వేదాలలో
# సూర్యకిరణ చికిత్సా విజ్ఞానము

## సూర్యుడే ఆత్మ - ఆధారము

**'సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ' (ఋ.1-115-1)**

సూర్యుడే ఈ స్థావర జంగమాత్మకమగు ప్రపంచమున కంతకు ఆత్మ - ఆధారము.

మన గ్రహ కుటుంబానికి సూర్యుడే ఆధారము. దాని ఆకర్షణ శక్తివల్లనే మన భూమి, కుజుడు, బుధుడు, గురుడు, శుక్రుడు, శని, యురేనస్ (అర్యమా, ప్రజాసు, అరుణ్) నెప్ట్యూన్ (వరుణ్), ప్లూటో (ఋత్) అనునీ నవగ్రహములు ఆకాశమున పడిపోక నిలిచి యున్నవి. అవి ఒకదానికొకటి ఢీకొనక వాటి వాటి కక్షలలో సూర్యుని చుట్టూ పరిభ్రమించుచున్నవి. అవి తమ తమ ఉపగ్రహములను ఉల్కాలను ఆకర్షించి పట్టుకొని తిరుగుచున్నవి. అవి సూర్యుని చుట్టూనేగాక ఆత్మ ప్రదక్షిణ చేయుచు తిరుగుచున్నవి. ఆకాశమున కనబడు కోటానుకోట్ల నక్షత్రము లన్నియు మన సూర్యుని వంటివే. అవి కూడ గ్రహ, ఉపగ్రహాదులతో కూడియున్నవే. వేరే గ్రహ కుటుంబం నుండి చూచిన మన సూర్యుడుకూడా ఒక నక్షత్రము గానే కనబడును. దాదాపు పదివేల కోట్ల నక్షత్రాలు కలిసి ఒక నీహారికగా - నక్షత్ర వీధి (గెలాక్సీ - నెబ్యులా - పాలపుంత)గా ఏర్పడి ఉన్నవి. అట్టి నక్షత్ర వీధులు ఈ విశ్వమున పదివేల కోట్ల వరకు ఉండునని నేటి విజ్ఞానవేత్తల కథనము. కొన్ని నక్షత్రముల కాంతి మన భూమిని ఇంకా చేరుకోనే లేదట. కాన విశ్వవైశాల్యము ఊహాతీతమే.

మన గ్రహ కుటుంబము సూర్యుని చుట్టూ తిరుగుచున్నట్లే ఒక్కొక్క నీహారికలోని నక్షత్రవము లన్నియు వాటి వాటి కేంద్రాల చుట్టూ తిరుగుతున్నవట. అట్లే నీహారిక లన్నియు మధ్య నీహారిక చుట్టూ తిరుగుచుండవచ్చును. మరి, ఆ మధ్య నీహారికకు ఆధారమేది? దాని మధ్య కేంద్రకమున కాధార మేది? ఇట్టి అనేక ప్రశ్నలకు నేటి ఖగోళ విజ్ఞానమున సమాధానాలు నా ఎరుకలో లేవు. అందుచే కొందరు దీనిని అనంతమనియు, మరికొందరు అనంతము కాదు. సాంతమే యనియు నమ్ముచున్నారు. మరికొందరు అనంతమయ్యు సాంతమే యనుచున్నారు. ఏలయన విశ్వము కూడా గుండ్రముగానే ఉండుటచే గుండ్రని బంతికి మొదలు, చివరలు లేనట్లే విశ్వమునకు కూడ మొదలు చివరలు లేక అనంతముగా కనబడుచున్నది. కాన అనంతమయ్యు సాంతమే యగుచున్నదని వారి అభిప్రాయము. ఈ అభిప్రాయమునే మన ఖగోళ విజ్ఞానము సమర్థించును. నేడు మన బడులలో ఎవరో ఆధునిక శాస్త్రవేత్త మొట్టమొదటగా భూమి గుండ్రముగా నున్నట్లు కనుగొన్నాడని అపురూపముగా బోధించుచుండుట ఆశ్చర్యకరము.

కాలగణనకే అందని మన అతి ప్రాచీన ఖగోళ శాస్త్రాలలో గోళాధ్యాయ మను పేరుతో ఈ విషయమును బోధించు ఒక అధ్యాయమే ఉన్నది. అందు మన భూమియే కాదు గ్రహ, ఉపగ్రహ సూర్య నక్షత్రాదు లన్నియు గుండ్రముగానున్నవనియే తెలుపబడినది. ఈ విశ్వము గుండ్రముగా నున్నదనియే చెప్పబడినది. ఈ గ్రహ నక్షత్రాదులు ఆకర్షణ శక్తి నియమాలచే బంధింపబడి అనంతాకాశమున పరిభ్రమించుచున్నవని వివరించబడెను.

కోట్లాది నీహారికలతో కూడిన ఈ విశ్వము గోళాకారముగానే యున్నది. అది పరమేశ్వరుని ఆధారముననే పరమేశ్వరునిలోనే పరిభ్రమించుచున్నది. పరమేశ్వరునిలో నది ఎంత ఆక్రమించి యున్నదన - 'పాదో ఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి' ( యజు. 31-3 ) ఈ సమస్త చరాచర జగత్తు, లోకలోకాంతరములు - విశ్వము అంతా కలిసి పరమేశ్వరునిలో ఒక పాదముగా నాలుగింట ఒక భాగముగా ఉన్నది. విశ్వము లేని అమృత లోకము - తృతీయ ధామము 3 పాదములంత - మూడు రెట్లుగా ఉన్నది. మరి ఈ నాలుగు భాగములు కలిసిన పరమేశ్వరుని ఆకారమేది? యనిన అదియునూ - ఆ పరమేశ్వర తత్త్వమునూ గుండ్రముగా నున్నదనియే ఒప్పుకొనక తప్పదు. ఏలన ఏ యితర ఆకారము దానికున్నదని

నిరూపించలేము. సర్వవ్యాపక పరమేశ్వరుడు గుండ్రముగా నెట్లుండు? నను నదియు ప్రశ్నయే. అందుచే సర్వము అని చెప్పబడునది కూడ గుండ్రముగా నున్నదనియే అనవలసి యుండును. అట్టి విశ్వగోళ మంతట పరమేశ్వరుడు వ్యాపించి యున్నాడని వేదము చెప్పును.

**'ఈశా వాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్'**

**యజు-40-1**

ఈ సర్వము - విశ్వమంతయు ఈశునిచే అనగా ఒక విశ్వవ్యాపక నియామక శక్తిమంతునిచే కప్పబడి యున్నది - వ్యాప్తమై యున్నది. అంతయు అనగా నేమో వివరించుచు కించిత్ (పరమాణువులు) మొదలుకొని, జగత్యాం జగత్ = గతిశీలమైన ఈ జగత్తంతయు నని వివరించుచున్నది. ఆ విశ్వవ్యాపక నియామకునే వేదము 'ఈశుడు' అని పేర్కొనెను. మరియొక చోట అతనికే 'వశీ' యని పేరిడెను.

**'అహో రాత్రాణి విదధద్ విశ్వస్య మిషతో వశీ'**

వశీ - అన్నిటిని వశవం దుంచుకొను ఆ ఈశ శక్తియే అహోరాత్రములను నిర్మించెను - ఏర్పాటు చేసెను. అనగా కొన్నిటిని స్వయం ప్రకాశకమైన సూర్యులుగాను, కొన్నిటిని సూర్యుల వల్ల ప్రకాశింపబడు గ్రహ, ఉపగ్రహములు గాను నిర్మించెను. ఆ సూర్యుల చుట్టు తగిన దూరములో ప్రకాశములేని లోకములను త్రిప్పుచు పగలు రాత్రుల చక్రము నేర్పరచెను. సూర్యుడు తన ప్రకాశముతో మిగిలిన గ్రహ, ఉపగ్రహము లన్నిటికి వేడిని, వెలుగును ఇచ్చుచుండును. అందుచేతనే సూర్యుడు చరాచర సృష్టి కంతకు ఆత్మ- ఆధారుడని చెప్పబడినది.

**'సూర్య ఆత్మాజగతస్తస్థుషశ్చ'** అను ఈ ఋగ్వేద వాక్యములోని సూర్య పదమునకు ఆధ్యాత్మిక క్షేత్రములో పరమేశ్వర పరముగా నర్థము చెప్పుకొనవచ్చును. ఏలయన సూర్య పదము 'సృ-గతౌ' అను ధాతువునకు 'క్యప్' ప్రత్యయము చేరుట వలన నేర్పడును. కాన 'సరతి ఆకాశే సూర్యః, యద్వా సువతి కర్మాణి లోకం ప్రేరయతి' అని నిర్వచన మగును. అనగా ఆకాశమున చరించు భౌతిక సూర్యుడనియు లేక సర్వవ్యాపకుడై లోక లోకాంతరములలోగల మానవుల హృదయాంతర్యామియై వారిని సత్కర్మల యందు ప్రేరేపించు పరమేశ్వరు డనియు అర్థము చెప్పుకొనవచ్చును. అందుచే మహర్షియైన దయానందుడు తన ప్రసిద్ధ సత్యార్థ ప్రకాశ గ్రంథము నందు ఈ వేద వాక్యమున కిట్లు అర్థము చెప్పెను. 'జగతః అనగా నడుచుచు తిరుగాడు చుండు పశుపక్ష్యాదులైన ప్రాణికోటి మరియు జ్ఞానము గల మానవులు,

తస్థుషః అనగా స్థావరములు జడములునైన పృథివ్యాదులు (అప్రాణి కోటి) ఈ ప్రాణి, అప్రాణి రూప సమస్త జగత్తు నందంతట వ్యాపించి వాటికి సూర్య నామక పరమేశ్వరుడు ఆత్మగా నున్నాడు' అని వివరించిచెప్పెను.

## సూర్యుని ఉత్పత్తి

సూర్యుని ఉత్పత్తిని తెలిసికొనబోవుముందు సంక్షిప్తముగా సృష్టి రచనను తెలిసికొందము రండు-

ఈ సృష్టికి మూల పదార్థాలు మూడు. అవి ఈశ్వర, జీవ, ప్రకృతులు. అందు ఈశ్వరుడు అత్యంత సూక్ష్మము. అత్యంత విశాలమునైన ఒక వ్యాపక పదార్థం. ఇచట సూక్ష్మమనగా చిన్నది యని కాదు. 'ఇనుములో అగ్ని వ్యాపించగలుగునట్లు తనకన్న స్థూల పదార్థములలో వ్యాపించి యుండగలదని యర్థము. అత్యంత పెద్దది యగుట చేతను, మన బుద్ధికి అగమ్యగోచరమైనది యగుట చేతను, దానిని అనంతమని కూడా అనవచ్చును. ఆ పరమేశ్వర పదార్థములోనే త్రిగుణాత్మకమైన ప్రకృతి మరియు కోటానుకోట్ల జీవులు ఉన్నారు. జీవ ప్రకృతుల కన్నను ఈశ్వరుడు సూక్ష్మమగుటచే ఆ రెంటి యందును వ్యాపించి యున్నాడు. అందుచే అతడు సర్వవ్యాపకుడు, సర్వాంతర్యామి. అతడు ఇంద్రియ గోచరము కాని సత్వరజస్తమస్సులతో కూడిన మూల ప్రకృతితో ఈ కనబడు స్థూల సృష్టిని రచించగల అనంతజ్ఞానం, అనంత సామర్థ్యం గల చేతన పదార్థం.

జీవులు అనేకులు. కోటానుకోట్లు. మన బుద్ధికి అసంఖ్యాకములు. అవి అణు పరిమాణము (అత్యంత చిన్న పరిమాణము) గలవి. అయినను అవి నేను నేను అనుకొను స్వాభావిక జ్ఞానం కలిగి యుండును. ఇతరుల నుండి జ్ఞానాన్ని గ్రహించగల సామర్థ్యం కలిగి యుండును. సుఖం పట్ల రాగాన్ని, దుఃఖంపట్ల ద్వేషాన్ని కలిగి యుండును. సదా సుఖాలను బొంద ప్రయత్నించు చుండును. ఈశ్వరుడు నిర్మించి ఇచ్చిన శరీరాలతో ఆయా శరీరాలను బట్టి సుఖాల కొరకు ప్రయత్నించును. ప్రాణు లన్నింటిలో ఉత్తమమైన మానవ జన్మను బొందిన జీవుడు వివేకి యైనచో తన జ్ఞానమును వికసింప జేసికొని ధర్మాత్ముడై ఈ లోకంలో ఉన్నతిని బొందును. పరమాత్మను బొంద సాధన చేసి ముక్తిని బొందును. వివేకం లేని అజ్ఞాని ఇంద్రియ లోలుడై పెక్కు ఇడుముల బడును. రాగ ద్వేష రంజితుడై

అధర్మాత్ముడై నీచయోనులను బొందును.

ఇక 'ప్రకృతి' యనగా అనేక పరమాణువుల రాశి. అందు మూడు రకముల పరమాణువు లుండును. సత్త్వము, రజస్సు, తమస్సు అనునవి వాటి పేర్లు. అవియును అతి సూక్ష్మమైనవే కాని జీవులంత సూక్ష్మమైనవి కావు. ఈ పరమాణువులతోనే పరమేశ్వరుడు ఈ స్థూల సృష్టిని గావించెను. అందుచే మనకు ఇంద్రియ గోచరము లగుచున్న పదార్థము లన్నియు ప్రకృతి పరమాణువుల పరిణత రూపమే. ఆ పరిణతి ఏ విధముగా జరిగెనన-

**తస్మాద్ వా ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః।**
**ఆకాశాద్ వాయుః। వాయో రగ్నిః। అగ్నే రాపః। అద్భ్యః**
**పృథివీ। పృథివ్యా ఓషధయః। ఓషధీభ్యోఽన్నమ్। అన్నాద్**
**రేతః। రేతసః పురుషః। స వా ఏష పురుషో అన్నరసమయః॥**
**(తైత్తిరీయ ఉపనిషత్ 2.1)**

ఆ పరమేశ్వరుడు సృష్టిని జేయ సంకల్పించి తనలో సామ్యావస్థలో పడియున్న పరమాణువులను ఒక క్రమ పద్ధతిలో వేరు వేరు నిష్పత్తులలో జోడించెను. అందువలన మొదటగా శబ్దము పయనించు ఆకాశ నామక తత్త్వ మేర్పడెను. తదుపరి వాయువును నిర్మించెను. తదుపరి అగ్నిని, పిమ్మట జలమును, అనంతరం భూమిని నిర్మించెను. తదనంతరము ఓషధులను అనగా వృక్ష జాతులను సృష్టించెను. ఆ వృక్షజాతి నుండి ప్రాణుల జీవనాధారమగు అన్నము - ఆహారము సృజింపబడెను. ఆ అన్నమును తిని ప్రాణులు రసరక్తాది క్రమమున చివరకు వీర్యమును బొందును. అట్లు మాతాపితరుల రజో వీర్యముల నుండియే సంతతి కలుగును. కాన, ప్రాణుల శరీరా లన్నియు అన్నరసమయములే.

పై తైత్తిరీయ ఉపనిషత్తులోని సృష్టి రచనా క్రమమును చాలావరకు నేటి విజ్ఞానముతో సరిపోల్చవచ్చును. ఆధునిక వైజ్ఞానికులు కనబడు = దృగ్గోచరమగు సృష్టి యంతా పరమాణువులతో ఏర్పడిన దందురు. అందు ముఖ్యంగా ఎలక్ట్రాన్, ప్రోటాన్, న్యూట్రాన్ అను మూడు రకముల పరమాణువులు ఉన్నవందురు. వీటినే మన మహర్షులు తైజస, వైకారీ, భూతాది అహంకారము లని పేర్కొనిరి. ఇచట అహంకార మనగా గర్వమని యర్థము కాదు. ఒక తత్త్వమని అర్థము. ఇవే వివిధ నిష్పత్తులలో సమ్మిళితమై

మూలకాలు (Elements)గా ఏర్పడినట్లు చెప్పుదురు. ఇంతవరకు ప్రాకృతికముగా లభించు 92 మూలకాలు కనుగొనబడినవి. శాస్త్రవేత్తలు మరికొన్ని కృత్రిమమైన మూలకాలను నిర్మించిరి. వాటి సంఖ్య పదికి పైగానే కలదు. ఇంకను పరిశోధనలు జరుగుచున్నవి. ఆ మూలకాలలో మొట్టమొదటిది హైడ్రోజన్ వాయువు. రెండవది హీలియం - వాయువు, హైడ్రోజన్ అణువులే కొన్ని రాసాయనిక చర్యల వలన హీలియంగామారు అవకాశం కలదు. ఆ విధంగా పరివర్తన చెందుచున్నప్పుడు అగ్ని తత్త్వము ఉత్పన్నమగును. ఈ రాసాయనిక ప్రక్రియయే నేటికిని మన సూర్యుని యందును, సృష్టిలోని మిగిలిన సూర్యులందును (నక్షత్రములందును) జరుగుచున్నది. సూర్యుని నుండి ఉత్పన్నమైన ఉష్ణశక్తి, రేడియో ధార్మిక శక్తుల వల్ల కొన్ని ప్రత్యేక పరిస్థితులలో హైడ్రోజన్, ఆక్సిజన్‌లు సమ్మిళితమై నీరు ఏర్పడి యుండును. అది ముందు నీటి యావిరిగా నుండి మేఘములు ఏర్పడి ఉండును. ఆ మేఘములు మన భూ గ్రహమును చల్లపరచి జలపూర్ణము చేసి యుండును. తదుపరి వృక్ష జాతుల ఉత్పత్తి, అనంతరం పశు పక్ష్యాదుల సృష్టి చివరగా మానవుల సృష్టి జరిగియుండును. ప్రథమ సృష్టి అమైథున సృష్టియైనను ఇపుడు ప్రాణులు తీసుకున్న ఆహారము రసరక్తాదులుగా పరివర్తన చెందుచు రజో వీర్యములై మైథున సృష్టి జరుగుచున్నది.

ఇక మన సూర్యుని జననం గురించి తెలిసికొందము. విశాల వినీలాకాశంలో మనకు కనబడే అనేక నక్షత్ర రాశులలో మన సూర్యుడు కూడా ఒక మధ్యతరగతి నక్షత్రం. ఇదియును అన్నిటివలెనే పరమేశ్వరుని హిరణ్యగర్భం (కాస్మిక్ ఎగ్) నుండి జన్మించినదే. జగద్రచన చేయుటకు పూర్వము పరమేశ్వరుడు తనలోనున్న ప్రకృతి పరమాణువులను ఏకత్రితము చేసి ఒక పెద్ద అండముగా నిర్మించెను. దీనికే హిరణ్యగర్భమని పేరు. ఇచట హిరణ్య మనగా బంగారమని యర్థము కాదు. **'హిరణ్యం వై జ్యోతిః'** 'ప్రకాశమయ లోకములుగలది' యని అర్థము. ఆ హిరణ్యగర్భము పక్వమై బ్రద్దలయినది. అనగా అందలి స్తబ్ధావస్థలో నున్న పరమాణువు లన్నియు ఎలక్ట్రాన్, ప్రోటాన్, న్యూట్రాన్‌లుగా పక్వమై పగిలినది. అప్పటికి ఎంతో వేడి పుట్టుట వల్ల ఆ విశ్వపదార్థమంతా వాయు రూపంలోనే ఉండేది. ఆ వాయు పదార్థము మేఘాలు మేఘాలుగా విశ్వంలో విస్తరించింది. కాంట్, లాప్లేస్‌ల మేఘ సిద్ధాంతము నెబ్యులర్ హైపోథిసిస్. ఆ వాయు మేఘాలు

క్రమంగా చల్లబడి కుదించుకు పోవడం జరిగింది. ఆ మేఘాలు తమ చుట్టూ తిరుగుచు కుదించుకొనుచున్న కొద్దీ వాటి పరిభ్రమణ వేగం అధికమయ్యింది. ఆ వేగం అధికమయిన కొద్దీ వాయు మేఘంలోని వెలుపలి పొరలో ఉన్న పదార్థం విడిపోతూ విడిపోతూ చిన్నచిన్న మేఘాలుగా ఏర్పడి గ్రహ ఉపగ్రహ ఉల్కాదులుగా ఘనీభవించాయి. మధ్యలోని పెద్దమేఘం సూర్యగోళంగా రూపొందింది. వీనిలో చిన్నవి వాటికన్న పెద్దగోళం యొక్క ఆకర్షణ శక్తికి కట్టుబడి వాటి చుట్టూ పరిభ్రమిస్తూ అన్నీ కలిపి ఒక సూర్య కుటుంబంగా ఏర్పడ్డాయి.

ఇప్పటికీ సూర్యునిలోని పదార్థమంతా వాయు రూపంలోనే ఉంది. అందలి హైడ్రోజన్ వాయువు హీలియంగా పరివర్తన చెందుచూ అపారమైన సౌరశక్తిని వ్యాపింప జేస్తున్నది. అందలి కొద్ది శక్తి మాత్రమే మన భూమికి చేరుచున్నది. అయినప్పటికీ ఆ కొద్ది సౌరశక్తియే భూమిపైనున్న ప్రాణి జాతులన్నిటికి జీవనాధార మగుచున్నది.

నేటి వైజ్ఞానికులలో పెక్కురు అనీశ్వరవాదులు. వారు దేవుడు లేడందురు. ఇవన్నీ ప్రకృతి నియమాల వల్ల జరుగుచున్న వందురు. మరి, కర్త లేనిది యింతటి సువ్యవస్థితమైన మహత్ కార్యమెట్లు జరుగును? నియామక కర్త లేనిది నియమము లెట్లుండును? అసంఖ్యాకమైన ఈ గోళాలన్నిటికి ఆధార మేది? ఇట్టి ప్రశ్నలకు సమాధానాలు వారి వద్ద లేవు. కాని వేదము ఆ జగత్కర్త నెట్లు కీర్తించుచున్నదో చూడుడు-

**హిరణ్యగర్భః సమవర్తతాగ్రే**
**భూతస్య జాతః పతిరేక ఆసీత్।**
**స దాధార పృథివీం ద్యా ముతేమాం**
**కస్మై దేవాయ హవిషా విధేమ॥**

**(యజుర్వేదము - 13 - 4)**

అనగా 'సృష్టికి పూర్వము సమస్త పరమాణువులు సమావస్థలో హిరణ్య గర్భముగా (కాస్మిక్ ఎగ్గా) పరమేశ్వరుని యందుండెను. ఆ పరమేశ్వరుడే దానిని వికృతం చేసి పంచ భూతములను, వాటితో సమస్త ప్రాణికోటిని సృష్టించెను. అతడే వాటన్నిటికి ఏకమాత్ర పతిగా - పాలకుడుగా నున్నాడు. అతడే ఈ భూమిని, ద్యులోకమును (విశాల విశ్వములోని సమస్త సూర్య

కుటుంబాలను) అంతరిక్షమందలి గ్రహ, ఉపగ్రహ, నక్షత్రాదులను ధరించి వాటికి ఆధారముగా నున్నాడు. అట్టి సుఖ స్వరూపుడైన మహాదేవునకు అత్యంత విధేయతతో నమస్కరించు చున్నాము.' ఇట్టి విజ్ఞానభరిత ప్రార్థనలతో కూడిన మంత్రములు వేదమునందు కోకొల్లలు. నేటికిని అంతుబట్టని సృష్టి రహస్యాలకు సమాధానా లందున్నాయి. శ్రద్ధాభక్తులతో వెదకిన దొరకకపోవు. ఋషి మునుల దృష్టి కోణంతో నాలోచించిన పరిష్కారాలు కనబడకపోవు. ప్రపంచంలో మరే ఇతర మత గ్రంథాలలోను లేనంత విజ్ఞాన భండారం వేదాలలో ఉంది.

పై మాటలు అతిశయోక్తులు కావు. దీనికి నిదర్శనమేమంటే - యజుర్వేదానికి ఉపవేదం ధనుర్వేదం అని మన శాస్త్రాలలో కనబడుతుంది. దానిలో యుద్ధవిద్యలెన్నో ఉపదేశించబడ్డాయి. శత్రువుల నెదుర్కోవటానికి కావలసిన వివిధ వ్యూహ పద్ధతులే కాక అనేక శస్త్రాస్త్రాల నిర్మాణం కూడా చెప్పబడింది. అది మనకిప్పుడు లభించదు. విదేశీయుల ద్వేషాగ్నికి ఆహుతి అయ్యింది. ఆ విద్య నెరిగిన ఒక పండితుడు మిగిలి ఉండగా జర్మనీ నియంత హిట్లర్ వారిని గూఢచారుల ద్వారా తమ దేశానికి తీసుకువెళ్ళిపోయాడు. అక్కడ వారికి గౌరవప్రదమైన ఉద్యోగాన్నిచ్చి వారినుండి శస్త్రాస్త్ర విజ్ఞానమే కాక వేదాలలో ఉండే అనేక విజ్ఞాన విద్యలను జర్మనులకు నేర్పించాడు. జర్మనీ వారు వారిని బ్రతికి ఉన్నంతవరకు గౌరవించటమే కాక మరణానంతరం కూడా వారి చిత్రపటాన్ని ఒక కార్యాలయంలో గోడకు వ్రేలాడ కట్టుకొని గౌరవిస్తున్నారు. మన దేశంలో ఉన్న అతని భార్యకు చాలాకాలం వరకు ఆర్థిక సహాయం అందించారు. అతడెవరో కాదు. మన ఆంధ్రుడే. పేరు దండిభట్ల విశ్వనాథశాస్త్రి , రాజమహేంద్రవర నివాసి. శ్రీమతి ఇందిరాగాంధీ ప్రధానమంత్రిగా ఉన్నప్పుడు భారతదేశాన్నుండి పశ్చిమ జర్మనీకి వెళ్ళిన మన రాయబారి వల్ల ఈ విషయం వెల్లడయ్యింది. ఆ రాయబారికి అక్కడివారు వారి కార్యాలయాలు చూపిస్తూ వీరి చిత్రపటాన్ని చూపి వారి నుండి తాము ఎంతో విజ్ఞానాన్ని పొందామని చెప్పి తమ కృతజ్ఞతలను ప్రకటించుకున్నారట. అది విని ఆ రాయబారి ఆశ్చర్యపోయాడట. కనుక 'వేదం విజ్ఞాన భండారం' అనుటలో అతిశయోక్తి ఏమున్నది?

# ఆధునిక వైజ్ఞానికుల దృష్టిలో సూర్యుడు

## సూర్యునిలో వింతలు - సంక్షిప్తంగా

సూర్యుని గురించి బాగా తెలియాలంటే మన భూమితో దానిని సరిపోల్చి చూడాలి. మన భూమికన్న సూర్యుడు 13 లక్షల రెట్లు విశాలమైనవాడు. అంటే సూర్యుడు ఆక్రమించిన స్థలంలో 13 లక్షల భూగోళాలు పడతాయన్నమాట. భూ వ్యాసం 8 వేల మైళ్ళయితే సూర్యుని వ్యాసం 8 లక్షల 64వేల మైళ్ళు. (ద్రవ్యరాశిలో భూమి కంటె 3 లక్షల 32 వేల రెట్లు బరువైనవాడు. ఈ బరువులో ఎక్కువ భాగం కేంద్రంలోనే (మధ్యలోనే) కేంద్రీకృతమై ఉంది. పై భాగమంతా వాయువులతో పలుచగా ఉంటుంది. ఇక గురుత్వాకర్షణ శక్తి చూస్తే అది భూమికన్న 22 రెట్లు ఎక్కువ. అంటే ఇక్కడ 50 కిలోల బరువు తూగే మనిషి సూర్య గోళం మీద చూసుకుంటే 50 x 22 = 1100 కిలోల బరువుంటాడు. అసలు ఆ పీడనానికి తట్టుకోలేక అతుక్కుపోయి చితికిపోతాడు. దాని మీద పలాయన వేగం కూడ చాలా ఎక్కువే. భూమి నుండి రాకెట్‌లో రోదసిలోకి ఎగిరిపోవాలంటే సెకండుకు 7 మైళ్ళ వేగం చాలు. కాని, సూర్యునిపై నుండి ఎగరాలంటే సెకండుకు 384 మైళ్ళ వేగం కావాలి. సూర్యుడు మన భూమి వలెనే ఆత్మప్రదక్షిణ చేస్తూ పాలపుంత కేంద్రం చుట్టూ తిరుగుతున్నాడు. ఒకసారి తనలో తాను - ఆత్మ ప్రదక్షిణ చేయడానికి దాదాపు 25రోజులు పడుతుంది. పాలపుంత (నక్షత్ర సముదాయం - మిల్కీవే) కేంద్రం చుట్టూ 200 మైళ్ళ వేగంతో తిరుగుతున్నాడు. ఇటీవలి పరిశోధనలలో సూర్యుడు 'వైరా' నక్షత్ర మండలం దిశగా సెకనుకు ఇరవై కిలోమీటర్ల వేగంతో పయనిస్తున్నాడని తెలిసింది. మన పాలపుంత కేంద్రానికి 30 వేల కాంతి సంవత్సరాల దూరంలో మన సూర్య కుటుంబం ఉందని ఖగోళ శాస్త్రజ్ఞుల అంచనా. ఈ పాలపుంత ఒకసారి తన చుట్టూ తాను తిరగటానికి దాదాపు ఇరవై కోట్ల సంవత్సరాలు పడుతుందట. సూర్యుడు తానొక్కడే కాక గ్రహ ఉపగ్రహాదు లన్నిటితో కలిసి తిరుగుచున్నాడు కనుక మన భూమి, మనము కూడా ఇంత వేగంతోను పాలపుంత కేంద్రం చుట్టూ తిరుగుచున్నట్లే. మన పుంతలోగల 10వేల కోట్ల నక్షత్రాలలో అన్నీ ఒకేరకంగా కాకుండా కొన్ని పెద్దవి కొన్ని చిన్నవి కూడా ఉన్నాయి. మన సూర్యుడు ఒక మధ్యతరగతి

నక్షత్రం మాత్రమే. పరిమాణంలో ఇంతకన్న చాలా పెద్ద నక్షత్రాలు కూడా ఉన్నాయి. నీల మహాతారలు (బ్లూజైంట్స్) సూర్యుని కన్న వెయ్యి రెట్లు పెద్దవి. అరుణ మహాతారలు (రెడ్ జైంట్స్) లక్ష రెట్లు పెద్దవి. విశ్వంలో ఇటువంటి పాలపుంతలు (గెలాక్సీలు) మరెన్నో ఉన్నాయంటున్నారు వైజ్ఞానికులు. వాటిలో అరుణ మహాతారలకన్న పెద్ద నక్షత్రాలు (సూర్యులు) ఉన్నాయేమో!

సూర్యోపరితలమంతా అల్లకల్లోలంగా ఉంటుంది. కేంద్రంలో (గర్భంలో) జరిగే న్యూక్లియర్ రియాక్షన్స్‌వల్ల మండుతూ వెలుగుతూ ఉండే వాయు మేఘాలు ఒకటి తరువాత మరొకటిగా ప్రతి క్షణం దూసుకు వస్తుంటాయి. వాటితో ఉపరితలంపై 3, 4 వందల వ్యాసంగల పెద్దపెద్ద బొబ్బలు ఏర్పడతాయి. అవి క్షణంలో అణిగిపోయి మరల క్రొత్తవి పుట్టుకొస్తాయి. ఒక్కొక్క పర్యాయము 3,4 బొబ్బలు కలిసిపోయి ఒక పెద్ద బొబ్బగా ఏర్పడవచ్చు. వాటిని మనం దూర వీక్షణ యంత్రం (టెలిస్కోపు)తో చూస్తే బియ్యపు గింజలవలె కనబడతాయి. అందుచే వాటిని గ్రాన్యూల్స్ అంటారు శాస్త్రజ్ఞులు.

ఇక లోపలి భాగం పరిశీలిస్తే మధ్యభాగంలో 1 కోటి 40 లక్షల సెంటీగ్రేడ్ డిగ్రీల ఉష్ణోగ్రత ఉంటుంది. అంత వేడిలో ఏ పదార్థం ఘనరూపంలోగాని, ద్రవరూపంలో గాని ఉండలేదు. అందుచే సూర్యగోళమంతా వాయు రూపంలోనే ఉంది. దాని మధ్యలో అత్యధిక ఉష్ణోగ్రత ఉండుటవల్ల వాయు రూపం కూడా విచ్ఛిన్నమై ప్లాస్మా (Plasma) స్థితిలోకి మారిపోతుంది. అంటే అణువులలోని ఎలక్ట్రాన్లు, అణుగర్భంలోని ప్రోటాన్, న్యూట్రాన్లు విడిపోయి ఉంటాయి. గోళమంతా వాయు రూపంలో ఉన్నా, దీని బలమైన గురుత్వాకర్షణ శక్తివల్ల అతి తేలిక వాయువులు కూడా బంధింపబడి గుండ్రటి బంతిలా తయారైనవి. పై భాగమంతా మంటలతో కూడి ఉంటుంది. ఆ మంటలు పై నుండి 200 మైళ్ళ లోతు వరకు ఉంటాయి. అవే మనకు దూరం నుండి తేజోవలయంలా (కాంతి పొరల్లా) కనిపిస్తాయి. దీనినే వైజ్ఞానికులు ఫోటోస్ఫియర్ అంటున్నారు. ఈ పొర నుండే మన భూమికి, మిగిలిన గ్రహ ఉపగ్రహములకు వెలుతురు, వేడి లభిస్తున్నాయి. ఆ కాంతి పొర పైన వాతావరణ పొర ఉంటుంది. అది ఎఱ్ఱరంగులో ఉంటుంది. కనుక దానిని రంగు పొర (క్రోమోస్ఫియర్)

అంటున్నారు. ఆ వాతావరణ రంగు పొర 6 వేల మైళ్ళ మందంగా (దళసరిగా) ఉంటుంది. దానిపైన కూడా మరొక కిరీటం లాంటి 'కరోనా' అనే పొర ఉంది. అది బుధగ్రహం వరకు (3 కోట్ల 60 లక్షల మైళ్ళ వరకు) వ్యాపించి ఉంటుంది. అది సంపూర్ణ సూర్యగ్రహణ సమయంలో మాత్రమే మన కంటికి కనబడుతుంది. ఇప్పుడు కూడా చూడాలనుకుంటే బెర్నాడ్ ల్యాబ్ (ఫ్రాన్స్) రూపొందించిన పరికర సాయంతో చూడవచ్చు.

ఇకపై సౌరశక్తిని గురించి ఆలోచిద్దాము. సూర్యగర్భంలో 1 కోటి 40 లక్షల డిగ్రీల వేడి ఉన్నట్లు అణువులన్నీ విడిపోయి ప్లాస్మాగా మారిపోయినట్లు ముందే తెలుసుకున్నాము. ఆ స్థితిలో హైడ్రోజన్ బాంబులో వలె థర్మో న్యూక్లియర్ రియాక్షన్స్ మరియు అణు గర్భ సంయోగ ప్రక్రియలు జరిగి అందలి హైడ్రోజన్‌వాయువు హీలియం వాయువుగా మారుతూ ఉంటుంది. అది ఎంత పరిమాణంలో జరుగుతుందో తెలుసా? అది సెకండుకు 58 కోట్ల టన్నుల హీలియంగా మారుతూ ఉంటుంది. మిగతా 40 లక్షల టన్నుల హైడ్రోజన్ నష్టమై సౌర శక్తిగా మారుతూ ఉంటుంది. ఆ శక్తి సూర్యగర్భం నుండి దూసుకువచ్చి రేడియేషన్‌గా చుట్టూ ప్రసరిస్తుంది. అందులో చాలా కొద్దిభాగం మాత్రమే అంటే 209 కోట్ల భాగాలలో ఒక భాగం మాత్రమే (1/209 కోట్లు మాత్రమే) మన భూమికి చేరుతూ ఉంటుంది. అయినా ఆ కొద్ది భాగంతోనే మన భూమిపై ప్రతి చదరపు మైలుకు 46 లక్షల 90 వేల అశ్వశక్తి (హార్స్ పవర్) లభిస్తుంది. సూర్యునిలో అంతగా హైడ్రోజన్ నష్టమై పోతున్నా మరొక 500 కోట్ల సంవత్సరాలకు సరిపోయేటంత హైడ్రోజన్ దానిలో ఉంది. కాన భయం లేదంటున్నారు శాస్త్రజ్ఞులు. అయితే సూర్యునిలో ఉత్పన్నమయ్యే ఈ సౌరశక్తి గామా రేడియేషన్ రూపంలో ఉంటుంది. 'గామా' కిరణాలు చాలా భయంకరమైనవి. అవి సామాన్య కాంతి కిరణాల కంటే కొన్ని కోట్ల రెట్లు అధిక శక్తిని కలిగి ఉంటాయి. అవి యథాతథంగా వెలువడితే మన భూమే కాదు గ్రహ ఉపగ్రహాలన్నీ భస్మమైపోతాయి. అట్టి ప్రమాదం జరుగకుండా పరమేశ్వరుడు చాలా చక్కటి ఏర్పాటు చేశాడు. సూర్యుని కాంతి పొర క్రింద ఉండే దట్టమైన కిక్కిరిసిన వాయువులు అడ్డుపడటంతో గామా కిరణాల శక్తి బాగా తగ్గిపోతుంది. అవి రంగుపొర (క్రోమోస్ఫియర్) ద్వారా ప్రయాణం చేసి మరింత బలహీనపడతాయి. అయినప్పటికి ఇంకా వాటిలో

ఎక్స్‌రే, అల్ట్రా వయిలెట్, ఇన్‌ఫ్రారెడ్ మొదలైన కొన్ని అపాయకరమైన కిరణాలు మిగిలి ఉంటాయి. అయితే మన భూమికి రక్షణ కవచంగా ఉన్న ఓజోన్ పొర, వాతావరణ పొరలు, అయస్కాంత క్షేత్రం వాటిని మరింత బలహీనపరచి ప్రాణుల మనుగడకు ముప్పు లేకుండా చేస్తున్నాయి. ఈ విధంగా వడగొట్టబడి నిరపాయకరమైన సౌరశక్తి మనకు లభిస్తున్నది.



**తన్తుం తన్వన్ రజసో భానుమన్విహి జ్యోతిష్మతః పథో రక్ష ధియా కృతాన్।**
**అనుల్బణం వయత జోగువామపః మనుర్భవ జనయాదైవ్యం జనమ్ ॥**

**(ఋ. మం. 10, సూ. 53, మం. 6)**

ఓ కర్మశీల మానవా ! జీవనయాత్ర రూప సుందర వస్త్రమును నేయుచు ఆకాశములో గ్రహములతో గూడిన సూర్యుని అనుసరించి కర్మలు చేయుము. ఋషులు నిర్మించిన సంస్కృతీ సభ్యతలను వెలుగుబాటలను రక్షింపుము. మనన శీలుడవై దివ్య మానవ సమాజమును నిర్మింపుము.

# సూర్యునిలో మచ్చలు (సన్ స్పాట్స్)

సూర్యునిలో ఏర్పడే మచ్చలను గురించి కొంత తెలుసుకోవడం అవసరమే. సూర్యగర్భంలో నుండి దూసుకువచ్చిన రేడియేషన్ వల్ల సూర్యోపరితలంపై బొబ్బల వంటి గ్రాన్యూల్స్ ఏర్పడతాయని మనం ఇంతకు ముందు ప్రకరణంలో తెలిసికొన్నాము. మనకు ఆ గ్రాన్యూల్స్ చుట్టూ నల్లటి ప్రదేశాలు కనబడతాయి. ఆ నల్లటి ప్రదేశాలు అప్పుడప్పుడు ఒక దానితో ఒకటి కలిసిపోయి చాలా పెద్దవిగా ఏర్పడతాయి. వీటినే సూర్యుని మచ్చలు - సన్ స్పాట్స్ అంటారు. ఇవి నిజంగా మచ్చలు కావు. విపరీతమైన కాంతిగల మంటలకన్న కొంత తక్కువ కాంతి గల ప్రదేశాలు మాత్రమే. కాని, వాటి శక్తి చాలా పెద్దపెద్ద అయస్కాంత శక్తికన్న కొన్ని వేల రెట్లు అధికంగా ఉంటుంది. ఆ మచ్చల వైశాల్యం కూడ చాలా పెద్దగానే అంటే 5 వందల నుండి 50 వేల మైళ్ళ వరకు విస్తరించి ఉంటాయి. అవి కూడా అస్థిరంగానే ఉంటాయి. కొద్దిసేపటిలోనే లేకుండా పోతాయి. అందులో కొన్ని మాత్రం చాలాకాలం కొన్ని నెలల వరకు కూడా ఉండవచ్చు. ఈ విధంగా ఎక్కువ కాలం ఉండే మచ్చల ప్రభావం మన భూమిపైన పడుతుంది. మచ్చలు ఎక్కువగా ఉంటే పంటలు బాగా పండి సుభిక్షంగా ఉంటుందనీ, మచ్చలు చాలా తక్కువగా ఉంటే పంటలు సరిగా పండక దుర్భిక్షం ఏర్పడుతుందనీ, ఇంతేగాక విప్లవాలు, యుద్ధాలు కూడా జరుగవచ్చని కొందరి ఊహాగానాలు. మరికొందరు సముద్రంలో తుఫానులు, ఉప్పెనలు రావడానికి ఈ మచ్చలే కారణ మంటున్నారు. ఇందెంతవరకు సత్యమున్నదో కాని సూర్యునిలో మచ్చలు ఎక్కువగా ఉంటే రేడియో ప్రసారాలలో గందరగోళాలు ఏర్పడటం మాత్రం సత్యం. ఇంతేగాక ఉత్తర ధృవ ప్రాంతంలో 'అరోరా బొరియాలిస్' అనబడే వింతకాంతులు ఏర్పడుతున్నట్లు శాస్త్రజ్ఞులు కనుగొన్నారు. కాన సూర్యునిలో ఏర్పడే మచ్చలకు భూ అయస్కాంత క్షేత్రానికి, భూ వాతావరణానికి ఎంతో కొంత సంబంధం ఉంది.

ఈ మచ్చలనే మన వేదం సర్పం అంటుంది. సర్పాలంటే పాములని కాదు. సర్పణాత్ సర్పః = ప్రాకుచూ (జరుగుచూ) పోవును గాన సర్పము. సూర్యునిలో మచ్చలు కూడా పాములవలె ప్రాకుచున్నట్లు వ్యాపిస్తుంటాయి. ఆ మచ్చలను గూర్చిన జ్ఞానం కూడా మనకు అవసరమే కనుక అటువైపు

మన దృష్టిని ఆకర్షించుటకు **'తేభ్యో సర్పేభ్యో నమః' (యజు 13-8)** 'ఆ సర్పములకు నమస్కారము' అని చెప్పబడినది. అనగా వాటిని సరిచేయ ప్రయత్నింతుము గాక అని అర్థము. ప్రాచీన ఋషులు అగ్నిహోత్ర ప్రక్రియ ద్వారా సూర్యునిలోగల మచ్చలను సరిచేసి భూ వాతావరణాన్ని ప్రాణి మనుగడకు అనుకూలముగా చేసేవారు.

మన పూర్వీకులు నిత్యాగ్ని హోత్రం చేస్తూ తమ వంతు కర్తవ్యంగా వాతావరణాన్ని శుద్ధి చేసేవారు. ఉదయకాలం ఈ క్రింది మంత్రాలతో ఆహుతుల నిచ్చి సూర్యుని జ్యోతిని, వర్చస్సును సరిచేసేవారు.

**ఓం సూర్యో జ్యోతిర్జ్యోతిః సూర్య స్వాహా**

సూర్యుడు ప్రకాశ స్వరూపుడు. ప్రకాశమే సూర్య స్వరూపము. ఆ ప్రకాశ వృద్ధికే ఈ ఆహుతి.

**ఓం సూర్యో వర్చో జ్యోతిర్వర్చః స్వాహా**

సూర్యుడు వర్చ స్వరూపుడు. ప్రకాశమే అతని వర్చస్సు. ఆ వర్చస్సు వృద్ధికే ఈ ఆహుతి.

**ఓం జ్యోతిః సూర్యః సూర్యో జ్యోతిః స్వాహా**

జ్యోతియే సూర్యుడు. సూర్యుడే జ్యోతి. ఆ సూర్యజ్యోతి వృద్ధికే ఈ ఆహుతి.

**ఓం సజూర్దేవేన సవిత్రా సజూరుషసేంద్రవత్యా**
**జుషాణః సూర్యో వేతు స్వాహా యజుర్వేదము - 3-9, 10**

సవితా దేవునిచే (సృష్టికర్తచే) సృజింపబడిన ఈ జగత్తున సదా వర్తమానుడై యుండి దివ్యమైన ఉషః - కిరణములతో కూడి అంతటా ప్రకాశించు సూర్యునకు ఈ ఆహుతి నర్పించుచున్నాను.

తదుపరి, అగ్నిహోత్రములో వేయు ఆహుతులు ఈ భూలోకమున (భూరగ్నయే స్వాహా) అగ్నిరూపము చెందుచున్నట్లు భువర్లోకమున అనగా వాతావరణ పరిధిలో (భువర్వాయవే స్వాహా) వాయు రూపం చెందుచున్నట్లు గుర్తించిరి. ఇంతేగాక, ఆ ఆహుతులలోని సూక్ష్మాంశము (హైడ్రోజన్ వాయువు మరియు అతి సూక్ష్మ అణుపరమాణు శకలాలు) స్వర్లోకమున అనగా ఆదిత్య నక్షత్రాదులు సంచరించు ప్రదేశమున లేక సూర్యునిలో **(స్వరాదిత్యాయ స్వాహా)** ఆదిత్య రూపముగా - సూర్యుని ప్రకాశ

వర్ధకములుగా అగుచున్నట్లు గుర్తించిరి. అందుచేతనే ఆదిమ ఋషియైన మను మహారాజు ఈ విధముగా తెలిపెను.

శ్లో॥ అగ్నౌ ప్రాస్తాహుతిః సమ్యగాదిత్య ముపతిష్ఠతే,
ఆదిత్యాజ్జాయతే వృష్టిర్ వృష్టేరన్నం తతః ప్రజాః॥

**మనుస్మృతి 3-76**

యజ్ఞము నందు ఈయబడిన (వేయబడిన) ఆహుతులు క్రమముగా వాయు రూపము చెంది అంతరిక్షము చేరును. ఆ వాయువు నందలి సూక్ష్మాంశము క్రమముగా ద్యులోకమున ప్రవేశించి సూర్యుని చేరును. అచటి సూర్యుని జ్యోతిని వర్చస్సును సంస్కరించి భూ ప్రాణి కోటికి అనుకూలముగా చేయును. తదుపరి సూర్య కిరణములతో కలిసి ద్యు అంతరిక్ష లోకము లందలి జలమును వర్షరూపమున భూమికి తెచ్చును. ఆ వర్షజలముతో పంటలు పండి అన్నాదులు కలుగుటయు తద్వారా ప్రాణులు జీవించుటయు జరుగుచున్నది.

పై మను మహర్షి వాక్యములు వైజ్ఞానిక సత్యములు. దానికి కారణ మేమన - మనము అగ్నిహోత్రములో వేయు ఆహుతులు అనేక రకములైన వాయువులుగా మారును. అవి చాలావరకు రాసాయనిక ప్రక్రియల ద్వారా దుష్ట క్రిమిసంహారక వాయువులుగా మారును. ఇంతేగాక, కొంతభాగము హైడ్రోజన్ వాయువుగాను, అతి సూక్ష్మ అణు పరమాణువులుగాను వెలువడుచున్నట్లు పరిశోధనలలో వెల్లడైంది. అవి చాలా తేలికగా నుండుటచే భూమ్యాకర్షణ శక్తి నుండి తప్పించుకొని ఊర్ధ్వముఖముగా పయనించి ద్యులోకము చేరును. ఈ విషయములను వివరముగా తెలుసుకొనగోరువారు నాచే రచింపబడిన 'అగ్నిహోత్ర వైజ్ఞానిక స్వరూపము' అను పుస్తకము చదువగోరెదను.

ఇక అవి సూర్యునికి జ్యోతిగా నెట్లగునో పరిశీలింతము. సూర్యోపరితల (ఫోటోస్ఫియర్) ఉష్ణోగ్రత 6 వేల డిగ్రీలు. కాని ఉపరితలం నుండి దూరంగా పోయే కొలది ఉష్ణోగ్రత తగ్గటకు బదులు ఎక్కువగుచున్నట్లు కనుగొనబడినది. సూర్యుని నుండి దూరంగా 1250 మైళ్ళు వరకు ఉష్ణోగ్రత అట్లే ఉంటుంది. తదుపరి క్రమంగా పెరుగుతూ క్రోమోస్ఫియర్ సరిహద్దుల వద్దకు (6,250 మైళ్ళు) వచ్చేసరికి లక్ష డిగ్రీలకు చేరుకుంటుంది. క్రమంగా కరోనాలోకి (62 వేల మైళ్ళు) వచ్చేసరికి పది

లక్షల డిగ్రీలకు చేరుకుంటుంది. ఈ విధంగా ఉష్ణోగ్రత పెరుగుటకు కారణమేమని కొందరు శాస్త్రజ్ఞులు పరిశోధించిరి. ఆ పరిశోధనలలో డా. ఫ్రెడ్ హోయల్ ప్రతిపాదించిన సిద్ధాంతము హేతుబద్ధంగా, వైజ్ఞానికంగా కనబడుతున్నది.

సూర్యుడు నక్షత్రాల మధ్య పాలపుంత కేంద్రం చుట్టూ సెకండుకు 13 మైళ్ళ వేగంతో ప్రయాణం చేస్తున్నాడు. అతడు ప్రయాణం చేసే రోదసీ మార్గం పూర్తిగా శూన్య ప్రదేశం కాదు. దానిలో కూడా అతి పల్చగా హైడ్రోజన్‌వాయుమేఘాలు ఉన్నాయి. అవి నిజంగా వాయు మేఘాలు కావు. ఒక ఘనపు సెంటీమీటరుకు 10 అణువులు కల అతి పల్చని వాయువు. దానిలో విడివిడిగా ఉంటూ సమూహంగా ప్రయాణం చేస్తున్నాయి కనుక వాటిని మేఘాలన్నారు. అవి సూర్యుని దారికి అడ్డు వస్తూ ఉంటాయి. వాటిని సూర్యుడు ఆకర్షిస్తాడు. అవి సూర్యునికి అన్నివైపుల నుండి వేగంగా దగ్గరకు వస్తాయి. అవి దగ్గరకు వచ్చే కొలది వాటి వేగం పెరిగి సెకండుకు 375 మైళ్ళ వేగంతో సూర్యుని ఢీకొంటాయి. దానివల్ల కరోనా పైభాగంలో ఉష్ణోగ్రత 10 లక్షల డిగ్రీల వరకు పెరిగిపోతుంది. ఇదీ ఫ్రెడ్ హోయల్ ప్రతిపాదించిన అణుపాత సిద్ధాంతం (ఇన్‌ఫాల్ థియరీ)

కాబట్టి అగ్నిహోత్రంలోనుండి వెలువడే ఉదజని సూక్ష్మ అణు పరమాణువుల పరిమాణము చాలా స్వల్పమైనా రోదసిలో ప్రవేశించి సూర్యుని తాకేసరికి గొప్ప శక్తివంతమైనవే అవుతాయి. అందుచేతనే సామవేదం **'సూర్యస్య భానుం యజ్ఞో' 'దాధార' (సామ. 18-45)** సూర్య ప్రకాశం యజ్ఞంపై (అగ్నిహోత్రంపై) ఆధారపడి యుండు' నని చెబుతుంది.



# భారతీయ ఋషుల దృష్టిలో సూర్యుడు

పై ప్రకరణములో ఆధునిక వైజ్ఞానికులు కనిపెట్టిన సూర్యగోళ వింతలు తెలుసుకున్నాము. ఇవన్నియు మన ప్రాచీన ఋషులకు తెలిసిన విషయాలే. వైజ్ఞానికులు మైళ్ళలో టన్నులలో చెప్పిన కొలతలు తూనికలనే మనవారు ఆనాటి వారి గణితంతో యోజనాలలో, మణుగులలో చెప్పారు. యోజనం అంటే 5 ఐదు మైళ్ళు లేదా 8 ఎనిమిది కి.మీ. మణుగు అంటే సుమారు 11 కిలోలు. ఈ అంకెలు గుర్తు పెట్టుకోవడం కష్టమని వాటిని మనోరంజకంగా ఆలంకారికంగా చెబుతూ సంస్కృతంలో శ్లోకబద్ధం చేశారు. వాటిని సంగీతంతో జోడించి పాడుకుంటే అవి శ్రవణానందంగానం, మనోల్లాసంగాను ఉంటాయి. మన ఖగోళ విజ్ఞానమంతా శ్లోక బద్ధంగాను, సూత్రబద్ధంగాను ఉంది. ఆ విధంగా శాస్త్రాలు వ్రాయడంవల్ల కంఠస్థం చేసికోవడం తేలిక. స్మృతిలో చాలాకాలం నిలుపుకోవడానికి అనుకూలంగా ఉంటాయి. ఆ శ్లోకాల ఆధారంగానే సామాన్య విద్య మాత్రమే కలిగిన పంచాంగ కర్తలు కూడా సూర్యచంద్రుల భ్రమణాన్ని, భూమి యొక్క పరిభ్రమణాన్ని ఖచ్చితంగా లెక్కలుగట్టి చెబుతున్నారు. సూర్యగ్రహణాన్ని, చంద్రగ్రహణాన్ని లెక్కించి చెప్పగా వాటిని మనం ప్రత్యక్షంగా చూస్తున్నాము.

మహాభారత యుద్ధం తరువాత మన దేశం విదేశీయుల దురాక్రమణకు గురికావడం, మన విజ్ఞాన గ్రంథాలలో నూటికి తొంభై శాతం వారి ద్వేషాగ్నికి ఆహుతి కావడం మన దురదృష్టం. మిగిలి ఉన్న ఆ కొద్ది గ్రంథాలే నేడు మనకు ప్రపంచ ఖగోళ విజ్ఞాన రంగంలో అత్యున్నత గౌరవాన్ని తెచ్చిపెడుతున్నాయి. అన్ని గ్రంథాలు ఉండి ఉంటే భారతదేశం పూర్వం వలె ఇప్పుడును ప్రపంచానికి గురువుగానే యుండేది.

నా పూర్వజన్మ పుణ్యభాగ్యంగా 7, 8 సంవత్సరాలుగా కామారెడ్డి ఆర్ష గురుకులంతో సంబంధం ఏర్పడటం. 2 సంవత్సరాలుగా నిరంతరం యిక్కడే ఉండగలగటం జరిగింది. వి.శ.2054 (క్రీ.శ.1997) సంవత్సరం వేసవిలో యిక్కడ ఒక ఉపాధ్యాయ శిబిరం జరిగింది. అందు ఆచార్య వేదవ్రత మీమాంసకుల వారు ఆధ్యాత్మిక విద్యలతోబాటు ఖగోళ, ఆయుర్వేద, భాషా, లలిత కళా విజ్ఞానాల గురించి ఎన్నెన్నో విషయాలు ఉపదేశించారు. నేనట్టి విషయాలు ఇంతకు పూర్వం ఎక్కడా చదవటం గాని, వినడంగాని

జరుగలేదు. వారి స్వాధ్యాయం చాలా విస్తృతమైనది. వారు వేదాంగాలైన శిక్షా, కల్ప, వ్యాకరణ, నిరుక్త, ఛందో, జ్యోతిష్యముల నన్నిటిని అధ్యయనం చేసినవారు. ఉపాంగాలైన న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, మీమాంసా, వేదాంత దర్శనాల నన్నిటిని గూఢముగా శోధించినవారు. వీటన్నిటినీ అధ్యయనం చేయుటయే గాక అధ్యాపనము (విద్యార్థులకు బోధించడం) కూడా చేసిన అనుభవజ్ఞులు. ఉపాధ్యాయ శిబిరంలో మేము విన్న విషయాలన్నీ యిక్కడ వ్రాయడం అసాధ్యమే. ఆ ఉపన్యాసాలను లిపిబద్ధం చేసి ప్రచురించే ప్రయత్నాలు జరుగుతున్నాయి. త్వరలోనే వాటిని చదివే భాగ్యం మనందరికి కలగగలదని ఆశిద్దాం. అందు ఖగోళ విజ్ఞానాన్ని గూర్చిన కొన్ని విషయాలను మచ్చుకు ఇచ్చుట వ్రాస్తున్నాను. వీటితో భారతీయ ఋషుల మేధస్సు కొంత అవగతం కాగలదు.

జ్యోతిష్య శాస్త్రం అతి ప్రాచీనమైన శాస్త్రం. బ్రాహ్మణ ఆరణ్యకాల కాలం నుండి దీని ప్రాచుర్యం ఉంది. వేదార్థాన్ని గ్రహించాలంటే వేదాంగాల అధ్యయనం అనివార్యమంటారు ఋషులు. వేదాంగాలలో జ్యోతిష్యం ఒకటి. అందుచే పూర్వం జ్యోతిష్య విద్యకూడా నేర్చి వేదార్థాన్ని వివరించేవారు. ఈశ్వరోపాసన చేసే భక్తులు కూడా దీనిని తెలుసుకోవడం అవసరమే. దీనివల్ల భగవంతుని విభూతులు అవగతమై శ్రద్ధాభక్తులు పెంపొందుతాయి. కాని, మహాభారత కాలానికి పూర్వంగల పౌలిశ, రోమక, వాశిష్ఠ, సౌర, పైతామహ అనబడు పంచ సిద్ధాంతాలిప్పుడు అలభ్యాలు. విక్రమాదిత్యుని తరువాత మరల ఈ శాస్త్రాలను పునరుద్ధరించే ప్రయత్నాలు జరిగాయి. ఇప్పుడు మనకు లభించే జ్యోతిష్య గ్రంథాలలో ఆర్యభటుడు వ్రాసిన ఆర్యభటీయమే అతి ప్రాచీనమైనది. అందు గీతికా, గణిత, కాల క్రియా, గోల పాదములని నాలుగు అధ్యాయాలున్నాయి.

అందు గీతికా పాదంలో నేడు x అనగా 10, c అనగా 100, M అనగా 1000 అని వ్యవహరించినట్లే ఆ కాలంలో ఆయన 'క' అనగా '1' 'ఖ' అనగా '2', 'గ' అనగా '3' ఘ అనగా 4,... య = 30, ర =40, ల = 50 అనీ, మరియు అ=1 ఇ=100, ఉ=$100^2$ = 10,000, ఋ= $100^3$ = 10,00,000 అనీ ఈ విధంగా సంకేత భాష ఏర్పరచి శాస్త్రం వ్రాశాడు. అందులో సూర్యభ్రమణం గురించి చెబుతూ ఒక మహాయుగంలో పాలపుంత కేంద్రం చుట్టూ సూర్యుడు 'ఖ్యఘ్వ' సార్లు భ్రమణం చేస్తాడని

వ్రాశాడు. 'ఖ్యుఘ్ఋ' ను విడతీస్తే ఖ్ + య్ + ఉ + ఘ్ + ఋ అవుతుంది. దీనిని అంకెలలోకి మార్చిస్తే -

| | | | |
|---|---|---|---|
| ఖ్ + య్ + ఉ = ఖ్యు = (2+30)10,000 = | | | 3,20,000 |
| ఘ్ + ఋ | = ఘృ = 4 x 10,00,000 | | = 40,00,000 |
| | | | = 43,20,000 |
| ఖ్ = 2 | ఉ = | 10,000 | |
| య్ = 30 | ఋ = | 10,00,000 | |
| ఘ్ = 4 | | | |

ఈ విధంగా గణిత సూత్రాలు, కాలాన్ని గూర్చిన లెక్కలు ఎన్నెన్నో ప్రతిపాదించాడు. చివరి గోల పాదంలో భూ చంద్ర సూర్య నక్షత్రాదుల భ్రమణాలను గురించిన ఎన్నో అద్భుత విషయాలు తెలిపాడు. ఇవన్నీ తాను తన బుద్ధి అనే నావతో సద్ అసత్ జ్ఞాన సముద్రంలో వెతికి బయటకు తీసిన రత్నాలేనని వ్రాసుకొన్నాడు.

తదుపరి వచ్చిన వరాహ మిహిరుడు, భాస్కరాచార్యుడు ఈ జ్యోతిష్యాన్ని వివరిస్తూ ఎన్నో గ్రంథాలు వ్రాశారు. పరస్పరాకర్షణ గల గ్రహాలు ఆకాశంలో పడిపోకుండా తిరుగుతున్నాయని, సూర్య చంద్ర గ్రహణాలు ఏర్పడటానికిగల కారణాలను గురించీ నేటి విజ్ఞానానికి దీటుగా ప్రతిపాదించి లెక్కలు గట్టి నిరూపించారు. అందులో కొన్ని నేటి విజ్ఞానానికి కూడా అందని విషయాలు ఉన్నాయి. భాస్కరాచార్యుడు వ్రాసిన 'సిద్ధాంత శిరోమణి' ప్రపంచ ఖగోళ గణిత విజ్ఞానాలలో మనకు ఎనలేని కీర్తిని తీసుకువచ్చింది. భాస్కరాచార్యుడు తొమ్మిది రకాల యంత్రాలు నిర్మించాడు. అందులో ధీయంత్రం చాలా ముఖ్యమైనది. చేతిలో ఒక యిష్టిని (చేతికర్రను) పట్టుకుని దాని మూలంలోను చివరలోను దృష్టిని నిలిపి ఆ యిష్టి మీదుగా నిర్మలాకాశంలో గ్రహ, నక్షత్రాదులను చూస్తూ భూమిపై యిసుకలో (పలక వలె) లెక్కలు కడుతూ ఆ అద్భుత శాస్త్రాన్ని ఆయన వ్రాశాడు. (నేటి టెలిస్కోపులు అబ్జర్వేటరీలు అతనికి లభించి ఉంటే ఇంకెన్ని రహస్యాలు కనిపెట్టేవాడో!) దానికి ధీయంత్రమని పేరుపెట్టి దీనిని

చక్కగా ప్రయోగించగలిగిన వ్యక్తి ఆకాశంలో ఉన్నవాటినీ, భూమి మీద ఉన్నవాటినీ, నీటిలో ఉన్న వాటినీ కూడా స్పష్టంగా కనుక్కొని లెక్కలు కట్టగలడని వ్రాశాడు. తమంతట తామే తిరిగే స్వయంచాలక యంత్రాలను గూర్చి కూడ అతడు వ్రాశాడు. కర్రతో చక్రాలు చేసి దాని ఇరుసు దగ్గరా ఆకులలోను పాదరసము మొదలైనవి నింపితే అవి స్వయంగానే తిరుగుతాయంటాడు. నేటి విజ్ఞానవేత్తలు ఆ మార్గంలో పరిశోధనలు చేస్తే నేటి ఇంధన సమస్యలు, వాతావరణ కాలుష్య సమస్యలు తీరిపోతాయేమో! కాలగణనలో ఒక సెకనును 33,750 భాగాలుగా విభజించి వాటికి త్రుటులని పేరు పెట్టి అక్కడి నుండి ప్రళయాంతకాలం వరకు లెక్కించిన వారి ఘనత నేటి కంప్యూటర్లకు ఏ మాత్రం తీసిపోదు.

సూర్యకిరణాలను గూర్చిన మన ప్రాచీన ఋషుల అధ్యయనం నేటి వైజ్ఞానికుల అధ్యయనం కన్న చాలా లోతైనది. వారు సూర్యుని నుండి వెయ్యి రకాల కిరణాలు వెలువడుతున్నట్లు గుర్తించారు. అందుచేతనే సూర్యుని 'సహస్ర భాను' అన్నారు. వీరి ఈ అతీంద్రియ జ్ఞానానికి ప్రేరణ నిచ్చింది ఋగ్వేదంలోని '**యుక్తా హ్యస్య హరయః శతా దశ ( ఋ. 3=47 =8)** - (సూర్యునికి) శతాదశ అనగా 10X10= 1,000 గుర్రముల వంటి కిరణములు జోడింపబడినవి.' అనే వాక్యం. అదే విషయం ఋషి బ్రాహ్మణ గ్రంథంలో - **'సహస్రం హైత ఆదిత్యస్య రశ్మయః' ( జై. ఉప. బ్రా. 1-44-5)** ఆదిత్యుని కిరణములు వెయ్యి అన్నాడు. మహాభారతంలో వ్యాసుడు **'యస్య రశ్మి సహస్రేషు' (శాంతి 372-3)** అన్నాడు. వాయుపురాణం (53-19 నుండి 23) మరియు మత్స్య పురాణం (128 - 18 నుండి 22) లలో వెయ్యి కిరణములను గురించి విస్తృత వర్ణనలున్నాయి. వీటినే 7 భాగాలుగా విభజించి సప్తరశ్మి, సప్తాశ్వ అని వ్యవహరించారు. ఆ కిరణాలను 3 వర్గాలుగా విభజించి ఈ క్రింది విధంగా నామకరణం చేశారు.

1) వర్షాన్ని కురిపించే కిరణాలు 400 - వృష్టిసర్జనాలు

2) వేడిని పుట్టించే కిరణాలు 300- ఘర్మసర్జనాలు

3) మంచును కురిపించే కిరణాలు 300 - హిమసర్జనాలు

ఈ ఒక్కొక్క వర్గములోని కిరణములలో కూడా కొంత సూక్ష్మ భేదమున్నట్లు గుర్తించి వాటిని వంద వందగా ఉపవర్గీకరించి పేర్లు పెట్టారు.

(1) వృష్టి నుత్పన్నము చేయు వృష్టి సర్జనాల పేర్లు-

ఆనందనాః - 100 (వీటినే భంధనాః అని కూడా అంటారు.)
మేధ్యాః - 100 (బమందాః)
నూతనాః - 100 (కాతనాః)
పూతనాః - 100 (కోతనాః)
400

(2) వేడి నుత్పన్నము చేయు ఘర్మ సర్జనాల పేర్లు

రుద్రాః - 100 (శుక్రాః)
విశ్వభృతః - 100 (మాధ్వ్యాః)
కకుహాః - 100 (శక్వర్యాః)

(3) మంచు నుత్పన్నము చేయు హిమ సర్జనాల పేర్లు

మేష్యాః - 100 (రేష్యాః, చంద్రాః)
పోష్యాః - 100 (వాష్యాః, చంద్రాః)
హ్యాదిన్యాః - 100 (మేధ్యాః, చంద్రాః)

అయితే యివన్నీ సృష్టి సమతుల్యత కొరకు ఏర్పరచబడ్డాయి. ఇక ప్రాణి జాతుల జీవన నిర్వహణముల కొరకు ఉపయోగపడే ప్రధాన సూర్య కిరణముల పేర్లేమో తెలిసికొందాము. అవి 7 రకములు.

(1) సుషుమ్నః (2) హరికేశః (3) విశ్వకర్మ (4) విశ్వశ్రవాః (5) సంపద్వసుః (6) అర్వావసుః (7) స్వరాట్

వీటినే నేటి వైజ్ఞానికులు సప్త వర్ణములు (ఏడు రంగులు) అనుచున్నారు. ఆ వర్ణముల గుణములను సూచించునవే పై ఏడుపేర్లు కావచ్చును. ఏ వర్ణమునకేపేరని యిప్పుడు నిర్ణయించుట కష్టమే. అట్టిప్రాచీన సాహిత్యం విదేశీయుల ద్వేషాగ్నికి ఆహుతయ్యింది. యిప్పటికీ విడివిడిగా వెయ్యి కిరణాలకు వెయ్యి పేర్లు మన జ్యోతిష్య గ్రంథాలలో ఉన్నాయి. వాటి అర్థాలను దృష్టిలో పెట్టుకొని మనన చింతన పరిశోధనలు చేస్తే ఎన్నెన్నో ప్రాకృతిక నియమాలు వైజ్ఞానిక ఆవిష్కారాలు వెల్లడవుతాయి.

ఇక ప్రాచీన వేద వ్యాఖ్యానాలైన బ్రాహ్మణ, ఆరణ్యక నిరుక్తాదులలో సూర్యుని గురించి ఏమి వ్రాసి ఉన్నదో తెలిసికొందాము. నేను చేసిన ప్రాచీన

వైదిక సాహిత్య స్వాధ్యాయం బహు స్వల్పం. అందుచే అట్టి ప్రమాణములు వ్రాసి పంపుమని బోయినపల్లి (సికింద్రాబాద్) ఆర్ష కన్యా గురుకుల ఆచార్యులు పం.ఆనంద ప్రకాశ్‌గారిని కోరగా వారు కొన్ని వ్రాసి పంపిరి. వాటిని ఈ క్రింద ఉదహరించుచున్నారు.

**(1) ఏష వై శ్రేష్ఠో రశ్మిః యత్సూర్యః।**

**(శతపథ బ్రా 1-1-3-16)**

సూర్యునిలోగల కిరణములు చాలా శ్రేష్ఠమైనవి.

**(2) స(సూర్యః) ఏవాస్మిన్ (యజమానే) బ్రహ్మ వర్చసం దధాతి** (తైత్తరీయ సంహిత 2-3-2-3)

ఆ సూర్యుడు యజ్ఞాది సత్కర్మలు చేయు యజమానుని యందు బ్రహ్మ తేజస్సును (ఆరోగ్యముతో కూడిన తేజస్సును, బ్రహ్మచర్యాది వ్రతముల ద్వారా బొందనగు వర్చస్సును) నింపును.

**(3) సూర్యః ప్రజనయితా (కపిష్ఠల సంహిత 4-4)**

సూర్యుడే ప్రాణి జాతుల ఉత్పత్తిలో ప్రధానదేవత.

**(4) అసావాదిత్యో దేవః సవితా**

**(శత.బ్రా - 6-1-1-18)**

ఈ ఆదిత్యుడే సవితా దేవత. అనగా సమస్త ప్రాణులలో గతిని కలిగించువాడు.

**(5) సూర్యో వై ప్రజానాం చక్షుః**

**(శత.బ్రా - 13-3-8-4)**

సూర్యుడే ప్రాణులకు నేత్రము. అనగా దృక్ శక్తిని యిచ్చువాడు.

**(6) అసౌ వా ఆదిత్యః స్వర్గో లోకః**

**(శతపథ బ్రా.8-7-1-5 + మైత్రాయిణీ సం.6-1-1)**

అసౌ ఖలు వా ఆదిత్యః సువర్గో లోకః

**(తైత్తరీయ ఆరణ్యకం 5-9-11)**

ఈ ఆదిత్యుడే (సూర్యుడే) స్వర్గలోకము అనగా సుఖముల నిచ్చువాడు.

(7) అసౌ వా ఆదిత్యః ప్రాణః (తైత్తిరీయ సం. 5-2-5-4)
ఈ ఆదిత్యుడే (సూర్యుడే) ప్రాణము. అనగా ప్రాణశక్తికి కారణము.

(8) అసౌ వా ఆదిత్యః శుక్రః।
(తైత్తిరీయ సం.7-2-82 మైత్రాయిణీ సం.4-6-8)
ఈ ఆదిత్యుడే (సూర్యుడే) శుక్రము. అనగా శక్తినిచ్చువాడు మరియు పవిత్రము (రోగనాశము) చేయువాడు.

(9) అసౌ వా ఆదిత్య శ్శు చిరేష తేజసః ప్రదాతా(కాఠక సం.8-8)
ఈ సూర్యుడే దోషములను తొలగించి పవిత్రము చేసి తేజస్సును నింపువాడు.

(10) అసౌ వా ఆదిత్యః సూర్యః (శత.బ్రా. 9-4-2-23)
ఈ ఆదిత్యుడే సూర్యుడు. అనగా గతిని కలిగించువాడు.

(11) అసౌ వా ఆదిత్యో గోపః (తైత్తి.ఆ. 5-6-4)
ఈ ఆదిత్యుడే (సూర్యుడే) భూమిని రక్షించువాడు, పాలించువాడు.

(12) ఆదిత్యః చక్షుషి (ప్రతిష్ఠితః)
(శాంఖ్యాయన ఆరణ్యకము 10-1)
ఆదిత్యుడు (సూర్యుడు) నేత్రములందు ప్రతిష్ఠితుడై యున్నాడు. అనగా సూర్యశక్తివల్లనే నేత్రములు చూడగలుగుచున్నవి.

(13) ఆదిత్యో వై భర్గః (జైమినీయోపనిషద్ బ్రాహ్మణము - 4-12-2-2, గోపథ. బ్రా. 2-6-12)
ఆదిత్యుడే (సూర్యుడే) రోగ నాశకుడు.

(14) ఆదిత్యో యశః (తై.సం. 2-1-5-2; శత.బ్రా. 12-3-4-8
సూర్యుడు యశస్సు నిచ్చువాడు. అనగా కీర్తిని బొందుటకు వలయు బలారోగ్యముల నిచ్చువాడు.

(15) పర్జన్య ఆదిత్యః (తాండ్య మహాబ్రాహ్మణము 23-15-4; గో.బ్రా.1-4-3)
మేఘముల నిర్మించువాడు ఆదిత్యుడే (సూర్యుడే)

(16) విమానో హ్యసా ఆదిత్యః స్వర్గస్య లోకస్య।
(మైత్రాయణి సం.3-3-8)

ఈ సూర్యుడు స్వర్గలోకములను చేర్చు విమానము. అనగా అనేక సుఖములను బొందింపజేయు సాధనము.

(17) స వా ఏష (ఆదిత్యః) న కదాచిదస్తమేతి నోదేతి।
తం యదస్తమేతీతి మన్యంతేஉ హ్న ఏవ తదన్తమిత్వా உ
థాత్మానం విపర్యస్యతే, రాత్రి మేవా వస్తాత్ కురుతే உహః
పరస్తాత్ అథ యదేనం ప్రాతరుదే తీతి లుమన్యన్తే రాత్రే
రేవ తదన్తమిత్వాஉ థాత్మానం విపర్యస్యతేஉ హరేవా వస్తాత్
కురుతే రాత్రిం పరస్తాత్ స వా ఏష న కదాచన నిమ్రోచతి
(న కదాచిద్ ఉదేతి) (ఐతరేయ బ్రా. 3-44)

ఆ సూర్యుడు ఎప్పుడు ఉదయించడు. అస్తమించడు. ఎప్పుడు అజ్ఞానులైన మానవులు సూర్యుడుఅస్తమించుచున్నాడను కొందురో, అప్పుడు అతడు అచట దినమును ముగించుకొని తనను తాను విపరీతముగా చేసుకొనును. అనగా సూర్యుడు ఒక ప్రదేశమున దినమును (ప్రకాశమును) సమాప్తపరచి దానికి విపరీతముగా మరియొక ప్రదేశమున ఉదయించుచున్నాడని అర్థము. ఈ ప్రకారముగా అతడు అతిక్రమించు దేశమున రాత్రిని, ప్రవేశించు దేశమున దినమును చేయుచున్నాడు. ఎక్కడ ప్రాణులు సూర్యుడు ఉదయించ నున్నాడనుకొనునో అప్పుడు అతడు అతిక్రమించిన దేశమున (రాత్రిని చేసి) విపరీతము చేసికొని ఉదయించుచున్నాడు. అనగా ఒక ప్రదేశమున రాత్రిని చేసి తదుపరి ప్రదేశమును దినమును చేయుచుండునని యర్థము. అందుచే సూర్యుడు ఎప్పుడు ఉదయించడు, అస్తమించడు.

భూమి గుండ్రముగా నుండి తనలో తాను తిరుగుచు సూర్యుని చుట్టూ తిరుగుచున్నదని మనందరకు తెలిసినదే కదా! కాన వివరింప నవసరం లేదు. ఇట్టివే అనేకానేక ప్రమాణములు కలవు. తీరిక ఉండి వెతికిన వేలకు వేలు దొరుకును. ఈ విషయము నింతటితో వదలి వేద పదాలకు హేతుబద్ధంగా, వైజ్ఞానికంగా వివరించిన నిరుక్త నిఘంటువు లేమి చెప్పునో తెలిసికొందము.

# యాస్క మహర్షి దృష్టిలో సూర్యుడు

మహర్షి యాస్కుడు అతి ప్రాచీన ఋషి. ఏ కాలమునకు చెందినవాడో నిర్ణయించుట కష్టమే. కాని అతడు వ్రాసిన నిరుక్త నిఘంటువులు ఈ భూమిపై మానవజాతి ఉన్నంతవరకు వేదార్థము నెరుంగగోరు వారందరికి వెలుగు చూపుచునే యుండును. సూర్యుని గురించి తెలుసుకొనగోరు మనకు వాటి అవసరమెంతైనా ఉంది. తదుపరియే మనము వేదాలలో వర్ణించిన సూర్య గుణములను చక్కగా తెలిసికొనగలము. ముందుగా వివిధ నిఘంటువులలో సూర్యునికి వాడబడిన పర్యాయ వాచక పదములను వాటి సంక్షిప్తార్థములను తెలిసికొందము.

(1) సూరః - ఉత్పత్తి చేసి సామర్థ్యము నిచ్చువాడు.

(2) ఆదిత్యః - భూమిపైనున్న నీటిని, చంద్ర, నక్షత్రాదుల కాంతిని గ్రహించువాడు.

(3) దివాకరః - దినమును (పగటిని) చేయువాడు.

(4) బ్రధ్నః - గ్రహ, ఉపగ్రహాదులను తన ఆకర్షణ శక్తితో బంధించి ఉంచువాడు, చాలా పెద్దవాడు.

(5) భాస్వాన్ - (భాస్వత్) ప్రకాశించువాడు.

(6) సప్తాశ్వః - సప్తవర్ణములను గుర్రములు కలవాడు.

(7) సూర్యః - గతి కలవాడు.

(8) ద్వాదశాత్మా (ద్వాదశాత్మన్) 12 నెలలకు ఆత్మవంటివాడు.

(9) భాస్కరః - ప్రకాశమును కలుగజేయువాడు.

(10) ప్రభాకరః - విశేష ప్రకాశమును కలిగించువాడు
ప్రత్యేకమైన ప్రకాశమును కలిగించువాడు.

(11) హరిదశ్వః- హరణశీల కిరణములు గలవాడు.

(12) అర్యమా - (అర్యమన్)

(13) అహస్కరః - పగటిని చేయువాడు

(14) విభాకరః - విశిష్ట ప్రకాశము నిచ్చువాడు

(15) వివస్వాన్ - (వివస్వత్)

(16) ఉష్ణరశ్మిః - వేడి కిరణములు గలవాడు
(17) వికర్తనః - చీకటులను (రోగ క్రిములను) ఛేదించువాడు
(18) అర్కః - తాపమును (వేడిమిని) ఇచ్చువాడు
(19) మార్తండః - హిరణ్య గర్భము మరణించగా (పగిలిపోగా) పుట్టినవాడు
(20) పూషా (పూషన్) - పుష్టి నిచ్చువాడు
(21) తరణిః - గతిశీలుడు
(అంధకారము నుండి తరింపజేయువాడు)
(22) విరోచనః - విశేషముగా ప్రకాశించువాడు.
(23) మిహిరః - మేఘములను వర్షింపజేసి భూమిని తడుపువాడు.
(24) ద్యుమణిః (గగనమణిః, అమ్బరమణిః) ఆకాశమణి - ద్యులోకమున మణి వలె ప్రకాశించువాడు
(25) మిత్రః - ప్రాణులకు మేలుచేయువాడు.
(26) విభావసుః - ప్రకాశమే సంపదగా కలవాడు
(27) అహర్పతిః - దినమునకు పాలకుడు
(28) సహస్రాంశుః - వెయ్యి రకముల కిరణములు కలవాడు
(29) రవిః - స్తుతించ దగినవాడు
(30) ఛాయానాథః - నీడకు పతి (నీడ సూర్యునికి వెనుక పత్ని వలె అనుసరించును)
(31) జగచ్చక్షుః - అందరికి చూచు శక్తినిచ్చువాడు
(32) ప్రద్యోతనః - విశేష ప్రకాశము గలవాడు
(33) లోకబాంధవః - లోకములకు మేలు చేయువాడు
(34) ధామనిధిః - ప్రకాశ కిరణముల నిధి కలవాడు. (వేనిలో ప్రకాశము నిలిచి యుండునో దానిని ధామ మందురు.)
(35) అబ్జినీపతిః - నీటిలో పుట్టెడి కమలముల సమూహమునకు పతి
(36) అరుణః - ఎర్రనివాడు
(37) చిత్రభానుః - చిత్రమైన ప్రకాశము కలవాడు

(38) గ్రహపతిః - గ్రహములకు పతి - పాలకుడు

(39) భానుః - ప్రకాశించువాడు

(40) తపనః (తాపనః) - నిరంతరం తపించువాడు

(41) పద్మాక్షః - కమలము వంటి కన్ను గలవాడు

(42) తమిస్రహ (తమిస్రహన్) - అంధకారమును పోగొట్టువాడు

(43) లోకబన్ధు - లోకములను బంధించి కాచువాడు

(44) దినమణి - దినములో (పగటిలో) మణివలె అన్నిటికన్న ఎక్కువగా ప్రకాశించువాడు

(45) ఇనః - గతినిచ్చి మనచే గతిని కలిగించువాడు

(46) అంశుమాలీ (అంశుమాలిన్) - కిరణములు మాలగా కలవాడు

(47) విష్ణుః - కిరణములతో వ్యాపించువాడు

(48) త్విషాంపతిః - (బాణములు) సూర్య కిరణములకు పతి

(49) హంసః - హంస వంటి గతి గలిగి దుర్బల ప్రాణులను, రోగ కారక క్రిములను సంహరించువాడు

(50) సవితా (సవితృ) - ప్రేరకుడు

(51) తేజసాం రాశిః - తేజోరాశి

(52) కర్మసాక్షి (కర్మసాక్షిన్) - కర్మలకు సాక్షి

(53) త్రయీతనుః - 1. ఉష్ణము 2. వెలుతురు 3. శక్తి అను మూడు శరీరములు కలవాడు.

(54) ఖద్యోతః - ఆకాశమున ప్రకాశించు జ్యోతి

(55) భగః- మలినములను శుద్ధపరచి ఆరోగ్యము నిచ్చువాడు

ఈ పై పదము లన్నియు వేదాలలో అక్కడక్కడ సూర్యుని కొరకు వాడబడినవే. ఇందలి కొన్ని పదములకు మాత్రమే యాస్క మహర్షి తన నిరుక్తములో నిర్వచనాలు చెప్పినాడు. ఆ దృష్టితోనే మిగిలిన పదములకు కూడా నిర్వచనాల నూహించుకోవలెనని ఆయన అభిప్రాయం.

**ఆదిత్యః - ఆదిత్యః కస్మాత్ ఆదత్తే రసాన్, ఆదత్తే భాసం జ్యోతిషావ్ం ఆదీప్తో భాసేతి వా, అదితేః పుత్ర ఇతి వా (నిరుక్తము 2-4-13)**

ప్రశ్న - సూర్యునికి ఆదిత్యుడని పేరెందుకు?

ఉత్తరము - (1) సూర్యుడు ప్రతి పదార్థములోని రసమును అనగా జల ధాతువును తన కిరణముల ద్వారా గ్రహించును గాన ఆదిత్యుడని పేరు.

(2) సూర్యుడు ఉదయించి మిగిలిన చంద్ర నక్షత్రాది జ్యోతులను హరించును గాన,

(3) సూర్యుడు జ్యోతితో ప్రదీప్తుడగుచుండుట వలన

(4) సూర్యుడు అదితి యొక్క అనగా అవినాశియైన మూల ప్రకృతి మరియు పరమేశ్వరుల పుత్రుడు గాన ఆదిత్యుడని పేరు.

**(2) పూషా - 'యద్రశ్మిపోషం పుష్యతి తత్ పూషా భవతి' (నిరు 12-2-10 శబ్దే)**

ఎవడు తన కిరణములతో అన్ని ప్రాణులకు పుష్టిని కలిగించునో అతడు 'పూషా' అనబడును.

సూర్యోదయము నుండి మధ్యాహ్నము 12 గంటల వరకు (పూర్వాహ్ణకాలములో) ఉండు సూర్యునకు ఇట్టి గుణము కలదు. గాన అప్పటి 'సూర్యుడు' 'పూషా' అగును.

**(3) సవితా- 'సవితా సర్వస్య ప్రసవితా...' 'ఆదిత్యోఽపి సవితోచ్యతే (నిరు 10-3-20 శబ్దే)**

(షూ-ప్రేరణే + తృచ్ = సుతా) సర్వ ప్రేరకుడు సవిత అనబడును. సూర్యుడు కూడా సర్వప్రేరకుడగుటచే సవిత అనబడును.

**(4) భగః - 'భగో భజతేః' (నిరు 1-3-7) - విభజతి స్వాస్థ్యాదికం దదాతీతి భగః।**

అనగా ఆరోగ్య ప్రదాయకుడు గాన సూర్యుడు భగ అనబడును. అనుదిత సూర్యునికే అనగా ఉదయించక పూర్వము ఉండే సూర్యునికే (ఉదయ సంధ్యాకాలపు సూర్య ప్రకాశమునకే) భగ అని పేరు. (నిరు 12-2-8-శబ్దే)

అందుచేతనే సూర్యోదయ పూర్వపు భ్రమణ వ్యాయామాదులే ఆరోగ్య దాయక మందురు.

**విష్ణుః - 'అథ యద్ విషితో భవతి తద్ విష్ణుర్భవతి' (నిరు 12-2-19) 'విష్ణుర్విశతేర్వా, వ్యశ్నుతేర్వా'** ఎవరు అన్నిటిలో వ్యాపింతురో వారు 'విష్ణు' వనబడుదురు. పరమేశ్వరుడు సర్వవ్యాపకుడు గాన అతడు విష్ణువు. అట్లే మధ్యాహ్నకాలీన సూర్యుడు కూడా భౌతిక పదార్థము లన్నిటిలో తన కిరణములను వ్యాపింప జేయునుగాన సూర్యుడు విష్ణువని చెప్పబడినది.

ఉణాది కోశములో సూర్యునకు 50 శబ్దములు (పేర్లు) నిర్దేశింపబడినవి. అందు పై శబ్దముల వలెనే కొన్ని గలవు. మరికొన్నిటి నిర్వచనములు ఈ క్రింది విధముగా నున్నవి.

**మిహిరః - మిహ సేచనే + కిరచ్ (ఉణాదికోశము 1-51) యో మేహయతి సేచయతి పృథివీం మేఘజలేన స మిహిరః సూర్యో వా'** - మేఘజలముతో ఈ పృథివిని తడుపుచుండును గాన సూర్యునకు మిహిరుడని పేరు.

**అర్యమా - అర్యం - వైశ్యం, కృషకం మిమీతే మానయతి మానయోగ్యం కరోతి స సూర్యో అర్యమా**

(అర్య + మాఙ్ మానే + కనిన్) (ఉణా. 1/159)

అర్యులను (వైశ్యులను - కృషకులను) ధన ధాన్యములతో వృద్ధిపరచి వారికి మాన్యతను కలిగించునుగాన సూర్యుడు అర్యముడు. అనగా సూర్య కిరణములే వర్షములకు, పంటలకు కూడా కారణమగుటచే సూర్యుని అర్యము డందురు.

**సూరః - షూఙ్ ప్రాణి ప్రసవే + క్రన్ (ఉణా 2.25) సూయతే సువతి ప్రాణినః సమర్థయతీతి సూరః సూర్యో వా)**

ప్రాణులను ఉత్పన్నము చేసి సమర్థులను చేయునుగాన సూర్యునకు సూరః అని పేరు.

**ఇనః - ఇణ్ + నక్ (ఉణా 3-2) ఏతీతి ఇనః సూర్యో హి** - తాను గతిని కలిగియుండి మనలో గతిని కలిగించును. గాన సూర్యునకు ఇను డని పేరు.

భానుః - భా దీప్తౌ +ను (ఉణా 3-32) భాతి దీప్యతేఽ సౌ భానుః సూర్యః - ప్రకాశముచే వెలుగొందుచుండును గాన సూర్యునకు భాను డని పేరు.

హంస - హన్, హింసాగత్యోః + స (ఉణా 3-62)

'హన్తీతి హంసః. - తన ప్రచండ కిరణములతో సూక్ష్మ కీటాణువులను, దుర్బల ప్రాణులను సంహరించును. గాన సూర్యునకు హంస యని పేరు. మరియు హంస వలె గతి గలిగి యుండును గాన హంస.

రవిః - రు శబ్దే + ఇ (ఉణా 4-140)

'రూయతే స్తూయతే ఇతి రవిః సూర్యః' స్తుతించ దగినవాడు గాన సూర్యుడు రవి.

మఘవా - మహ పూజాయామ్ + కనిన్ (ఉణా 1/159) 'మహ్యతే పూజ్యతేఽ సౌ మఘవా సూర్యః' - పూజింపతగినవాడు అనగా సేవించి లాభము బొందతగినవాడు గాన సూర్యునకు మఘవ అని పేరు.

పీతుః - పా-పానే, పా-రక్షణే+తున్ (ఉణా 1-71) 'పిబత్యుదకాదికం, పాతి ప్రాణినో రక్షతి వా స పీతుః సూర్యః' జలాది రసములను పానము చేయుట చేతను, ప్రాణులను రక్షించు చుండుట చేతను సూర్యుని పీతు వందురు.

ఉషపః - ఉష - దాహే + కపన్ (ఉణా. 3/142)

'ఓషతి దహతి పదార్థాన్ స ఉషపః' - పదార్థములను ఉష్ణము చేయుట చేతను, దహించుట చేతను సూర్యునకు ఉషప యని పేరు.

పచేలిమః - డుపచష్ - పాకే+ఏలిమచ్ (ఉణా 4-37) 'పచతి పదార్థాన్ ఇతి పచేలిమః సూర్యః' - పదార్థములను పచనము (పక్వము) చేయును గాన సూర్యునకు పచేలిమ అని పేరు.

నిరుక్త, స్కంద, దుర్గాచార్య మరియు దేవరాజ యజ్వాగార్ల నిర్వచనముల ప్రకారం సూర్యుడు ఉదయించినది మొదలు అస్తమించు వరకు ఉండు ఆయా కాలములకు ఈ విధముగా పేర్లు కలుగును.

ఉషా - సూర్యోదయ పూర్వ ప్రభాత సమయము

భగ - ఉషస్సుల తదుపరి కాలము

సూర్యా - ఉదయకాలపు సూర్య ప్రకాశము
సూర్య - ఉదయించిన సూర్యుడు
పూషా - మధ్యాహ్న పూర్వపు సమయము ( ఉదయము)
విష్ణుః - మధ్యాహ్న కాలమందలి ఆదిత్యుడు
వరుణ - మధ్యాహ్నముకన్న ముందు ఉండు కాలము
కేశీ - వరుణ కాలపు తదుపరి సమయము
విశ్వానర - మధ్యాహ్న తదుపరి కాలము
వృషా కపి - అస్తమించు సూర్యునికన్న పూర్వపు కాలము
వృషాకపాయీ - వృషాకపి యొక్క ప్రకాశము
వివస్వాన్ - వృషాకపి యొక్క తదుపరి కాలము
అజ ఏకపాద్ - అస్తమించుచున్న సూర్యుడు
త్వష్టా - అస్తమించిన తదుపరి సూర్యుడు (సంధ్య వెలుగు)
సరణ్యూ - అర్ధరాత్రి వరకు ఉండు కాలము
యమ - అర్ధరాత్రి వరకు ఉండు చీకటి
యమీ - సరణ్యూ వలన కలిగిన నీరవతా
ఛాయా - అర్ధరాత్రి తరువాతి కాలము
ఆదిత్య - ఉషా యొక్క ఉత్పత్తి కన్న ముందు ఉండు కాలము

ఈ పై సంజ్ఞలన్నియు సూర్యుని యొక్క నియమపూర్వక గతివల్ల కలుగుచుండును. కాలము సూర్యగమనమును బట్టే ఏర్పడును. సూర్యుడు లేకున్న కాలవిభజన ఉండదు, కాలము ఉండదు. ఆయా కాలములకు పెట్టబడిన పేర్లు ఆయా కాలములలో సూర్యుని వల్ల ప్రాణులకు కలిగే లాభాలను, ప్రభావమును వ్యక్తము చేయుచుండ వచ్చును. పరిశోధించవలసి యున్నది.

పై సంజ్ఞా వివరణ 'వేదవాణీ' వేద పరిశీలనా విశేషాంకము (కార్తీక - 2053 (నవంబర్ 1996) లో సుశ్రీ సూర్యాకుమారీ వ్యాకరణాచార్య పాణినీ కన్యా మహా విద్యాలయం గారి వ్యాసం నుండి గ్రహింపబడినది. పుట సంఖ్య - 128.

# దయానంద మహర్షి దృష్టిలో సూర్యుడు

ద్వాపర యుగాంతమునగల వ్యాస జైమిని ఋషుల తదుపరి ఋషిగా లెక్కించదగినవాడు మహర్షి దయానందుడు. ఏలయన దయానందునికి పూర్వము శంకర రామానుజాది విద్వాంసులు, ఆచార్యులు పెక్కురున్నను వారందరు ఆచార్యులే కాని ఋషులు కారు. ఎందుచేత ననగా 'ఋషయో మంత్రద్రష్టారః' సమాధిస్థులై వేదమంత్రార్థ ద్రష్టలైనవారినే ఋషు లనవలయు నని ప్రాచీనుల అభిప్రాయం. దయానందుడు వేదముల నామూలాగ్రం అధ్యయనమొనర్చి, మనన చింతనాదులు చేసి పూర్తి వేదార్థము నెరిగిన మహా విద్వాంసుడు. తాపసిక జీవితమును గడుపుచు యోగసాధన చేసి పరమాత్మ సాక్షాత్కారము నొందిన పరమయోగి. సమాధినిష్ఠుడై వేదముల సత్యార్థమును సాక్షాత్కరించుకున్న ఋషీంద్రుడు. కాన, అతడు ఈ కలియుగమున ప్రథమ మహర్షియని చెప్పవచ్చు. ఆనాడు వేదము పేరుతో లోక ప్రచలితమై యున్న అనేక వేద విరుద్ధ సిద్ధాంతములను నిర్భయముగా ఖండించుచు హరిద్వార్ కుంభమేలాలో 'పాఖండ ఖండినీ' పతాకము నెగురవేసిన ధీరాగ్రేసరుడు. ఎందరు పౌరాణిక పండితులు ఎదురొడ్డి నిలిచినను, దూషణ ఛీత్కారాదులు చేసినను నిండు కుండ వలె తొణకక బెణకక అత్యంత సహనముతో శాస్త్రార్థము చేసి విజయము నొందిన శాస్త్రార్థ మహారథి. దేశ పారతంత్ర్యదుఃస్థితికి వగచి వగచి విలపించి తన వంతు కృషిగా జాతిని జాగృత మొనర్చుచు విషమొసగిన విషదాతకు ధనదానము ప్రాణ దానము చేసి సమాధి యోగముచే శరీరము నుండి ఆత్మను విడదీసిన దయామూర్తి దయానందుడు. అట్టి మహర్షి సూర్యునిగూర్చి ఏమి చెప్పెనో తెలిసికొందము రండు.

**దయానందుని కాలం** (వి.సం.1881-1940 క్రీ. సం. 1824-1883) నాటికి సూర్యుని గురించి రకరకాల కథలు ప్రచారంలో ఉండేవి. మన భూమికి, మిగిలిన గ్రహ ఉపగ్రహాదులకు ఆధారముగా నున్న సూర్యుని విస్మరించి ఈ భూమి ఎద్దుకొమ్ముపై నున్నదని ముసల్మానులు, ఆదిశేషునిపై నున్నదని పౌరాణికులు నమ్మేవారు. దేనిమీదా లేదు గాలిలో తేలియాడు చున్నదని కొందరు, ఏ ఆధారము లేక కిందికి పడిపోవుచున్నదని మరికొందరు నమ్మేవారు. మహర్షి దయానందుడు తన అనుపమ కృతియైన సత్యార్థ ప్రకాశం (8వ సముల్లాసం) లో వీటన్నిటినీ యుక్తిపూర్వకంగా పశ్నించుచు చాలా చక్కటి సమాధానము లిచ్చెను.

భూమి ఎద్దు కొమ్ముపైనున్న ఆ ఎద్దు దేనిపై నున్నది? ఆ ఎద్దుకు జన్మనిచ్చిన గోవృషభవులు దేనిపై నున్నవి? ఆదిశేషుడు పాల సముద్రముపైనున్న పాల సముద్రము దేనిపై నున్నది? అని ప్రశ్నించి ఈ విధముగా సమాధానపరచెను. **'ఉక్షా దాధార పృథివీ (ఋ 10-31-8)** ఉక్షను యొక్క ఆధారముపై పృథివి ఉన్నదని వేదం చెబుతుంది. లోకంలో ఎద్దునకు ఉక్షా యని పేరున్నది. కాని, ఉక్షా పదము యొక్క మూలార్థమును తీసుకొనిన (ఉక్ష-సేచనే) తడుపునది యని అర్థము వచ్చును. తన ప్రచండ కిరణములతో సముద్రాదులందలి జలమును ఆవిరిగా - మేఘములుగా నిర్మించి, భూమిపై వర్షింపజేయును గాన సూర్యునకు ఉక్షాయను పేరు. కావున సూర్యుని ఆధారముపై (ఆకర్షణ శక్తి వలన) భూమి ఆకాశమున నిలబడి యున్నదని చెప్పుటయే సరియైన అర్థమని వివరించెను. **'శేషాధారా పృథివీ'** అను రెండవ యభిప్రాయమునకు సమాధానముగా - ''శేషుడు అనగా శేషించి (మిగిలి) ఉండువాడని అర్థము. పూర్ణుడైన పరమేశ్వరుడే ఈ ఉత్పత్తి ప్రళయముల నుండి శేషించి వేరుగా నుండును. కాన శేషు డనగా సర్వవ్యాపక సర్వేశ్వరుడే. మన శాస్త్రాలలో ఒక్కొక్క కుటుంబాన్ని ఒక్కొక్క బ్రహ్మాండంగా పేర్కొన్నారు. ఇట్టి సూర్య కుటుంబాలు ఈ విశ్వంలో (సృష్టిలో) అసంఖ్యాకములు. అనగా మానవ మాత్రులమైన మన బుద్ధికి, లెక్కకు అందనివి. అవి అసంఖ్యాకములైనా సాంతమేగాని అనంతము కాదు. ఏలయన ఆకారము గలది ఎప్పటికిని అనంతము కాదు. కాన గ్రహ ఉపగ్రహములకు సూర్యులు ఆధారమైనా ఆ సూర్యులకు ఆధారము మరొక బృహత్ పదార్థము అనివార్యం. ఆ బృహత్ పదార్థమే అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుడైన శేషుడు - పరమేశ్వరుడు'' అని తేటపరచెను. వేద మంత్రాల ఆధారంగా సూర్యచంద్ర గ్రహ నక్షత్రాదుల భ్రమణాదులను వివరించి చెప్పెను.

సూర్యుడు కూడా భ్రమణము చేయుచున్నాడని చెప్పుచు - ''సూర్యుడు స్థిరముగా నున్నాడని చెప్పువారు కూడా జ్యోతిర్విద్యావిదులు కారు. ఏలన సూర్యుడు తిరుగడేని ఆకాశములో నుండలేడు. ఇంతేగాదు బరువైన పదార్థమేదియు ఆకాశములో తిరుగకుండ నిలబడి ఉండజాలదు. పృథివి తిరుగక క్రింది క్రిందికి పోవుచున్నదనియు, కేవలము జంబూ ద్వీపము నందు ఇద్దరు సూర్యులు ఇద్దరు చంద్రులు ఉన్నారనియు చెప్పు జైనులు

పూర్తిగా మైకములో మునిగి యున్నారని మన కళ్ళు తెరిపించెను.

తదుపరి దయానందుడు తన 'ఋగ్వేదాది భాష్య భూమిక'లో వేద మంత్రాల ఆధారంగా సృష్టి రచనా క్రమాన్ని పృథివ్యాది లోకముల భ్రమణాన్ని, గురుత్వాకర్షణ ప్రకాశాప్రకాశక (రాత్రింబవళ్ళు ఏర్పడే) విషయాలనీ వివరంగా విశదీకరించారు. అవి అన్నీ నేటి విజ్ఞానానికి దీటుగా ఉన్నాయి.

ఒకప్పుడు మన దేశంలో విచ్చలవిడి వ్యభిచారాదులతో కూడిన రుద్ర యామలాది తంత్ర గ్రంథాల ప్రాబల్యం ఎక్కువగా ఉండేది. అప్పుడు కొందరు ధూర్తులు అట్టి గాథలతోనే కొన్ని కల్పిత గాథలు వ్రాసి పురాణాల పేరుతో ప్రచారం చేశారు. అవి తమ పేరుతో వ్రాసుకున్న ప్రజలు అంగీకరించరని వాటన్నిటినీ వేదవ్యాసులే వ్రాసారని కపట ప్రచారం చేశారు. అందులో ముఖ్యంగా బ్రహ్మవైవర్త భాగవతాది పురాణాలు, సూర్యగాథాది ఉపపురాణాలు ఇట్టి కోవకు చెందినవే.

ఇంతేగాక ఈ కథలన్నీ వేదమూలకాలే యని కూడ ప్రచారం చేశారు. కాని అవి సత్యము కావు. వేదాలలో రూపకాలంకారములోగల కథలన్నీ సృష్టి రహస్య బోధకాలే కాని చరిత్రలు కావు. **'పితా దుహితు ర్గర్భమాదాత్ - (ఋ 1-164-33) 'పితా యత్ర దుహితుః సేక మృఞ్జన్త్సం- (ఋ. 3-31-1)** మొదలగు రూపకాలంకార వర్ణన లక్కడక్కడ కనబడును. వీటి అర్థం - 'తండ్రి తన కుమార్తెకు గర్భము చేసె' నని కాదు. ద్యుస్థాన మనగా సూర్యుడు. అతనికి ఈ భూమి కుమార్తె వంటిది. అట్టి పుత్రికయైన భూమిపై సూర్యుడు వర్షములు కురిపించి వృక్ష లతాది సంతానముల నుత్పన్నము చేయుచున్నాడని అర్థం.

బ్రాహ్మణ ఆరణ్యకాది గ్రంథాలలో కూడా యిట్టి రూపకాలంకార వర్ణనలు కలవు. 'దేవతల రాజైన యింద్రుడు గౌతమ మహర్షి భార్యయైన అహల్యతో జారత్వము నెరిపె' నను కథ లోకములో ప్రచారములో కలదు. దీనికి ఆధారముగా శతపథ బ్రాహ్మణము (3-3-4-18) లోగల -**'ఇంద్రా గచ్ఛేతి... గౌరవ స్కన్దిన్న హల్యాయై జారేతి'** అను వాక్యములను చూపింతురు. కాని యిది సత్యము కాదు. ఈ మంత్రమును దయానందుడు సూర్యపరంగా ఎంత చక్కగా వివరించి చెప్పెనో చూడుడు - 'దివ్యగుణ సంపన్నుడగుటచే సూర్యునకే ఇంద్రుడని పేరు. అట్లే, అత్యంత వేగముగా

భూమి చుట్టూ తిరుగుచుండును గాన చంద్రునకు గౌతముడని పేరు. దినమును (పగటిని) తనలో లయము చేసుకొనును గాన రాత్రికి అహల్య యని పేరు. గౌతముడు (చంద్రుడు) తన భార్యయైన అహల్యతో (రాత్రితో) కూడి ప్రాణులకు ఆనందము నిచ్చుచుండును. అట్టి స్థితిని ప్రభాత సమయమున ఇంద్రుడు (సూర్యుడు) వచ్చి భంగపరుచును - చెరచును. దీనినే జారకర్మగా రూపకాలంకారములో ఋషులు వర్ణించిరి. వైదిక శబ్దార్థములను సరిగా అర్థం చేసుకోలేని మూఢులు ఇట్టి కపోల కల్పిత గాథలు వ్రాసి ఋషుల జీవితాలను కలంకితము చేసిరి. అని మిక్కిలి విచారించెను.

ఖగోళ విజ్ఞానమెంతగానో వికసించిన నేటి వైజ్ఞానిక యుగమున గూడ పంచాంగము లన్నిటిలో గణితముతో కూడిన తిథి వార నక్షత్రాదులతో పాటు రాహుకాల వర్జ్యాదుల లెక్కలు కూడా వ్రాయుచుండుట శోచనీయము. పెద్ద పంచాంగములలో రాశి ఫలాలు, గ్రహ ఫలాలు, ఆదాయ వ్యయాలు, సమ్మాన నిందాదులు, గ్రహశాంతులు మొదలగు ఎన్నో అవైజ్ఞానిక విషయాలు వ్రాయబడుచున్నవి. కొన్ని దిన, వార పత్రికలలో కూడా ఇవి కనబడును. ఇక 150 సంవత్సరాలకు పూర్వం దయానందుని కాలం నాటికి ఈ అజ్ఞానం ఎంతగా ఉండేదో మీరే ఊహించుడు. దయానందుడు తన సత్యార్థ ప్రకాశంలో ఈ అవైదిక నమ్మకాలన్నిటినీ సప్రమాణంగా ఖండించి చక్కటి వైజ్ఞానిక అర్థాలు చెప్పినాడు. ఇవన్నీ వేదాలలో కాని ఋషులు వ్రాసిన ప్రాచీన గ్రంథాలలో కాని లేనే లేవని కావాలంటే శాస్త్రార్థం చేసి నిరూపించండి అని సవాలు చేసాడు.

పుట్టిన తిథి నక్షత్రాలతో వ్రాయించే జన్మ పత్రికలను దయానందుడు శోక పత్రిక లన్నాడు. దానికి కారణం చెబుతూ జడ గ్రహాలకు అగ్రహానుగ్రహాలెందుకుంటాయి? అని ప్రశ్నించారు. పౌరాణికులు చెప్పే నవగ్రహాలలో అసలు గ్రహాలు అయిదే. సూర్యుడు గ్రహం కాదు. దానిచే ఆకర్షింపబడుచు, ఉష్ణ ప్రకాశములను శక్తిని గ్రహించుచు దాని చుట్టూ తిరుగు వాటినే గ్రహము లనాలి. చంద్రుడు ఉపగ్రహమే కాని గ్రహము కాదు. ఇతర గ్రహాల చుట్టూ తిరిగే అటువంటి ఉపగ్రహాలు మన సూర్య కుటుంబంలో ఉన్నాయి. ఇక రాహుకేతువులు గ్రహాలు కావు. ఉపగ్రహాలు కూడ కావు. అవి సూర్య ప్రకాశమునకు అడ్డంకులు. నీడ మాత్రమే. సుఖదుఃఖాలు మన పుణ్యాపాప కర్మలవల్ల కలుగుతాయే కాని గ్రహాల అగ్రహానుగ్రహాలవల్ల కాదు అని వివరించి చెప్పినారు. నవ గ్రహాల శాంతి కోసం జపించే వేద మంత్రాలకు ఎంతో చక్కటి

వైజ్ఞానిక వ్యాఖ్యానం చేశారు. మన సూర్య విషయం విజ్ఞానం కనుక సూర్యుని శాంతికై జపించే వేద మంత్రానికి మాత్రం యిచ్చట వైజ్ఞానిక అర్థం వ్రాయబడుతోంది. మిగిలిన వాటికి దయానందుల వారి వేద భాష్యంలో చూడగోరెదను.

**ఆకృష్ణేన రజసా వర్తమానో నివేశయన్నమృతంమర్త్యం చ।**
**హిరణ్యయేన సవితా రథేనా దేవో యాతి భువనాని పశ్యన్ ॥**

**ఋ. 1-35-2; యజు. 33-43; 34-31**

**దేవసవితః** = ప్రకాశస్వరూపుడు మరియు రమణీయ స్వరూపుడునైన సూర్యుడు

**ఆ కృష్ణేన రజసా వర్తమానః** = తన ఆకర్షణ శక్తితో లోకములను (గ్రహ ఉపగ్రహములను) చక్కగా ఆకర్షించి వాటి వాటి స్థానములలో భ్రమణము చేయించుచున్నాడు.

**నివేశయన్నమృతం మర్త్యం చ** = ప్రళయకాలం వరకు నశించని పంచ భూతాదులను మరియు జనన మరణ శీలమైన ప్రాణికోటులను సువ్యవస్థితము చేయుచున్నాడు.

**హిరణ్యయేన రథేనా యాతి భువనాని పశ్యన్**= జ్యోతిర్మయ రథము నధిరోహించి ప్రాణులకు దృక్శక్తి నిచ్చి లోకములను చూపుటకై పయనించుచున్నాడు. నియమముగా ఉదయించుచు అస్తమించుచు తిరుగుచున్నాడు.

ఈ మంత్రంలోని **'రజః'** అను పదము **'లోకాః రజాం స్యుచ్యంతే'** అనే నిరుక్త ప్రమాణమును బట్టి గ్రహ ఉపగ్రహాదులైన లోకాలకు వర్తించును. 'రథ' అనే పదానికి చాలా అర్థాలున్నవి. అందు ఒకటి తేజస్సు అనే రథముపై రమణము చేయుచున్న సూర్యుడని అర్థము. ఈ మంత్రమునకే ఆధ్యాత్మిక అర్థంలో సవిత పదమునకు పరమేశ్వరుడని అర్థమగును. అప్పుడు రథమనగా ఆనందము, జ్ఞాన తేజస్సు అని అర్థమగును. సూర్యుని ఆకర్షణ వల్ల గ్రహము లన్నియు ఇటు అటు పోక ఆకాశములో తిరుగుచున్నవి. యథార్థముగా వాటి నా విధముగా నిర్మించి అన్నిటిని (సూర్యుని కూడ) ఆకర్షించి నిలుపువాడు పరమేశ్వరుడే. కాన పరమేశ్వరునిలో విశ్వాన్నంతటిని ఆకర్షించగల అనంత ఆకర్షణ శక్తి యున్నదని వివరించెను.

# సృష్టికర్త (వేదాల) దృష్టిలో సూర్యుడు

సృష్టికర్త భౌతిక సృష్టిని గురించి మనం ముందే తెలుసుకున్నాం. ఇచట ప్రాణి సృష్టిని గురించి కొంత తెలుసుకుందాం. ప్రళయకాలంలో మూర్ఛితావస్థలో తనలో ఒక మూల పడి ఉన్న జీవుల కల్యాణార్థం పరమేశ్వరుడు ప్రాణి సృష్టిని చేశాడు. వారు పూర్వజన్మలలో చేసిన కర్మలు చిత్ర విచిత్రములైనవి కాన చిత్ర విచిత్ర ప్రాణికోటులను సృష్టించవలసి వచ్చింది. వాటికి సుఖ సాధనాలైన యింద్రియాలను, అనుసంధానకమైన మనస్సును నిర్మించి యిచ్చాడు. అందు సర్వోత్తమ ప్రాణిగా మానవుని సృష్టించాడు. మానవ ప్రాణిలో వికసించిన యింద్రియాలు, విశిష్టమైన మనస్సు, అన్నిటినీ మించి జ్ఞాన గ్రహణ సామర్థ్యంగల బుద్ధీ ఉన్నాయి. ఇంద్రియాలు శరీరం వెలుపల ఉంటే మనో బుద్ధులు శరీరం లోపల ఉన్నాయి. అందుచే వాటిని అంతరింద్రియము లంటారు. అవి రెండు వేరు కావు. ఒకటే. అవి చేసే పనులను బట్టి ఆ పేర్లు పెట్టారు.

పరమేశ్వరుడు ఇంద్రియాలకు విషయాలుగా ఈ ప్రపంచంలో శబ్దస్పర్శ రూప రస గంధాలను సృజించి యిచ్చినట్లే అంతరింద్రియమైన బుద్ధికి విషయంగా జ్ఞానాన్ని ఋషుల ద్వారా అందజేసినాడు. ఆ ఈశ్వరీయమైన జ్ఞానమే వేదం. గురుశిష్య పరంపరగా సృష్ట్యాది నుండి నేటి వరకు అది నిలిచి ఉంది. కంఠస్థము చేసి యుండుటచే విదేశీయులు దానిని ధ్వంసం చేయలేక పోయారు.

సామాన్యంగా జ్ఞానం ఒకరి నుండి ఒకరికి లభించవలసిందేకాని ఆహారం ద్వారాను లేదా మరే ప్రకృతి పదార్థాల ద్వారాను లభించేది కాదు. దీనినే **'అగ్నినా అగ్నిః సమిధ్యతే'** (ఋ. 1-12-6) ఒక దీపం నుండి మరొక దీపం వెలిగింపబడినట్లు జ్ఞానజ్యోతి లభిస్తుందని వేదం చెబుతుంది. ఎవరెవరి ద్వారా ఈ జ్ఞానజ్యోతి లభిస్తుందో కూడా మన ఋషులు తెలిపారు. **'మాతృవాన్ పితృవాన్ ఆచార్యవాన్ పురుషో వేద'** (**శతపథ బ్రాహ్మణం 14-6-10-2; ఛాందో. ఉ 6-14-2**) తల్లి వల్ల తండ్రివల్ల ఆచార్యుల (గురువుల) వల్ల మానవుడు జ్ఞానవంతు డవుతాడని దీని భావం. లభించిన ఆ జ్ఞానాన్ని మనన చింతన ధ్యానముల ద్వారా మనం వృద్ధి చేసుకోవచ్చు. మన అనుభవాలతో కలిపి ముందు తరాలకి

అందివ్వవచ్చు. అయితే ప్రథమ మానవ సృష్టి ఆరంభ సమయంలో తల్లి తండ్రి ఆచార్యులు ఎవ్వరూ ఉండరు. పరమేశ్వరుడు అనేక మంది స్త్రీ పురుషులను ఒకేసారి యువావస్థలో జన్మింపజేస్తాడు. కనుక సృష్టికర్తయే వారికి జీవన నిర్వహణ కవసరమైన సామాన్య జ్ఞానం యిచ్చి ఉంటాడు. అందులో పూర్వ జన్మలలో సాధన చేసి యోగ్యతను బొందిన నలుగురు ఋషుల హృదయాలలో (బుద్ధులలో) విశేష జ్ఞానమైన వేదజ్ఞానాన్ని ప్రకాశపరుస్తాడు. దానితో వారు జ్ఞానవంతులై తోటి మానవులకు దానిని అందజేస్తారు. జ్ఞాన ప్రధానమైన ఋగ్వేదాన్ని అగ్నిఋషికి, కర్మ ప్రధానమైన యజుర్వేదాన్ని వాయు ఋషికి, ఉపాసనా ప్రధానమైన సామవేదాన్ని - ఆదిత్య ఋషికి, విజ్ఞాన ప్రధానమైన అథర్వ వేదాన్ని అంగిర ఋషికి సర్వవ్యాపక, సర్వేశ్వరుడే అంతర్యామిగా నుండి ఉపదేశించినట్లు మన శాస్త్రాలు చెబుతాయి.

పరమేశ్వరుడు తన బిడ్డల వంటి మానవులకు కావలసిన సమస్త సృష్టి విజ్ఞానాన్ని, ఏ కర్మల ద్వారా మానవులకు అభ్యుదయ నిఃశ్రేయసాలు కలుగుతాయో అట్టి సామాజిక ఆధ్యాత్మిక జ్ఞానాలనీ వేదం ద్వారా యిచ్చాడు. నేడు లోకంలో మనం చూసే సమస్త సత్య విద్యా విజ్ఞానాలకు వేదమే మూలం - బీజం. అసత్య విద్యా విజ్ఞానాలకు కూడా వేదమే మూలం అనుకోవడం పొరబాటు. అవి స్వార్థం నుండి, అజ్ఞానం నుండి పుట్టినవి మాత్రమే. అవి కొంతకాలం మాత్రమే రాజ్యమేలుతాయి. కలకాలం ఉండలేవు.

అయితే ఆ వేదజ్ఞానం బీజరూపంలో ఉంటుంది. దాని గురించి ఆలోచిస్తూ పరిశోధనలు జరిపితే ఆ బీజాలే మహావృక్షాలై కోట్లాదిమందికి సుఖశాంతుల నిస్తాయి. మన ప్రాచీన ఋషులు అట్టి ప్రయత్న, పరిశోధనలు చేసి అద్భుతమైన శాస్త్రాలు రూపొందించారు. అట్టి వారిలో మను మహర్షి మొదలు వ్యాస జైమినుల వరకు ప్రపంచ గురువులై వెలుగొందారు. ఆ జ్ఞానం ఆధారంతో రాజన్యులు ఏకచ్ఛత్రాధిపత్యంగా ప్రపంచాన్ని ఏలగలిగారు. వైశ్యులు ధన కనక వస్తు వాహనాది సిరి సంపదలతో మన దేశాన్ని బంగారు భూమి చేసారు. వారందరు ఈ అభ్యుదయాని కంతకీ వేద జ్ఞానమే మూలమని కృతజ్ఞతతో వేనోళ్ళ కీర్తించారు. ఆ తదుపరి కూడ వేదమార్గాన్ని అనుసరించే ఆర్యభట్ట, వరాహ మిహిర, భాస్కరాది ఆచార్యులు అద్భుతమైన ఖగోళ గణిత విజ్ఞాన గ్రంథాలు వ్రాసి నేటికీ జగద్విఖ్యాతిని బొందుచున్నారు.

అట్టి మహత్త్వపూర్ణమైన '**దేవస్య కావ్యం**' - వేదం మన సూర్యుని గురించి ఏమి చెబుతుందో తెలుసుకుందాము రండు.

నాలుగు వేదాలలో సూర్యుని గురించి చెప్పే వేద మంత్రాలు వందలు దాటి వేల సంఖ్యలో ఉంటాయి. పూర్తిగా సూర్యుని గురించే చెప్పే సూక్తాలకు సూక్తాలే కొన్ని ఉన్నాయి. అన్నీ యిచ్చట వ్రాయడం అసాధ్యమే. అందు వుచ్చుకు కొన్ని మంత్రాలు వాటి అర్థాలు మాత్రమే వ్రాయడానికి ప్రయత్నిస్తాను. ఇది విజ్ఞాన విషయం కనుక అధిదైవికార్థమే అనగా భౌతిక విజ్ఞానానికి చెందిన అర్థమే వ్రాయబడుతోంది. ఈ మంత్రాలకే ఆధ్యాత్మికంగా, ఆధిభౌతికంగా, యజ్ఞపరంగా, సామాజిక రాజనైతిక పరంగా కూడా అర్థాలు ఉంటాయని మరువరాదు.

ముందుగా మనం ఋగ్వేదంలోని ఒక సూర్య సూక్తానికి అర్థం తెలుసుకొందాము. ప్రతి వేద మంత్రానికి ఋషి, దేవత, ఛందస్సు, స్వరము అని నాలుగు విషయాలుంటాయి. ముఖ్యంగా అర్థం చెప్పుకునేటప్పుడు దేవత విషయం తెలిసి ఉండాలి. దేవత అంటే మంత్రంలో ఉపదేశింపబడిన విషయం. (**subject**) ఈ మంత్రాలకు సూర్యుడు దేవత గాన సూర్యపరంగా అర్థం చెప్పుకోవాలి. సూర్య పదం 'సృ-గతౌ' అను ధాతువుతోను మరియు 'షూ-ప్రేరణే' అను ధాతువుతోను కూడా నిర్మింపబడవచ్చు. ధాతువంటే మూల సంస్కృత పదమని అర్థం. మూలార్థాన్నిబట్టి సూర్యుడు అనగా గతి కలవాడు. ప్రేరణ కలిగించేవాడు అని అర్థం. గతికి(**గతేస్త్రయోర్థాః - జ్ఞానం గమనం ప్రాప్తిశ్చేతి**) 3 అర్థాలుంటాయంటారు. అవి జ్ఞానం, గమనం, ప్రాప్తి. అందుకే జ్ఞానం కలిగిన, గమనం కలిగిన, ప్రాప్తింపదగిన, ప్రేరణ కలిగించగల పదార్థాలను సూర్యుడు అనవచ్చు.

పై ధాత్వర్థాలను బట్టి సూర్య పదం ఆధ్యాత్మికార్థంలో పూర్ణజ్ఞానంగల యోగ మార్గాన గమించి పొందదగిన, అంతర్యామియై మనను సత్కర్మలలో ప్రేరేపించు పరమేశ్వరునకు వర్తిస్తుంది. ఆధిభౌతికార్థంలో జ్ఞానవంతులైన విద్వాంసులకు, యోగులకు, రాజులకు అన్వయిస్తుంది.

ఇక ఆధి దైవికార్థంలో అనగా దివ్య గుణములుగల జడ దేవతలలో మన సూర్యునకు వర్తిస్తుంది. అందుచేతనే ఋషులు భౌతిక సూర్యపరంగా - '**అంతరిక్షే సరతి, లోకం కర్మాణి సువతి ప్రేరయతి వా సూర్యః**' అని నిర్వచించారు. అనగా ఆకాశంలో సూర్యుడు ఎగ(బ్రాకుచూ

పోవుచున్నట్లుగా కనబడుటచేతను, సూర్యోదయంతో ప్రాణులు ప్రేరేపింపబడి వాని వాని కర్మలలో ప్రవృత్తులగుట చేతను సూర్యుడని పేరు. మరొక నిర్వచన మేమనగా - **'అథవా స్వీర్యతే (త్రితేన) వాయునేతి సూర్యః'** అనగా త్రిత నామక వాయువుల ద్వారా సూర్య కిరణములు ప్రసరించి లోకములను (గ్రహ ఉపగ్రహాదులను) ప్రేరేపించును గాన సూర్యుడని పేరు. విశ్వాంతరాళ మందలి అతి పలుచని హైడ్రోజన్ వాయువును లేదా ఈథర్‌ను త్రితవాయువుగా పేర్కొని ఉండవచ్చును. కాన, వీటన్నిటినీ సమీకరించి యాస్క మహర్షి - **'సూర్యః, సర్తేర్వా, సువతేర్వా, స్వీర్యతేర్వా - (నిరుక్తము 12-2-15)** అని నిర్వచించాడు. ఇక మంత్రార్థాలను తెలుసుకొనే ప్రయత్నం చేద్దాము.

నాలుగు వేదాలలో ఋగ్వేదమే పెద్ద వేదం. పది మండలాలుగల ఈ వేదంలో మొత్తం 10,552 మంత్రాలున్నాయి. ఇది జ్ఞానకాండకు చెందిన వేదం. సృష్టిలో తాను రచించిన పదార్థాలన్నిటి గుణగణాలను పరమేశ్వరుడు బీజరూపంలో (సూత్ర రూపంలో) దీనిలో ఉపదేశించాడు. నేడు లోకంలో మనకు కనబడే పదార్థ విజ్ఞాన శాస్త్రా లన్నిటికి ఇదే మూలం. ఈ సూత్రాల వికసిత రూపమే నేటి ఫిజిక్స్, కెమిస్ట్రీ, బోటనీ, జూఆలజీ, అస్ట్రానమీ మొదలగునవి. ఆయుర్వేదం దీని ఉపవేదం. మానవ, జంతు, వృక్షా యుర్వేదాలన్నీ దానిలోని భాగాలే. మన విషయం సూర్య విజ్ఞానం కనుక అందుకు చెందిన కొన్ని మంత్రాలను తెలుసుకొందాము.

ఋగ్వేద ప్రథమ మండలములోని 115వ సూక్తము

**(ఋషిః కుత్స అంగిరసః, దేవతః సూర్యః)**

**1. చిత్రం దేవానా ముదగాదనీకం**

**చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః ।**

**ఆప్రా ద్యావా పృథివీ అంతరిక్షం**

**సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ ॥**

చిత్ర విచిత్ర గుణములుగల ఉదయించు సూర్యుడు దేవతలన్నిటికి అనగా దివ్యగుణములు గల పదార్థము లన్నిటికి కావలసిన బలము నిచ్చును. మిత్రులకు వరుణులకు (శ్రేష్ఠులకు) అగ్నులకు (జ్ఞానులకు) నేత్రము వంటివాడు. అనగా వారందరికి దృక్‌శక్తి నిచ్చును. పృథివీ, అంతరిక్ష, ద్యు

స్థానములలో సూర్యుడు తన కిరణములను వ్యాపింపజేయుచు స్థావర జంగమ చరాచర ప్రపంచమున కంతటికి ఆత్మగా అనగా ఆధారముగా నుండును.

(2) సూర్యో దేవీముషసం రోచమానాం
మర్యో న యోషా మభ్యేతి పశ్చాత్ ।
యత్రా నరో దేవయన్తో యుగాని
వితన్వతే ప్రతి భద్రాయ భద్రమ్ ॥2॥

ఒక సుందర యువతిని ఒక యువకుడు (ప్రేమికుడు) వెంబడించు విధముగా సుందర ఉషాకన్య వెనుక సూర్యుడు వెంబడించి వచ్చును. పరోపకారాది యజ్ఞ కర్మలతో ఉన్నతిని గోరు మానవులకు సూర్యుడు తన ప్రకాశముతో మేలు చేయును.

(3) భద్రా అశ్వా హరితః సూర్యస్య
చిత్రా ఏతగ్వా అనుమాద్యాసః ।
నమస్యన్తో దివ ఆ పృష్ఠమస్థుః
పరి ద్యావా పృథివీ యన్తి సద్యః ॥3॥

సూర్యుని హరిత అశ్వములు కల్యాణ కరమైనవి. హరిత అశ్వము లనగా రోగకారక క్రిములను, సముద్రాదు లందలి నీటిని హరించు శక్తిగల కిరణములు. ఆ విలక్షణ కిరణములు స్థావర, జంగమ ప్రాణులన్నిటికి ఆరోగ్య, ఆహారముల నిచ్చి ఆనందము నిచ్చును. అత్యంత వేగముతో ద్యు పృథివీ లోకములపై విస్తరించును. (కాంతి కిరణ వేగము సెకనుకు 1,86,000 మైళ్ళని మీరంద రెరిగినదే గదా!)

(4) తత్ సూర్యస్య దేవత్వం తన్మాహిత్వం
మధ్యా కర్తోర్వితతం సం జభార ।
యదేదయుక్త హరితః సధస్థాదాద్రాత్రీ,
వాసస్తనుతే సిమస్మై ॥4॥

ఈ మంత్రములో సూర్యాస్తమయ స్థితి వర్ణింపబడి యున్నది. సాయంకాలం మానవులు చేయు కర్మలు పూర్తి కాకున్నను మధ్యలోనే సూర్యుడు (సమయపాలన రీత్యా సూర్యుడు) తన దివ్య కిరణములను

వెనకకు తీసుకొని అస్తమించును. అనగా వారి పనులు పూర్తి అగు వరకు నేచి ఉండడు. తన నియమము ననుసరించి సమయమునకే అస్తమించును. ఎప్పుడు సూర్యుడు తన హరిత కిరణములను తీసుకుపోవునో అప్పుడు రాత్రి (ప్రాణుల విశ్రాంతి కొరకు) చీకటి అను వస్త్రముతో ఆ భూభాగమును కప్పివేయును.

(5) తన్మిత్రస్య వరుణస్యాభిచక్షే
సూర్యో రూపం కృణుతే ద్యోరుపస్థే ।
అనన్తమన్యద్ రుశదస్య పాజః
కృష్ణమన్యద్ధరితః సం భరన్తి ॥5॥

ఈ మంత్రము దిన రాత్రము లెట్లగునో వివరించుచున్నది. ఆ సూర్యుడు మిత్రుడుగాను, వరుణుడు గాను కూడ కనబడును. ఏలయన ద్యులోకమున సూర్యుడుదయించగానే అతడు తన హరిత కిరణములతో ప్రాణులకు మిత్రుడగును. అదే సమయమున (కృష్ణం అన్యత్) భూమి వెనుక భాగమున నల్లని చీకటిని కలిగించి వరుణుడగును. అనగా పనులతో అలసి సొలసి విశ్రాంతిని గోరు ప్రాణులకు వారు గోరు నిద్ర నిచ్చువాడగును.

(6) అద్యా దేవా ఉదితా సూర్యస్య
నిరంహసః పిపృతా నిరవద్యాత్ ।
తన్నోమిత్రో వరుణో మామహన్తా
మదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః ॥6॥

ఓ విద్వాంసులారా! దిన ప్రారంభమగు ఈ సూర్యోదయ సమయముననే ధర్మోపదేశములు చేసి, మమ్ము పాపముల నుండి కాపాడుడు. మా ఈ శుభేచ్ఛను మిత్రా వరుణులు (మాలోని ప్రాణ, అపాన వాయువులు), అదితి (ఆకాశము), సింధువు (సముద్రము), పృథివీ ద్యులోకములు మన్నించును గాక! అనగా మా సత్కర్మలన్నిటికి ప్రాకృతిక శక్తులన్నియు సహకరించునుగాక! అని అర్థము.

ఇదే ప్రథమ మండలములోని 13 మంత్రములు గల 50వ సూక్తము కూడ సూర్యసూక్తమే. అందు సూర్యుని హరణ శక్తిగల హరిత కిరణ విశేషతతో బాటు అవి సప్త విధములని వర్ణింపబడినవి.

**సప్త త్వా హరితో రథే వహన్తి దేవ సూర్య ।**
**శోచిష్కేశం విచక్షణ ॥ (ఋ. 1-50-8)**

సర్వద్రష్టయైన ఓ దివ్యగుణ యుక్త సూర్యుడా! తేజస్వంతమైన జ్వాలాశిఖలు గల నిన్ను సప్త హరిత అశ్వములు రథముపై కూర్చుండబెట్టుకుని తీసుకుపోవును.

ఒకవేళ ఆ అశ్వములు ఎక్కడ నుండియో వచ్చి రథము నీడ్చుచున్నవని పొరబడుదుమేమోయని '**తాభిర్యాతి స్వయుక్తి భిః (ఋ. 1-50-9)** ఆ అశ్వములు తమంత తామగానే జోడింపబడి తీసుకుపోవునని చెప్పబడినది. ఇది ఆలంకారిక వర్ణనయే కాని సప్తాశ్వ రథముపై సూర్యుడు పయనించునని కాదు. అతని కిరణములే అత్యంత వేగవంతమైన అశ్వములు. అవి అతనితో ఎప్పుడు జోడింపబడియే యుండును. ముఖ్యముగా ప్రాతఃకాలపు సూర్య కిరణముల లాభమేమో ఈ విధముగా వర్ణింపబడెను.

**ఉద్యన్నద్య మిత్రమహ ఆరోహన్నుత్తరాం దివమ్ ।**
**హృద్రోగం మమ సూర్య హరిమాణం చ నాశయ ॥**
**(ఋ. 1-50-11)**

మిత్రుని వంటి ఓ ఉదయించు సూర్యుడా! ద్యులోకమున పైకెగబ్రాకుచు నీవు హృదయ కుహర మందలి రోగములను మరియు కామెర్ల రోగమును పోగొట్టుము. (నేడు ఆంగ్లేయ వైద్యులు కూడా పుట్టిన కొద్ది రోజులకే వచ్చు పసిపిల్లల కామెర్ల రోగమునకు (Infantile Jaundice కు) ఉదయపు నీరెండలో కొద్దిసేపు ఉంచవలెనని సలహా నిచ్చుచున్నారు.)

**ఉదగాదయమాదిత్యో విశ్వేన సహసా సహ ।**
**ద్విషన్తం మహ్యం రన్ధయన్ మో అహం ద్విషతే రథమ్**
**(ఋ. 1-50-13)**

నన్ను ద్వేషించు శత్రువులను నా వశములో పెట్టుకోగల శక్తినిచ్చు సూర్యుడు దివ్య తేజస్సుతో ఉదయించెను. ఇక నాకు భయం లేదు. అతని కృపతో నేనెన్నడు శత్రువులకు వశము కాకుందును గాక. ఇక్కడ శత్రువు లనగా మన శరీరమునకు హాని కలిగించు రోగ కారక క్రిములు. సూర్య తేజస్సులో అవి మరణించును. ఇంతేగాక సూర్య తేజస్సులో మన రోగ నిరోధక శక్తి పెరుగును.

ఉదపప్తదసౌ సూర్యః పురు విశ్వాని జూర్వన్ ।
ఆదిత్యః పర్వతేభ్యో విశ్వదృష్టో అదృష్టహా ॥

(ఋ. 1-191-9)

సమస్త రోగ క్రిములను సంహరించగల విశ్వద్రష్టయైన సూర్యుడు తూర్పు దిశలో పర్వతములపై నుండి ఉదయించుచున్నాడు. అతని ఆదిత్య కిరణములు అదృష్ట (కనబడని - దాగియున్న) క్రిములను కూడా సంహరించి ఆరోగ్యము నిచ్చును.

సూర్య విషమా సజామి దృతి సురావతో గృహే ।
సో చిన్ను న మరాతి నోవయం మరామారే అస్య
యోజనం హరిష్ఠా । మధు త్వా మధులా చకార ॥

(ఋ. 1-191-10)

మధుశాలలో మధుపాత్ర నుంచునట్లు సూర్య కిరణములలో విష మిశ్రిత పదార్థముల నుంచెదను. ఆవిషముతో సూర్యుడు మరణించడు, మనను మరణించనివ్వడు. ఏలయన అతడు ఆ విషముల నన్నిటిని హరించి ఆ పదార్థములను విష రహితములు గాను, మధురములుగాను చేయును. అనగా ధాన్యాదులలో, ఫలాదులలో కొందరికి పడని స్వల్ప విషముల వంటి దోషము లుండవచ్చు. వాటిని తీక్ష్ణమైన ఎండలో నుంచిన అవి దోష రహితము లగుటయే గాక మధురము లగును.

అధుక్షత్పిప్యుషీ మిషమూర్జం సప్తపదీ మరిః
సూర్యస్య సప్త రశ్మిభిః (ఋ. 8-72-16)

పరమేశ్వరుడు సూర్యుని యొక్క సప్తవిధ కిరణముల నుండి (సప్తపదీ) సప్త విధములైన ప్రాణిపోషక తత్త్వములను పిండి ప్రాణులకు పుష్టిని బలమును ఇచ్చుచున్నాడు. (ఆ సప్త పదార్థములు పృథివీ, జల, అగ్ని, వాయు, విరాట్, పరమాణు, ప్రకృతులని మన ప్రాచీన శాస్త్రములలో వివరణ కనబడును. ఆ సప్త కిరణము లెవ్వియో? ఏ కిరణముల నుండి ఏ పదార్థములు నిర్మితములై ప్రాణులకు ఏ విధమైన పోషణ నిచ్చుచున్నవో పరిశోధించవలసి యున్నది.)

ఇక ఆధునిక వర్ణ చికిత్సా శాస్త్రాన్నిబట్టి (Chromotherapy) సూర్య కిరణాలలో 7 రంగులుంటాయి. అవి ప్రాణుల శరీరంలో కూడా ఉంటాయి.

అని ఆయా అవయవాలలో ఎక్కువైనా తక్కువైనా రోగాలు వస్తాయి. వాటిని సరిచేస్తే రోగాలు పోతాయి. మనం ఆహారంగా తీసుకునే ఫల శాక ధాన్యాదు లన్నిటిలోను కూడ రంగులుంటాయి. వాటిని బట్టే వాటి వాటి ఆహార గుణాలుంటాయి. ఈ విషయాలను చికిత్సా ప్రకరణంలో వివరంగా తెలుసుకుందాము.

12 మంత్రములుగల ఋగ్వేద దశమ మండల మందలి 37వ సూక్తము కూడ సూర్యసూక్తమే. అందు దిన రాత్రములు ఏర్పడుటకు వాయు జలాగ్నుల విశుద్ధతకు ద్విపాద చతుష్పాదాది ప్రాణుల ఆరోగ్య బల ఉత్సాహములకు సూర్యుడే కారణమని వర్ణింపబడినది. సమస్త గ్రహ ఉపగ్రహాదు లన్నిటికి కారణమై తన హరికేశములతో (హరణ శీల ప్రకాశ కేశములతో (శిఖలతో) దినరాత్రములను కలిగించుచు ప్రాణులను కాపాడుచున్నాడని చెప్పబడినది. సూర్యుడు తన కిరణములతో, ఉష్ణతతో, ప్రకాశముతో ప్రాణుల కల్యాణమునకై సదా ఉదయించుచునే తపించుచునే యుండునని వర్ణింపబడెను. అనగా ఉదయాస్తమ సమయములు భూమి తిరుగుట వలెనే కాని సూర్యుని విశ్రాంతికి కాదు. భూమి వర్షములు కురియుటకు, మంచు కురియుటకు కూడా సూర్యుడే కారణమనుచు - అవి మాకు కల్యాణ కరములు కావలెనని ఈ విధముగా ప్రార్థన గలదు.

**శం నో భవ చక్షసా శం నో అహ్నా**
**శం భానునా శం హిమా శం ఘృణేన ।**
**యథా శమధ్వ ఞ్ఛమసద్ దురోణే**
**తత్సూర్య ద్రవిణం ధేహి చిత్రమ్ (ఋ. 10-37-10)**

ఓ సూర్యుడా! నీ తేజముతో, నీ దినముతో, నీ ప్రకాశముతో నీ హిమముతో (మంచుతో) నీ ఉష్ణతతో, నీ ఋతువులతో మాకు కల్యాణ కరుడవు కమ్ము. మా జీవన మార్గమున ఎట్టి కష్టములు రాకుండుటకు ధన ధాన్యములతో మా గృహములను పరిపూర్ణము చేయుము.

ఇచట గమనించవలసిన ముఖ్య విషయమేమనగా సూర్యుడెంత పెద్ద గోళమైనను జ్ఞానము లేని జడపదార్థమే. అది మన ప్రార్థన నాలకించదు. మనం ప్రార్థనోపాసనలు చేయవలసింది పరమేశ్వరునే కాని ప్రాకృతిక పదార్థములను కాదు. వాటి నా విధంగా నిర్మించి నియమించి నడిపించు దేవత్రా, సూర్యునే ఉపాసించాలని వేదం చెబుతుంది.

''దేవం దేవత్రా సూర్య మగన్మ జ్యోతి రుత్తమమ్''
(యజు. 35-14)

ఏ దేవుడు సూర్య చంద్రాది దివ్య గుణములుగల దేవతలను ప్రకాశింపజేయుచున్నాడో ఆ దేవుడే మనలో వ్యాపించి అంతరాత్మగా - ఆత్మ సూర్యునిగా ఉన్నాడు. మనం అంతర్ముఖులమై ఆ దేవత్రా సూర్యుని దర్శించి మనం కూడా దివ్య గుణములను పొందాలని దీని భావం. ఇదే భావం శతపథ బ్రాహ్మణంలో **'సూర్యో వై సర్వేషాం దేవానామాత్మ'** - పరమేశ్వరు (సూర్యు)డే సమస్త దేవతలకు ఆత్మగా నుండి పదార్థాలన్నిటికి ఆయా దివ్య గుణములను ప్రసాదించు చున్నాడని చెప్పబడింది.

వేదములో ఎచ్చటనైనా జడ పదార్థములను సంబోధిస్తూ ప్రార్థన లున్నచో మనం వీటిలోని విశిష్ట గుణాలను గుర్తించి వాటిని పొందు మార్గముల నన్వేషించవలెనని మన ప్రాచీన ఋషుల అభిమతం.

ఈ సూక్తమందలి తదుపరి 11వ మంత్రంలో దివ్య గుణములు గల దేవతలు (పదార్థాలు) మాకు శుద్ధములైన అన్న జలాదుల నిచ్చి, సుఖ శాంతి నివ్వవలెనను భావం కలదు. అనగా వాటికి సంబంధించిన జ్ఞానాన్ని మనం పెంచుకొని శుద్ధములైన అన్నపానీయాదుల నుత్పత్తి చేసికోవలెను. తదుపరి 12వ మంత్రం. అట్టి పదార్థ విజ్ఞానమును తెలిసికొన్న విద్వాంసులను, పరిశోధనలు జరుపు విజ్ఞానవేత్తలను ఆదరించవలెనని చెప్పును. వారి అవహేళన చేయక వారి పట్ల సదా కృతజ్ఞతా భావం కలిగి యుండాలని ఉపదేశించును. నేడు మనకు ఎన్నెన్నో ప్రయోజనాలను, సుఖాలను చేకూరుస్తున్న వైజ్ఞానిక పరికరములన్నియు వారి కృషి ఫలితములే గదా!

ఇట్టివే మరెన్నో సూక్తములు, మంత్రములు ఋగ్వేదము నందు కలవు. వాటన్నిటినీ వ్రాసిన బృహద్గ్రంథమే అగును. కాన సంక్షిప్తముగా కొన్ని ముఖ్య వాక్యములను పరిశీలింతము.

'శం నః సూర్య ఉరు చక్షా ఉదేతు' (ఋ. 7-35-8)

మా అందరికి ఈ ప్రపంచమును చూపించు ఉరుచక్షా సూర్యుడు ఉదయించి మాకు కల్యాణము చేయుగాక! అనగా సూర్యుని వల్లనే మనమంతా చూడగలుగుతున్నాం. లేకున్న కన్నులున్నా అంధకారమే, గ్రుడ్డివారమే.

అపామీవాం బాధతే వేతి సూర్యమభిక్రృష్ణేన
రజసా ధ్యామృణోతి ॥ (ఋ. 1-35-9)

రోగ నివారకములైన సూర్యకిరణములు స్వయం ప్రకాశములై అప్రకాశ పృధి వ్యాది గ్రహాల కన్నిటికి వెలుగునిచ్చి వాటిని తమతో తీసుకుని పయనించుచున్నవి.

సప్త యుఞ్జన్తి రథ మేక చక్రమేకో అశ్వో వహతి సప్తనామా
త్రినాభి చక్ర మజర మనర్వం యత్రేమా విశ్వా భువనాధి తస్థుః ॥ 2 ॥
(ఋ.1-164-2)

ఒకే చక్రము వంటి గమనశీల సూర్య రథమునకు సప్తవర్ణములు జోడింపబడి యున్నవి. సప్త అనునది వేరువేరు నామములుగల ఏడు రంగుల సమూహమైనను అది ఒకే అశ్వము. అనగా అన్నీ కలిసి ఒకే తెల్లని కిరణమగును. (అశ్వమనగా గుర్రమని కాదు. వేగముగా పయనించునది యని అర్థము) ఆ సూర్య కిరణములు భూ అంతరిక్ష ద్యులోకము అను మూడు నాభులలో బంధింపబడి యున్నవి. ఆ అశ్వము ముసలితనము లేనిదై నిత్య యౌవనముతో సమస్త గ్రహ, ఉపగ్రహాదులను తనతో తీసుకుపోవుచున్నది. అది తనంత తానే పరుగిడుచున్నది.

దివ్యం సుపర్ణం వాయసం బృహన్త
మపాం గర్భం దర్శత మోషధీనామ్।
అభీపతో వృష్టిభి స్తర్పయన్తం
సరస్వన్తమవసే జోహవీమి (ఋ.1-164-52)

దివ్యములై అత్యంత వేగవంతములైన కిరణములుగల సూర్యుడు ఈ బ్రహ్మాండ మధ్యమున (సూర్య కుటుంబ మధ్యమున) అన్నిటికన్న పెద్ద గోళము. అతడే సోమలతాది సర్వపదార్థ దర్శకుడు, ఉత్పాదకుడు. అతడే భూమిపై వర్షములు కురిపించి ప్రాణులన్నిటిని తృప్తి పరచుచున్నాడు. అతడు సరస్వంతుడు అనగా తనయందు అపారమైన శక్తిని గలిగి తనను ఆశ్రయించుకొని యున్న గ్రహ, ఉపగ్రహాదులకు, అందలి సమస్త ప్రాణికోటికి శక్తి సంచారకుడు. అట్టి దివ్య గుణములు గల సూర్యుని, సూర్య కిరణములను ఆత్మరక్షణ కొరకు ఆశ్రయింతుముగాక! అనగా వాటిని సద్వినియోగపరచుకొని లాభము పొందెదముగాక!

52 మంత్రములుగల ఈ సూక్తములో సూర్యుని గురించి తెలుపు మంత్రములు చాలా ఉన్నవి. మన విషయము చికిత్సా విషయము కనుక రెండు మంత్రములకే అర్థము వ్రాయుట జరిగినది.

నాస్తికులు సృష్టికర్త నంగీకరించరు. అట్లే వేదము ఈశ్వరీయ జ్ఞానం కాదందురు. అది రాతియుగం నాటి ఆటవికులు వ్రాసిన పిచ్చిపాటల గ్రంథమందురు. వారు ఈశ్వరుని, వేదాన్నీ అంగీకరించకపోయినా పై మంత్రాలనుబట్టి వేదకాలం నుండే భారతదేశంలో ఖగోళ విజ్ఞానం మహోన్నతంగా ఉందని అంగీకరించక తప్పదు. ఋగ్వేదం ప్రపంచంలో ప్రప్రథమ గ్రంథమని ప్రపంచ మేధావులంతా ముక్తకంఠంతో అంగీకరించారు. అట్టి ఋగ్వేదంలో ఎంతటి మహోన్నత ఖగోళ విజ్ఞానము ఉందో చూచితిరి కదా! వేద మంత్రాలు ఆటవికుల పిచ్చిపాట లెట్లగును?

అట్టి మాటలనువారినే ఆటవికు లనవలయును. లేకున్న సత్యము నేల అంగీకరించరు? ఒక్క ఋగ్వేదంలోనే కాదు. నాలుగు వేదాలలో ఇట్టి సృష్టి రహస్యాలు కోకొల్లలు గలవు. పైవి సూర్యుని గూర్చిన కొన్ని మంత్రాలు మాత్రమే. ఇట్లే ఉషస్సులను గురించి చెప్పే సూక్తాలు, మంత్రాలు అనేకం ఉన్నాయి. వాటిని గురించి తదుపరి ప్రకరణంలో తెలుసుకుందాము. ఇప్పుడు యజుర్వేదంలోని సూర్య విజ్ఞానాన్ని కొద్దిగా పరిశీలింతము.

యజుర్వేదం కర్మ ప్రధానమైన వేదం. అయినా ఇందు సూర్యాది ప్రాకృతిక శక్తుల గుణాలను వర్ణించి ఆ విధంగా విద్వాంసులు, రాజులు ప్రజలను పాలించాలని అలంకారిక రూపంలో ఉపదేశాలున్నాయి. ఇందు 40 అధ్యాయాలు, 1975 మంత్రాలు ఉన్నాయి. అందులో సూర్యుడు దేవతగా గల (సబ్జెక్ట్‌గా) అనేక అధ్యాయాలు (యజుర్వేదములో సూక్తాలు కాక అధ్యాయాలుండును) మంత్రాలు ఉన్నాయి. అందుండి కొన్నిటిని మాత్రమే ఇక్కడ ఉదాహరిస్తున్నాము.

**ఉక్షా సముద్రో౽ అరుణః సుపర్ణః**
**పూర్వస్య యోనిం పితురా వివేశ ।**
**మధ్యే దివో నిహితః పృశ్నిరశ్మా**
**వి చక్రమే రజసస్పాత్యన్తౌ ॥ (య.17-60)**

వర్షజలముతో భూమిని తడుపు ఉక్షా (సూర్యుడు) తన అద్భుతమైన అరుణ కిరణములతో తూర్పున ఉదయించుచున్నాడు. అతడు సూర్య కుటుంబ మధ్యమున తన దివ్యశక్తులతో విరాజిల్లుచు గ్రహ, ఉపగ్రహాది

లోకముల నన్నిటిని పాలించుచున్నాడు. సముద్రతుల్యమైన జలరాశితో కూడిన మేఘములను నిర్మించుచు వర్షింపజేయుచున్నాడు. కాన ఆ సూర్యుని, మేఘములను సదుపయోగము చేసుకొనుడు.

**అక్రన్దదగ్ని స్తనయన్నివ ద్యౌః**
**క్షామారేరిహద్ వీరుధః సమఞ్జన్।**
**సద్యో జజ్ఞానో విహీమిద్ధో౽ అఖ్యదా**
**రోదసీ భానునా భాత్యన్తః॥ (యజు 12-21)**

ద్యులోకమున సూర్యుడు తన కిరణ పుంజముతో ఈ భూమిని చలాయమానము చేయుచు అన్నివైపుల ప్రకాశము నిచ్చుచున్నాడు. ఉరుములు మెరుపులతో కూడిన మేఘములను వర్షింపజేసి వృక్షలతాదులతో భూమిని సస్యశ్యామలము చేయుచున్నాడు.

**సంహితో విశ్వసామా సూర్యో గన్ధర్వస్తస్య**
**మరీచయో౽ ప్సరస ఆయువో నామ।**
**స న ఇదం బ్రహ్మ క్షత్రమ్పాతు తస్మై స్వాహా వాట్**
**తాభ్యః స్వాహా (యజు. 18-39)**

గ్రహ ఉపగ్రహాదులతో కూడిన సూర్యుడే ఈ పృథివిని ధరించుచున్నాడు. అంతరిక్షములో పయనించు అతని కిరణములే పదార్థముల గ్రహణ విసర్జన సామర్థ్యము గలవని ప్రసిద్ధి. అనగా సముద్రాదులందలి నీటిని గ్రహించి భూమిపై వర్షింపజేయు సామర్థ్యము గలవి. అట్లే ఓ సామవేద విద్వాంసులారా! మీరు కూడ సూర్యుని నుండి ప్రేరణను బొంది లోకోపకార సత్కార్మలు చేయుడు. మా బ్రాహ్మ క్షాత్ర శక్తులను (విద్యా సైనిక వర్గములను) అభ్యుదయ కార్యములందు ప్రేరేపించి మమ్ము కాపాడుడు.

వివాహ సంస్కారంలో నూతన వధూవరులతో చేయించే రాష్ట్ర భృత్ హోమంలో ఈ మంత్రం వస్తుంది. 12 మంత్రాలుగల ఈ యజ్ఞం రాష్ట్రం (దేశం) యొక్క పుష్టి కొరకు - ఉన్నతి కొరకు చేయబడుతుంది. అందు దేశోన్నతికి అగ్ని, సూర్య, చంద్ర, వాయు, యజ్ఞ, మనస్సులను 6 ప్రాకృతిక శక్తుల జ్ఞానం అవసరమని సూచించబడింది. అట్టి విజ్ఞానమున్న ప్రజలుగల దేశమే ఉన్నతి చెందుతుంది. ఆదేశ రక్షణ సామర్థ్యం కూడా పెరుగుతుంది. అందు సూర్య విజ్ఞానం కూడా ఒకటనేది గమనార్హం.

**యే వామీ రోచనే దివో యే వా సూర్యస్య రశ్మిషుః।**

**యేషా మప్సు సదస్కృతం తేభ్యః సర్వేభ్యో నమః॥**

**(యజు. 13-8)**

ఏ దుష్ట సర్పములు ప్రకాశయుక్త ద్యులోకములో (సూర్యునిలో) ఉన్నవో మరియు ఏవి సూర్య కిరణములను వికృత పరచుచున్నవో మరియు ఏవి వర్ష జలమును దూషితము చేయుచున్నవో అట్టి దుష్ట సర్పములకు దూరము నుండియే నమస్కారము.

వ్యాఖ్య:- ఇచట నమః అనగా సత్కారపూర్వకంగా చేతులెత్తి నమస్కరించుట యని కాదు. నమనము చేయుట - నశింపజేయుట - వశములో పెట్టుకొనుట అని అర్థం. అట్లే సర్పము లనగా పాము లని అర్థం కాదు. ప్రాకునవి - జరుగునవి - చలించునవి అని అర్థం. సూర్యునిలో ప్రకాశం అంతట సమానంగా లేదని మనం ముందే తెలుసుకున్నాం. ఉపరితలమంతా అల్లకల్లోలంగా మంటలతో కొంత భాగం నల్లటి మచ్చలతో కొంతభాగం ఉంటుంది. ఆ మంటలు మచ్చలు కూడా ఎప్పటికి ఒకేచోట కాక అతిచంచలంగా ప్రాకుతున్నట్లుగా మార్పుచెందుతూ ఉంటాయి. ఈ నల్లటి భాగాలనే (Black spots - Sun spots) యజుర్వేదం దుష్టసర్పాలంటుంది. ఋగ్వేదం వీటిని కృష్ణ భాగాలంటుంది.

**ఆ తే సుపర్ణా అమినన్తం ఏవైః**

**కృష్ణో నోనావ వృషభో యదీదమ్ (ఋ.1-79-2)**

కృష్ణ (నల్లని) మచ్చలుగల వృషభము (వర్షములు కురిపించు సూర్యుడు) తన సుపర్ణములతో (కిరణములతో) చక్కటి వర్షములను కురిపించునుగాక!

**అయం చక్ర మిషణ త్సూర్యస్య**

**న్యేతశం రీరమత్సస్రుమాణమ్।**

**ఆ కృష్ణ ఈం జుహురాణో జిఘర్తి**

**త్వచో బుధ్నే రజసో అస్య యోనౌ (ఋ.4-17-14)**

సూర్యుని ఉపమానముగా చూపి ఈ మంత్రము రాజున కుపదేశించుచున్నది. ఓ రాజా! అంతరిక్షములో గ్రహ ఉపగ్రహాదు లన్నిటిని

లాగుకొనిపోవు సూర్యుని రథము వంటి నిరంతర గమనశీలము గల వేగవంతమైన రథమును నిర్మించుకొనుము. అతనిలోని నల్లని మచ్చలు జలమును వికృతపరచునట్లే దుష్టులను నష్టము చేసి ప్రజలను కాపాడుము.

మన ప్రాచీన శాస్త్రాలలో సూర్యునకు సంవత్సరం అనే పేరు కూడా ఉంది. ఈ పదాన్ని జైమినీ బ్రాహ్మణం (2-28) ఈ విధంగా వివరిస్తుంది.

**'అసావేవ సంవత్సరో యో ఒసౌ తపతి**
**తస్య యద్ భాతి తత్ సంవద్, యన్మధ్యే**
**కృష్ణం మణ్డలం తత్సర ఇత్యధిదైవతమ్।**

అనగా సూర్యుడు సదా తపించుచుండును గాన ఆధిదైవికార్థంలో అతనికి 'సంవత్సర' మని పేరు. (ఈ పదం సంవత్ + సరః అని విడదీస్తే) ఏది ప్రకాశించు భాగవెూ అది 'సంవత్' అని, ఏది కృష్ణ భాగవెూ (ప్రకాశించని నల్లని భాగమో) అది 'సర' అని అర్థం. అందుచే ఈ సంవత్సర పదమును బట్టే సూర్యునిలో ప్రకాశ అప్రకాశ (నల్లటి మచ్చలు) భాగాలు ఉన్నాయని అర్థం అవుతోంది.

దీనినే ఈ 20వ శతాబ్దంలో మూర్ధన్య వైదిక విద్వాంసులుగా పండిత ప్రకాండు లందరిచేత కొనియాడబడిన వారు రాష్ట్రపతిచే సమ్మానితులు మహామహోపాధ్యాయ పదవీ విభూషితులునైన పం.యుధిష్ఠిర మీమాంసక్ గారు మరికొంత వివరించుచు ఇట్లు వ్యాఖ్యానించిరి.

**'ఇమే కృష్ణాః కలజ్కాః ఏవ ఇమే 'సర' నామ్నా స్మర్యన్తే'**

ఈ నల్లని మచ్చలు సదా చలించుచుండును. ఒకచోట స్థిరముగా నుండవుగాన 'సర = ప్రాకునవి' అని చెప్పబడింది. సూర్యోపరితలంపై కూడా ఈ నల్లని మచ్చలు వస్తూపోతూ ప్రాకుచున్నట్లుండును గాన 'సర్ప' అని వేదం చెబుతోంది. సర్పణ మనగా నడచుట = ప్రాకుట. ఇందుచేతనే బ్రాహ్మణ గ్రంథములలో **'సర్ప్యా వా ఆదిత్యాః (తై. బ్రా 25-15-4)** 'సర్పా వా ఆదిత్యాః' అను పాఠభేదంతో కూడా చెప్పబడింది. మరొక చోట మరొక క్రొత్త విషయం కనబడుతుంది.

**శ్లో ॥ ఫూత్కారవిషవాతేన నాగానాం వ్యోమచారిణామ్ ।**
**వర్షాసు సవిషం తోయం దివ్యమప్యాశ్వినం వినా ॥**

(శబ్ద చిన్తామణి కోశము - 1 - 799 గాఙ్గ్ శబ్ద ఉద్ధృత మిదం పద్యమ్)

అనగా - వ్యోమములో (ఆకాశములో) విహరించే నాగుల పూత్కారముల (బుసల) విషముచే వర్షించు వర్షజలము కూడా అశ్విని నక్షత్ర యోగము (ఆశ్వీయుజ మాసము) లేకున్న కొంత విషయుక్తము కావచ్చును. అనగా ఆశ్వయుజ మాసములో కురిసిన వర్షజలము శుద్ధముగా నుండునని తెలియుచున్నది. దీనినే సుశ్రుతము గంగాజలమని పేర్కొనెను.

**తత్రాంతరిక్షం చతుర్విధం... తత్ పునర్ద్వివిధం - గాంగ, సాముద్రం చేతి, తత్ర గాంగ మాశ్వయుజే మాసి ప్రాయశో వర్షతి... (సుశ్రుత. సూత్ర 145-6)**

ఇప్పుడిప్పుడే ఆధునిక పాశ్చాత్య వైజ్ఞానికులు అనేక దూరదర్శనీ (అబ్జర్వేటరీ)ల సాయంతో ఈ సూర్యునిలోని నల్లటి మచ్చల గురించి తెలుసుకోగలిగారు. కాని భారతీయ వైజ్ఞానికులు వేదాల ఆధారంతో ఈ విషయాన్ని వేదకాలం నుండే కనుగొనగలిగారు. అన్ని రకముల అతీంద్రియ జ్ఞానము కలిగించును కనుకనే వేదము మహత్త్వపూర్ణమైనది. అందుచేతనే సాయణాచార్యులు తన తైత్తిరీయ సంహితా భాష్య ఉపోద్ఘాతములో వేదాల మహత్త్వము నిట్లుకొనియాడెను.

**శ్లో॥ ప్రత్యక్షేణానుమిత్యా వా యస్తూపాయో న బుద్ధతే।
ఏతం విదన్తి వేదేన తస్మాద్ వేదస్య వేదతా ॥**

''ప్రత్యక్షముచేగాని, అనుమానముచేగాని తెలియబడని ఏ జ్ఞానము కలదో అది (ఆధ్యాత్మికమైనదైనను, ఆధిదైవికమైనదైనను లేక అతీంద్రియమైనదైనను) వేదము ద్వారా తెలియబడును. ఇదే వేదములోని వేదత్వమై (విశిష్ట జ్ఞానత్వమై) యున్నది.''

అట్లని వేదములందు ప్రత్యక్ష పదార్థముల జ్ఞానము లేదని కాదు. పరమేశ్వరుడు తాను సృజించిన సమస్త ప్రత్యక్ష, అప్రత్యక్ష పదార్థముల జ్ఞానమంతయు బీజరూపంలో ఆది - ఋషుల కుపదేశించెను. అట్టి ప్రాథమిక జ్ఞానము లేకున్న మానవులకు జ్ఞానము వికసించు అవకాశమే ఉండదు. ఇప్పటికీ ఏమీ నేర్పకుండా ఏకాంతంలో పెంచిన పిల్లలలో జ్ఞానవికాసం కలుగుట లేదని పరీక్షలలో వెల్లడయినది. ఇంతేగాక వేదములలో ప్రత్యక్ష పదార్థ జ్ఞానమే అనగా పంచభూతముల, వాటితో ఏర్పడిన వివిధ ఖనిజ ఓషధీ వనస్పతులు మొదలగు అనేక ప్రాపంచిక పదార్థముల జ్ఞానమే ఎక్కువగా ఉన్నది. మానవుడు సామాజిక ప్రాణి గనుక సామాజిక, రాజనైతిక,

కౌటుంబిక, వైద్య, యంత్ర, వ్యవసాయాది అనేక విషయముల గూర్చిన జ్ఞానము అందు ఉపదేశింపబడినది. వీటన్నిటితో బాటు అతీంద్రియమైన సృష్టి రహస్యాలు, ఆత్మ పరమాత్మల జ్ఞానం, సమస్త దుఃఖ నివృత్తికి పరమానంద ప్రాప్తికి మార్గాలు అందులో చెప్పబడ్డాయి. ఇప్పటికైనా ఆధునిక వైజ్ఞానికులు వేదాల నన్వేషించి ఆ సూచనల మేరకు పరిశోధనలు సాగిస్తే యిప్పటికీ పరిష్కారం కాని అనేక సృష్టిరహస్యాలు సులభంగా వెల్లడవుతాయి. సూర్యుని గురించి, సూర్య కిరణాల గురించి స్పష్టంగా తెలుసుకోగలిగితే తుఫానులను, ఉప్పెనలను అతివృష్టి అనావృష్టులను చాలావరకు నివారించే అవకాశం ఉంది.

**విమాన ఏష దివో మధ్య ఆస్త**
**ఆపప్రివాన్ రోదసీ అంతరిక్షమ్ ।**
**స విశ్వాచీరభి చష్టే ఘృతాచీరన్తరా**
**పూర్వమపరం చకేతుమ్ ॥ (యజు. 17-59)**

ఈ సూర్య కుటుంబమును నిర్మించిన (కారణమైన) సూర్యుడు ద్యులోక మధ్యమున నుండును. అతడు తన తేజస్సుతో ద్యావా పృథివీ అంతరిక్ష లోకములను పూర్ణము చేయుచున్నాడు. ఆ ప్రసిద్ధ సూర్యుడు తన గ్రహ కుటుంబము నంతటిని తన వశములో నుంచుకొని అందలి జలమును సువ్యవస్థితము చేయుచున్నాడు. అందలి పూర్వాపరాంతరములలోని ప్రాణులన్నిటికి తన తేజస్సుతో శక్తి నిచ్చుచున్నాడు.

**సూర్యరశ్మిర్హరికేశః పురస్తాత్సవితా జ్యోతిరుదయాన్ అజస్రమ్ ।**
**తస్య పూషా ప్రసవే యాతి విద్వాన్సం పశ్యన్విశ్వా భువనాని గోపాః॥**
**(యజు. 17-58)**

సూర్య కిరణములు హరికేశముల వంటివి. అనగా బంగారు వర్ణముతో కేశముల వలె పొడవుగా ప్రసరించును. ప్రాణులకు ప్రేరణను కలిగించు ఆ సవితాజ్యోతి నియమముగా తూర్పున ఉదయించును. అతని పుష్టిని కలిగించు కిరణములే సర్వప్రాణులు ప్రసవించుటకు (పుట్టుటకు) కారణము. అట్టిసూర్యుడు సమస్త చరాచర లోకములను ప్రకాశింప జేయుచు పయనించుచుండును.

**రుద్రాః సంసృజ్య పృథివీం బృహజ్జ్యోతిః సమీధిరే ।**
**తేషాం భానురజస్ర ఇచ్ఛుక్రో దేవేషు రోచతే ॥**

**(యజు. 11-54)**

రుద్ర వాయువుచే ఉత్పన్నమైన సూర్యుడు తన బృహత్ ప్రకాశముతో భూమిని ప్రకాశింప జేయుచున్నాడు. అందరి ప్రాణులన్నిటికి దృక్శక్తి నిచ్చి కాపాడుచున్నాడు.

**యస్యేమే హిమవన్తో మహిత్వా**
**యస్య సముద్రం రసయా సహాహుః ।**
**యస్యేమాః ప్రదిశో యస్య బాహూ**
**కస్మై దేవాయ హవిషా విధేమ ॥ (యజు. 25-12)**

ఓ మానవులారా! ఏ సూర్యుని యొక్క గొప్పతనం వల్ల హిమాలయాది అనేక పర్వతములుగల ఈ భూమి ఆకర్షింపబడి యున్నదో ఏది అంతరిక్ష మందలి సముద్ర సమాన జలరాశికి (నీటి యావిరి, మేఘాదులకు) కారణమగుచున్నదో, ఎవని ప్రకాశము ఈ భూమిని ప్రకాశ అప్రకాశక దేశములుగా (కొంత భాగం పగటిగా, కొంత భాగం రాత్రిగా) విభజించుచున్నదో అట్టి సుఖదాతయైన సూర్యదేవత నుద్దేశించి నిత్యము తగిన పదార్థములతో హోమాగ్నిలో ఆహుతులిండు.

(దయానందుని భాష్యం నుండి)

**హిరణ్యపాణిః సవితా విచర్షణిరుభే**
**ద్యావాపృథివీ అన్తరీయతే ।**
**అపామీవాం బాధతే వేతి సూర్యమభి**
**కృష్ణేన రజసా ద్యామృణోతి ॥ (యజు. 34-25)**

సూర్యుని హిరణ్య హస్తములు (కాంతి కిరణములు) సర్వపదార్థ దర్శకములు. అనగా అన్నిటిని చూపించును. సూర్యుడు ద్యావా పృథివీ లోకముల మధ్య ఉదయించి క్రమబద్ధముగా తిరుగుచుండును. అతని కిరణములు వ్యాధిరూప అంధకారమును కూడా దూరము చేయ శక్తివంతములు. అతడు అస్తమియిన భాగమును అంధకారము కప్పివేయును.

**హిరణ్య హస్తో అసురః సునీథః**
**సుమృడీకః స్వవాం యాత్వర్వాఙ్।**
**అపసేధ రక్షసో యాతుధానానస్థాద్దేవః**
**ప్రతిదోషం గృణానః ॥ (యజు. 34-26)**

సూర్యుని హిరణ్య హస్తములు (తేజోవంతమైన కిరణములు) మనందరకు ప్రాప్తింపదగినవి. ఆ సుందర సూర్య కిరణములు భూమిపై వర్షమును కురిపించి మాకు సుఖమును కలిగించును గాక! అన్యాయముగా ఇతరుల సంపదలను దోచుకొను దొంగల నుండి దోపిడిగాండ్ర నుండి మమ్మ రక్షించును గాక! దివ్య గుణములుగల ఆ సూర్యుడు దాగి ఉన్న దుష్టులను, దుష్ట క్రిములను బయటపెట్టును గాక!

**ఏ తే పన్థాః సవితః పూర్వ్యాసో**
**అరేణవః సుకృతా అంతరిక్షే।**
**తేభిర్నో అద్య పథిభిః సుగేభీ**
**రక్షా చ నో అధి చ బ్రూహి దేవ ॥ (యజు. 34-27)**

(ఈ మంత్రము పైరెండు మంత్రములలోని సూర్యుని దివ్యగుణముల నుపమానముగా చూపి ఆ విధముగా విద్వాంసులు లోకహితము చేయవలెనని ఉపదేశించు చున్నది.) ఓ విద్వాంసులారా! మీరు కూడా సూర్యుని వలె లోకహితము చేయువారే. అంతరిక్షములో ఏ గ్రహ ఉపగ్రహములను ఢీకొనక సూర్యుడు భ్రమణము చేయు ఏ మార్గము గలదో అది పరమేశ్వర నిర్మితమైన నిష్కంటక మార్గము. ఓ విద్వాంసులారా! మీరు కూడా మాకు అట్టి నిష్కంటక - నిరుపద్రవ స్వస్తిపథమును (కల్యాణకర జీవన మార్గమును) ఉపదేశించుడు. అట్టి మార్గమున మమ్మ నడిపించి కాపాడుడు.

సామాజిక ప్రాణులమైన మనమంతా కూడా ఒకరి - కొకరము అడ్డుపడక సామాజిక జీవనము సాగించుచు ఉన్నతిని సాధించవలసి యున్నది. అందుకు ఈ మంత్రము సూర్యుని ఉపమానముగా చూపుచున్నది. ఇట్టి ప్రార్థనయే ఋగ్వేదమున మరొకటి కలదు. అది సామాజిక కర్తవ్యమును కూడ వివరించి చెప్పును.

స్వస్తి పంథామనుచరేమ సూర్యాచంద్రమసావివ ।
పునర్దదతాఘ్నతా జానతా సం గమేమహి ॥

(ఋ. 5-51-15)

సూర్య చంద్రుల వలె మేము నిరంతర కర్మశీలురమై కల్యాణ మార్గమున పయనింతుము గాక! మరల మరల ఒకరి కొకరము సహాయపడుచు ఎవరి కెవరమును బాధను కలిగించక, ఒకరినొకరము చక్కగా నర్థము చేసికొనుచు సామాజిక జీవన యాత్ర సాగింతుము గాక!

నేటి మేధావులంతా ఆశించు సమ సమాజ స్థాపనకు వేదమెంతటి చక్కటి మార్గమును చూపుచున్నదో అట్టిది మరే యితర ధర్మగ్రంథము లందును కానరాదు. మానవతావాదులు వ్రాసిన గ్రంథము లందును ఇంతటి మహోన్నత ఆదర్శములు కానరావు. సృష్టికర్తయైన ఈశ్వరుని జ్ఞానము ముందు మానవుని జ్ఞాన మెంత? కాన మానవులంతా వేదమార్గమున పయనించుటయే సర్వసమస్యలకు సమాధానము కాగలదు.

మూడవది సామవేదం. దీనిలో మొత్తం 1875 మంత్రాలున్నాయి. ఇది ఉపాసనా కాండకు చెందినది. అనగా సర్వవ్యాపకుడై జీవాత్మలమైన మనలో కూడ వ్యాపించియున్న పరమేశ్వరుని అంతర్ముఖులమై ధ్యానించుటకు వలయు జ్ఞానం ఇందులో ఉంది. దీనిలో సూర్యః, సవితా, ఆదిత్యా మొదలగు పదములున్నను వీటికి పరమేశ్వరుని పరంగా అర్థం చెప్పుకోవలయునే కాని భౌతిక సూర్యుని పరంగా చెప్పుకోకూడదు. అద్భుతమైన సూర్యాది దేవతలను సృజించి వాటి కాశక్తి నిచ్చుచున్న సర్వాంతర్యామియైన ఆత్మ సూర్యుని పరంగానే అర్థం చెప్పుకోవాలి.

తదుపరి నాల్గవది అథర్వవేదం. ఇది విజ్ఞానకాండకు చెందినది. అనగా జ్ఞానాన్ని నిత్య జీవన ప్రయోజనకరంగా మార్చుకొని వివిధ యంత్ర వాహనాదులను, చికిత్సా పద్ధతులను రూపొందించుకోవడానికి కావలసిన జ్ఞానం దీనిలో ఉంది. ఆయుర్వేదంలోని వివిధ చికిత్సా పద్ధతులకు ఈ వేదమే మూలం. దీనిలో మొత్తం 5,987 మంత్రాలున్నాయి. ఋగ్వేదం తరువాత యిదే పెద్ద వేదం. ఇట్టి అథర్వ వేదం మన సూర్యుని గురించి ఏమి చెప్పుచున్నదో తెలుసుకుందాము.

**అనుసూర్యముదయతాం హృద్ద్యోతో హరిమా చ తే।**
**గో రోహితస్య వర్ణేన తేన త్వా పరిదధ్మసి ॥ (అ.1.22.1)**

ఓ రోగీ! నీ హృదయ సంబంధమైన దడ, నొప్పి, మంట మొదలగు అన్ని బాధలను మరియు హరిమా - రోగమును నీ శరీరము నుండి వెళ్ళగొట్టెదను. (హరిమా రోగమనగా రక్తహీనతతో శరీరము కొద్ది పచ్చదనముతో పాలిపోయి యుండుట మరియు కామెర్ల రోగముతో శరీరమంతా పచ్చబడుట అను వ్యాధులు) ఉదయకాలపు సూర్యుని రోహిత (అరుణ) కిరణములతో నిన్ను స్పష్టపరచి అరుణ తేజస్సుతో నీ శరీరమును నింపి వేయుదును. అనగా పుష్కలమైన ఎర్రటి రక్తమును నీలో ప్రవహింపజేయుదును.

**పరి త్వా రోహితైర్వర్ణైర్దీర్ఘాయుత్వాయ దధ్మసి।**
**యథాయమరపా అసదథో అహరితో భువత్ ॥**

**(అ.1.22.2)**

ఓ రోగీ! నిన్ను అరుణ కిరణ చికిత్సతో దీర్ఘాయుష్మంతుని చేయుదును. నీ శరీరము నుండి రక్తహీనతా కామెర్ల రోగములను సంపూర్ణంగా వెళ్ళగొట్టి నిన్ను అరుణ తేజస్సుగల రక్తముతో నింపివేయుదును.

సూర్యుని అరుణ కిరణములు - నారింజ రంగు కిరణములు సూర్యోదయ సూర్యాస్తమయ కాలములందు కొద్దిసేపు మాత్రమే లభించును. ఆ సమయము అందరికి వీలు పడకపోవచ్చును. అందుచే ఈ మంత్రములో పరమేశ్వరుడు అరుణ కిరణములతో కూడా పై వ్యాధులను పోగొట్టవచ్చునని చెప్పుచున్నాడు. నారింజరంగు అద్దము ద్వారా ప్రసరింపజేసిన కిరణములలో రోగిని ఉంచుట కాని, అట్టి రంగు సీసాలలో నీరుపోసి వాటిని ఎండలో పెట్టి ఆ నీటిని త్రాగించుట గాని, అట్టి రంగు గదులలో రోగిని పరుండబెట్టుట గాని చేయవచ్చును. లేదా అట్టి రంగు విద్యుత్ దీపముల కాంతిలో ఉంచుట కూడా చేయవచ్చును.

**యా రోహిణీర్దేవత్యా గావో యా ఉత రోహిణీః।**
**రూపం రూపం వయోవయస్తాభిష్ట్వా పరిదధ్మసి ॥**

**(అ.1.22.3)**

ఓ రోగీ! దివ్యగుణ యుక్త సూర్యుని యొక్క సహజ రోహిణీ

(నారింజరంగు) కిరణములతో గాని, లేదా కల్పిత రోహిణీ కిరణములతో గాని నీకు పూర్వ ఆరోగ్య స్థితిని కలిగింతును. రోగము ద్వారా కలిగిన బలహీనతను - ముసలితనమును తిరిగి పూర్వస్థితికి తీసుకువచ్చెదను.

**శుకేషు తే హరిమాణం రోపణాకాసు దధ్మసి।**

**అథో హారిద్రవేషు తే హరిమాణం ని దధ్మసి ॥**

**(అ.1.22-4)**

ఓ రోగీ! నీ సుఖమును హరించు సర్వరోగములను పోగొట్టుటకు సూర్యకిరణ ప్రసారాది బాహ్య చికిత్సలతోబాటు ప్రియ వాక్కులతో నిన్ను ఆనందముతో నింపివేయుదుము. నీ చిత్తమాలిన్యములను పోగొట్టుటకు రుచికర ఉపదేశములతో నిన్ను సంస్కరింతుము.

ఈ సూక్తమందలి ఈ చివరి మంత్రం వైద్యుని కర్తవ్యాన్ని నొక్కిచెబుతున్నది. శారీరక మాలిన్యములను తొలగించుటయే గాక మనోమాలిన్యాలను కూడా తొలగించవలసిన బాధ్యత వైద్యున కున్నది. ఇంద్రియ లోలుడు కాకుండా హితాహార విహారసేవిని చేయాలి. కామక్రోధాది మనో మాలిన్యాలను తొలగించాలి. భయం, శోకం ఆత్మన్యూనతాది బలహీనతలను తొలగించాలి. మూఢ నమ్మకాలను పోగొట్టి సరియైన ఆస్తికుని చేయడం కూడా అవసరమే. లేకున్న రోగము మరల తిరిగి రాగలదు. సంపూర్ణ నివారణ కాదు.

పై మంత్రములలోని 'గొ' పదమునకు **'గౌరాదిత్యో భవతి గమయతి రసాన్' (నిరుక్తము 2-24)** అను ప్రమాణము ననుసరించి సూర్యపరంగా అర్థం వ్రాయబడింది. **'గావ ఇతి రశ్మి నామ' (నిఘంటువు 1-5)** అను ప్రమాణమునుబట్టి గావః పదమునకు సూర్య కిరణములు అని అర్థం వ్రాయబడింది. సూర్యకిరణములు ప్రాణులన్నిటికి ప్రాణశక్తిని (నూతనోత్తేజమును) వైశ్వానరాగ్నిని (జఠరాగ్నిని) ఇచ్చునని ప్రశ్నోపనిషత్‌లో కూడ వర్ణించబడింది.

**ఆదిత్యో హ వై ప్రాణః... (ప్రశ్న 1-5)**

నిశ్చయముగా సూర్యుడే ప్రాణశక్తికి కేంద్రం

'స ఏష వైశ్వానరో విశ్వరూపః
ప్రాణోఽగ్ని రుదయతే, త దేతద్ ఋచాభ్యుక్తమ్

(ప్రశ్న 1-7)

ఈ సూర్యుడే లోకప్రసిద్ధుడగు వైశ్వానరుడు. తన తేజస్సుతో ప్రాణులలో శక్తిని నింపుచున్నాడు. అట్టి సూర్యుడు ఉదయించుచున్నాడు. ఋగ్వేదము కూడా ఇట్లే చెప్పుచున్నది.

**విశ్వరూపం హరిణం జాతవేదసం పరాయణం జ్యోతిరేకం తపంతమ్, సహస్రరశ్మిః శతథా వర్తమానః ప్రాణః ప్రజానా ముదయ త్యేష సూర్యః। (ప్రశ్న 1-8)**

విశ్వరూపుడును (సర్వ భోక్తృశక్తి మయుడును) హరిణుడును (హరణ శీల కిరణములు గలవాడును) దృక్ శక్తి నిచ్చువాడును, ప్రాణులన్నిటికి ఆశ్రయుడును, నిరంతరం తపించుచుండు వాడును, ఈ గ్రహ కుటుంబమునకు ఏకైక జ్యోతి ప్రదాతయు నగు సూర్యుడు తన వేయి విధములైన కిరణములతో ప్రాణులకు అనేక విధముల మేలు చేయ ఉదయించి వచ్చుచున్నాడు.

నేడు ఆధునిక అల్లోపతి వైద్యము చాలావరకు క్రిమి సిద్ధాంతముపైననే ఆధారపడి యున్నది. కంటికి కానరాని వివిధ సూక్ష్మక్రిములే 90 శాతం రోగాలకు కారణంగా కనుగొనబడింది. ఇది లూయీపాశ్చర్ కనుగొన్న క్రొత్త విషయం ఏమీ కాదు. అథర్వవేదంలో సూక్తాలకు సూక్తాలే వివిధ క్రిములను వర్ణించును. వాటిని సంహరించి రోగముల నివృత్తి చేయవలెనని ఆ మంత్రాలలో వైద్యులకు ఆదేశము కనబడును. దాదాపు 100కు పైగా రోగకారక క్రిముల పేర్లు అందు కనబడును. ఆ క్రిములు ఏయే మార్గాల ద్వారా శరీరంలో ప్రవేశించి రోగగ్రస్తము చేయునో కూడా వర్ణించబడింది. కొన్ని సూక్ష్మక్రిములు మనస్సును కూడా వికృతపరచునని వేదం చెబుతుంది.

ఆధునిక వైద్యం ఇంకా అంతవరకు పోలేదు. కుక్క, ఎలుక, పిల్లి మొదలగు జంతువుల కాట్ల వల్ల (వాటి ద్వారా సంక్రమించిన క్రిములవల్ల) కొందరిలో పిచ్చి ఎక్కుట జరుగుచున్నది. క్షయ మొదలగు కొన్ని వ్యాధులు మెదడులో కూడా వ్యాపించి మనస్సును వికృత పరచుచున్నవట,

కంప్యూటర్లను పాడుచేయు వైరస్‌ల వంటివి మెదడుకు వ్యాపించి మనో వికారాలకు కారణమగుచున్నవేమో! ఆలోచించవలసిన విషయం. అట్టి క్రిములకు ఈ క్రింది వేదమంత్రం 'మనోహనన' క్రిములని పేరు పెడుతుంది.

**క్రవ్యాదమగ్నే రుధిరం పిశాచం మనోహనం జహి జాతవేదః।**
**(అథర్వ -5-29-10)**

ఓ విద్వాంసులైన వైద్యులారా! శరీర మాంసమును తినివేయు (క్రవ్యాదిమ్) క్రిములను, రక్తమును హరించు (రుధిరమ్) క్రిములను, మనస్సును వికృతపరచు (మనోహనమ్) క్రిములను గుర్తించి వాటిని సంహరించు ఔషధములను కనుగొనుడు.

ఈ రోగకారక క్రిములకు రాక్షసః, పిశాచః, యాతుః, యాతుధానః, అసురః, క్రిమిదీ, గంధర్వాః, అప్సరః (నీటి ద్వారా ప్రవేశించునవి) అనే పేర్లు వేదాలలో కనబడతాయి. నేటి కల్పిత పురాణాలు వీటిని పెద్దపెద్ద భయంకరాకారాలతో గల మానవ దేహం వంటి ఆకారంగలవిగా వర్ణిస్తాయి. కాని అట్టి ఆకారాలుగల అసుర రాక్షసులు ఎవరూ ఉండరు. దయ్యాల వంటి అభూత కల్పనలు కూడా కాదు. అవి అన్నీ రోగాలను కలిగించే సూక్ష్మక్రిములే. సూక్ష్మదర్శినీ యంత్రం ద్వారా మాత్రమే కనబడే అతి చిన్న క్రిములు మాత్రమే. అయినా వాటికి వికృతమైన అవయవాలు 3,4 కండ్లు కలిగినవి ఉంటాయని అథర్వవేదం చెబుతుంది. వేదంలో ఇట్లే జ్ఞానం బీజరూపంలో ఉంది. వీటి చికిత్సకు 23 రకముల (ప్రాకృతిక శక్తుల మరియు ఔషధముల) సంకేతము వేదములలో కనబడుతుంది. అందు సూర్యుడు, అగ్ని, ఇంద్రుడు (విద్యుత్), మేఘము, మరుత్తు (గాలి) జలము అనునవి ప్రాకృతిక శక్తులు. మిగిలినవి ఖనిజములు, మూలికలు - ఈ విషయములను వివరముగా తెలుసుకొనగోరువారు ఆయుర్వేద వైద్య విద్వాన్ శ్రీ ముదిగొండగోపాలరావు (పెదపాడు - 534, 437 ప.గో. జిల్లా) గారి 'వేదములు ఆయుర్వేదము' అను పుస్తకములో 6, 7 ప్రకరణములు చదువగోరెదను.

మన విషయం సూర్య కిరణ చికిత్సగాన క్రిమిసంహారకములో సూర్యుని పాత్రను గూర్చిన వేద మంత్రాలను తెలుసుకుందాము.

**ఉద్యన్నాదిత్యః క్రిమీన్ హన్తు నిమ్రోచన్ హన్తు రశ్మిభిః ।**
**యే అన్తః క్రిమయో గవిః ॥ (అ.2.32.1)**

ఉదయించుచున్న సూర్యుడు తన కిరణములతో క్రిములను చంపును. అట్లే అస్తమించుచున్న సూర్యుని కిరణములు కూడా క్రిమిసంహారకములే. అవి భూమిపైన, లోపల ఉన్న క్రిములను చంపగలవు.

**విశ్వరూపం చతురక్షం క్రిమిం సారఙ్గమర్జునమ్ ।**
**శృణామ్యస్య పృష్టీరపి వృశ్చామి యచ్ఛిరః ॥ (అ.2.32.2)**

ఆ సూర్య కిరణములు ఏయే క్రిములను చంపగలవనగా - నానా విధ రూపములు గలిగిన 4 కండ్లు గల వాటిని, రకరకాల రంగులు గల వాటిని, తెల్లవాటిని సమూలముగా చంపును.

ఇట్టివే మరెన్నో క్రిముల వర్ణన ఈ తదుపరి మంత్రములలోను 8, 5 కాండములలోను కనబడును. ఇట్టి దృష్టాదృష్ట క్రిముల నన్నిటిని సూర్య కిరణములు చంపగలవని ఈ క్రింది మంత్రము సూచించును.

**ఉత్ పురస్తాత్ సూర్య ఏతి విశ్వదృష్టో అదృష్టహా ।**
**దృష్టాంశ్చ ఘ్నన్న దృష్టాంశ్చ సర్వాంశ్చ ప్రమృణన్ క్రిమీన్ ॥**
**(అ.5.23.6)**

విశ్వద్రష్టయైన సూర్యుడు కనబడునట్టి, కనబడనట్టి సర్వరోగ కారక క్రిములను చంపుటకు, తొలగించుటకు పూర్వ దిశలో ఉదయించి వచ్చుచున్నాడు.

నేడు అల్లోపతి వైద్యులు వాడే క్రిమిసంహారకములు (ఏంటిబైటిక్స్) కన్న వేదము సూచించే ప్రాకృతిక శక్తులు, వనౌషధ ఖనిజాదులు ఎన్నోవేల రెట్లు మేలు చేయును. ఏంటి బైటిక్స్ వల్ల రోగకారక క్రిములు చనిపోవుటతోబాటు మన శరీర జీవ కణములు కూడా కొన్ని చనిపోవును. అందుచే మనము బలహీనుల మగుదుము. ఆ బలహీనతను కనబడకుండా చేయుటకు ఆ మందులతోబాటు కొన్ని విటమిన్లు, టానిక్కులు వ్రాసి యిత్తురు. అయినా కొంత బలహీనత మిగిలియే యుండును. ఇంతేగాక అవి మన జీవశక్తిని బలహీనపరచును. దానివల్ల సహజ రోగ నిరోధక శక్తి తగ్గిపోవుచుండును. మందుల పైననే ఆధారపడి జీవన యాత్ర గడుపవలసి

యుండును. కాని ప్రాకృతిక చికిత్సల వల్ల వనౌషధ ప్రయోగముల వల్ల క్రిములు నశించుటయేగాక ధాతుశక్తి పెరుగును. రోగ నిరోధక శక్తి అభివృద్ధి చెందును. ఉత్సాహము, స్ఫూర్తి, సహజమైన ఆకలి జీర్ణశక్తులు పెరుగును. ఏంటిబైటిక్స్ వల్ల చెడు ఫలితములు కలిగే ప్రమాదం కూడా ఉంది. శాశ్వతమైన కొన్ని బాధలు కూడా రావచ్చు. అయినా వారు వాటిని సైడ్ ఎఫెక్ట్స్ (తోడుగా కలిగే ఫలితాలు) అని అందురే కాని బేడ్ ఎఫెక్ట్స్ (చెడు ఫలితములు) అనరు. రోగులు భయపడుదురని అట్లందురేమో! కనుక వాటిని అత్యవసర పరిస్థితులలో మాత్రమే ప్రయోగించుట మంచిది.

**అపచితః ప్ర పతత సుపర్ణో వసతేరివ ।**
**సూర్యః కృణోతు భేషజం చంద్రమా వో౽ పోచ్ఛతు ॥**
**(అ.6.83-1)**

మిక్కిలిగా బాధపెట్టు గండమాలాది గడ్డలారా! పక్షుల వలె మీరు దూరముగా ఎగిరిపొండు. సూర్యుడు - సూర్య కిరణములు మందుగా పనిచేసి మిమ్ము వెళ్ళగొట్టును - పగులగొట్టును.

చంద్రుడు సూర్య కిరణములు స్రావములను వెడలగొట్టును గాక!

సూర్య కిరణములను గడ్డలపై కేంద్రీకృతము చేసిన తొందరగా పక్వమై పగులును. నిరపాయకర శస్త్రచికిత్స యగును. చంద్రకిరణములు - వెన్నెల అంతర్గత స్రావములను సౌమ్యముగా స్రవింపజేసి తొందరగా రోగోపశమనమును కలుగజేయునేమో పరీక్షించవలసి యున్నది.'

**ఏన్యేకా శ్యేన్యేకా కృష్ణైకా రోహిణీ ద్వే ।**
**సర్వాసామగ్రభం నామావీరఘ్నీరపేతన ॥ (అ.6-83-2)**

ఈ మంత్రము గడ్డలలోని రకాలను చెప్పుచున్నది. ఒకటి - అనేక రంగులుగల గడ్డ మరొకటి తెల్లటి రంగు గలది. వేరొకటి నల్లని రంగు గలది. మరొకటి రెండు ఎరుపు లేదా గులాబీ రంగులు గలవి. వీటన్నిటిని రోగికి బాధ కలిగించకుండా పగులగొట్టి వాటిలోని చీము నీరు వెడలగొట్టబడును. (నీటికి 'నామ' అనే పేరు కూడా ఉంది. (నామ ఇత్యుదక నామ - ని.1-10)

**అ సూతికా రామాయణ్యపచిత్ ప్రపతిష్యతి ।**
**గ్లౌరితః ప్రప తిష్యతి స గలున్తో న శిష్యతి ॥ (అ.6-83-3)**

**వీహి స్వామాహుతిం జుషాణో మనసా స్వాహా ।**
**మనసా యదిదం జుహోమి ॥ (అ.6-83-4)**

మానవులను మిక్కిలిగా బాధించు వివిధ అవయవములలో వచ్చు ఓ గడ్డలారా! నేను మీకు సూర్య కిరణ ప్రభావితమైన జల క్షీర భోజనాదులను ప్రసన్నతతో అర్పించుచున్నాను. వాటిని సేవించి మీరు తొలగిపొండు. ఇది ఒక అలంకారిక వర్ణన. గడ్డలు మన మాట వినునని కాదు. వాటికి సూర్య చంద్ర కిరణములు తగిన సౌమ్యమైన ఔషధము లని తాత్పర్యము. చంద్రుని వెన్నెలను ప్రసరింపజేసిన జలాదులు కూడ బాధోపశమనము చేసి, రక్తములో కలిసిపోయిన విషములను స్రవింపజేయునని ఈ మంత్రములు చెప్పుచున్నవి. పరిశోధించవలసి యున్నది. కొన్ని ఆయుర్వేద ఔషధములను రాత్రంతా వెన్నెలలో నుంచి ప్రయోగించు విధానము కలదు. పంటలు చక్కగా పండుటకు సూర్య కిరణములే గాక చంద్ర కిరణముల అవసరం కూడా ఉందని శాస్త్రజ్ఞులు అంటున్నారు.

వెన్నెలలో ఓషధులు పుష్టివంతములు, శక్తివంతములు అవుతాయని **'పుష్ణామిచౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః' (గీత 15-13)**

భగవద్గీతలో కనబడును. అందుచే వ్రణములలోని స్రావములను **'చంద్రమాఽ వో ప్రోచ్చతు'** చంద్రుడు - చంద్ర కిరణములు వెడల గొట్టునని వేదం చెబుతున్నది. సూర్య కిరణములు కేవలము రక్తహీనత హృదయ గండమాల రోగములనే గాక అన్ని విధముల రోగములను పోగొట్టగలవు. 9వ కాండంలోని 8వ సూక్తము ఏ ఏ రోగములను పోగొట్టగలదో వివరించి చెప్పును.

**శీర్షక్తిమ్ శీర్షామయం కర్ణశూలం విలోహితమ్।**
**సర్వం శీర్షణ్యం తే రోగం బహిర్నిర్మంత్ర యామహే॥**
**(అథర్వ -9-8-1)**

ఓ రోగీ! నీ యొక్క తలనొప్పిని, పార్శ్వనొప్పిని, చెవిపోటును, రక్తహీనతను, సకల శిరోరోగములను (సూర్య కిరణ చికిత్సద్వారా) బయటకు నెట్టివేయుదుము.

ఈ విధముగా ప్రారంభించి 21 మంత్రములలో అనేక రోగములను

వర్ణించి చివరి 22వ మంత్రములో వీటన్నిటిని సూర్యకిరణ చికిత్స ద్వారా పోగొట్టగలమని వైద్యుల ప్రతిజ్ఞ కలదు. గ్రంథ విస్తర భీతిచే ఇచట చివరి మంత్రం ఒకదానిని మాత్రమే ఉదాహరించుచున్నాను.

**సం తే శీర్ష్ణః కపాలాని హృదయస్యచ యోవిధుః ।**
**ఉద్యన్నాదిత్య రశ్మిభిః శీర్ష్ణో రోగమనీన శో ఙ్గభేద మశీశమః ॥**
**(అథర్వ -9-8-22)**

ఓ రోగులారా! పైన వర్ణించిన మీ యొక్క వివిధ అవయవములలో ఏర్పడిన గడ్డలను (Absesses), కంతులను (Tumours), పగుళ్ళను (cracks, fissures, ulcers etc.) మరియు వివిధ ముఖ కపాల వ్యాధులను (E.N.T. Eye, Brain, Mouth etc.) ఉదయించుచున్న సూర్య కిరణములతో పోగొట్టగలము.

ఇట్టి భావమునే 6వ కాండము నందలి 52వ సూక్తము మరింత స్పష్టపరచుచున్నది. 3 మంత్రములుగల ఈ సూక్తమునకు సూర్యుడు దేవత. అనగా సూర్యుని విషయము (Subject) ఇందుగలదు.

**ఉత సూర్యో దివ ఏతి పురో రక్షాంసి నిజూర్వన్।**
**ఆదిత్యః పర్వతేభ్యో విశ్వదృష్టో అదృష్టహా ॥**
**(అ.6-52-1)**

కంటికి కనబడని రాక్షస రోగక్రిములను సంహరింప విశ్వద్రష్టయైన సూర్యుడు తన ఆదిత్య కిరణములతో తూర్పు పర్వతములపై నుండి ఉదయించి వచ్చుచున్నాడు.

**ని గావో గోష్ఠే అసదన్ ని మృగాసో అవిక్షత ।**
**న్యూ 3ర్మయో నదీనాం న్య దృష్టా అలిప్సత (6-52-2)**

గోవులు పగలంతా బయట తిరిగినను రాత్రికి గోశాలను చేరి విశ్రమించును. అట్లే మృగములు పగలంతా సంచరించి రాత్రికి ఏ గుహయందో విశ్రమించును. నదులలో గాలి తాకుడు వల్ల అప్పుడప్పుడు అలలు లేచినను కొద్దిసేపటికే క్షయించును. అట్లే ఎంత పెద్ద వ్యాధి యైనను వైద్యులకు అంతుబట్టక దాగియున్నను ఆ వ్యాధి సూర్య కిరణములతో తన ప్రభావమును కోల్పోవును - శాంతించును.

ఆయుర్దదం విపశ్చితం శ్రుతాం కణ్వస్య వీరుధమ్ ।
ఆభారిషం విశ్వభేషజీమస్యాదృష్టాన్ ని శమయత్ ॥

(అ.6-52-3)

రోగార్తునకు ఆయువు నిచ్చునదియు, బుద్ధిని వికసింప జేయునదియు, సర్వరోగ నివారిణియు నగు ఒక దివ్యౌషధమును - సూర్యకిరణ ఔషధమును నేను కనుగొంటిని. ఓ రోగులారా! భయపడకుడు ఆ సూర్య ఔషధము మీలోని కనబడని క్రిములను, వ్యాధులను కూడా పోగొట్టగలదు.

కీ.శే.పూజ్య పం.శ్రీపాద దామోదర సాత్వలేకర్ గారు తమ అథర్వవేద భాష్యములో ఈ ప్రకరణమునకు 'సూర్యకిరణ చికిత్సా' అని పేరు పెట్టి చాలా చక్కటి వ్యాఖ్యానము చేసిరి. మొదటి మంత్రములోని 'రక్షాంసి' అను పదమును నిర్వచించుచు 'రక్షాంసి - క్షరాంసి = శరీరమును క్షీణింపజేయు రాక్షసులు అనగా అట్టి రోగ కారక క్రిములు' అని వ్రాసిరి. రెండవ మంత్రమునకు గో మృగ అలల ఉపమానముతో ఎట్టి వ్యాధియైనా తప్పక శాంతించునని వ్యాఖ్యానించి రోగులకు ఆశాకిరణమును జూపిరి. ఈ జగత్తులో ఏది స్థిరము కాదు. అన్నీ అస్థిరములే. అందుచే రోగులు ఈ నశ్వర జగత్తులో నా వ్యాధి కూడా నశ్వరమే తప్పక నయము కాగల దని ఆశావాదులై ఉండాలని సూచించిరి.

మూడవ మంత్రములోని 'కణ్వ' పదమునకు 'రోగి బాధలను భరించలేక వివశుడై విలక్షణ శబ్దములతో రోదించు ఆర్తనాదము' అని అర్థం వ్రాసి యిట్లు వ్యాఖ్యానించిరి.

'అటువంటి దీనావస్థలో నున్న రోగి ఒకవేళ (విశ్వభేషజమును) సమస్త రోగ నిర్మూలన ఔషధమును సేవించినచో అతడు నిస్సంశయముగా రోగ విముక్తుడగును. ఈ మంత్రములలో సర్వరోగ నివారిణిగా ఏ ఔషధము చెప్పబడినదో అది మొదటి మంత్రములో సూచించిన సూర్యప్రకాశమే. సూర్య కిరణములే అట్టి విలక్షణ రూపములో మనచెంతకు వచ్చుచున్నవి. ఈ సూర్యప్రకాశములో ఎట్టి సామర్థ్యమున్న దనగా అది కనబడేవి కనబడనివియైన సమస్త రోగ కారక క్రిములను నశింపజేయును. ఎక్కడ సూర్య ప్రకాశ ముండునో అక్కడ రోగ జీవులు బ్రతకలేవు. ఇంతటి ప్రభావము సూర్య కిరణములలో నున్నది. ఈ వైజ్ఞానిక విషయమును దృష్టిలో నిడుకొని తన నివాస విహారాదులను సూర్య కిరణములకు

సన్నిహితము చేసుకొనినచో తప్పక ఆరోగ్య వంతుడగును. అనగా వీలైనంత తక్కువ వస్త్రములను ధరించి ఎండలో కూర్చొనుట వల్ల, తిరుగుట వల్ల లేదా పరుండుట వల్ల రోగములు దూరము కాగలవు. గృహములోనికి సూర్య ప్రకాశము వచ్చునట్లు చేసుకున్న గృహములు, వీధులు వెడల్పుగా నున్న గ్రామములు, నగరములు ఆరోగ్యదాయకము లగును. సూర్య కిరణములు ఎక్కువగా పడిన మూలికలు, ఔషధములు, ఆహారాదులు సేవించినను ఇట్టి ఆరోగ్య లాభము కలుగును. గోశాలలో కట్టివేసి ఉంచిన ఆవుపాల కన్న ఎండలో తిరిగి వచ్చిన ఆవుల పాలు మేలు చేయును. ఈ విధముగా పథక పూర్వకముగా సూర్య కిరణముల నుండి ఎక్కువ మేలు పొంద యత్నించవలెను' అని తమ భాష్యములో వివరించి చెప్పిరి. చికిత్సా ప్రకరణంలో మనం ఈ విషయాలలో మరింత స్పష్టంగా తెలుసుకొందాము. ఇక సంక్షిప్తంగా కొన్ని వాక్యాలను మాత్రం తెలుసుకొందాము.

**(1) సూర్యస్య భాగే అమృతస్య లోకే (అ.8.1.1)**

సూర్యునికి ఎదురుగా వచ్చు భూ భాగమునకు అందలి ప్రాణులకు అమృతశక్తి ప్రసరించును.

**(2) 'మాచ్ఛిత్థాః అస్మాల్లోకాదగ్నే సూర్యస్య సందృశః' (అ.8-1-4)**

ఆరోగ్య లాభమును బొందగోరువారు సూర్య ప్రకాశములో నుండుడు. దానిని విడువవద్దు.

**(3) 'సూర్యస్తే తన్వే శం తపాతి' (అ.8-1-5)**

సూర్య కిరణములు శరీరమునకు శాంతి నిచ్చును.

**(4) 'సప్త సూర్యస్య రశ్మయః' (అ.7-107-1)**

సూర్య కిరణములు సప్త విధములు.

**(5) 'తాః తే శల్య మసిస్రసన్ (అ.7.107.1)**

ఆ కిరణములు శల్య గాయములలోని విష పదార్థములను బయటకు ప్రవహింపజేయును గాక!

శల్య గాయములనగా ఆయుధముల వల్లగాని, ప్రమాదము వల్లగాని, తొందరపాటు వల్లగాని తగిలిన గాయములని అర్థం. వాటివల్ల గాయములు చీముపట్టి విషయుక్తములగును. దీనినే యిప్పటి పరిభాషలో సెప్టిక్ (septic)

tic) అయినదనుచున్నారు. ఇట్టి గాయములను మాన్పుటకు ఏ రంగులు అవసరం లేదు. కేవలం సామాన్య సూర్యకాంతి చాలు. ఈ విషయం రాబోవు ప్రకరణాలలో వివరంగా తెలిసికొందాం.

**(6) 'ఇన్ద్రే ని రూపా హరితా మిమిక్షిరే' (అ.20-30-3)**

సూర్యుని యందలి హరిత కిరణములే ఈ సుందర సృష్టిని దర్శింపజేయుచున్నవి.

**(7) 'సోమేన ఆదిత్యా బలినః' (అ.14-1-2)**

సోమునిచే ఆదిత్యులు (సూర్య నక్షత్రములు) బలమును పొందుచున్నవి. సోమమనగా శక్తినిచ్చు గొప్ప పదార్థమని అర్థము. ఆధ్యాత్మికార్థములో నిది పరమేశ్వరునకు, ఆధి దైవికార్థములో ప్రథమ వాయువైన ఉదజని (హైడ్రోజన్) వాయువుకు వర్తిస్తుంది. చంద్రుని కిరణములు బలదాయకములు గాన ప్రకరణమును బట్టి సోమపదం చంద్రునికి కూడ వర్తిస్తుంది.

**(8) 'సుషుమ్ణః సూర్యరశ్మిః చన్ద్రమా గంధర్వః'**

**(యజు. 18-40)**

ఉత్తమ సుఖమును కలిగించు సుషుమ్ణ నామక సూర్య కిరణములు చంద్రునకు ప్రకాశము నిచ్చుచున్నవి.

ఈ విషయమునే యాస్కుడు ఈ విధముగా వ్యాఖ్యానించెను.

**'అథాప్యస్య ఏకో రశ్మిః చంద్రమసం ప్రతి దీప్యతే ।**

**ఆదిత్యతోఽస్య దీప్తిర్భవతి ॥ (నిరుక్తం 2-6)**

**(9) అపాం రసమ్ ఉద్వయసం సూర్యే సన్తం సమాహితమ్।**

**అపాం రసస్యయో రాసస్తాంవో గృహ్ణో మ్యుత్తమమ్ ॥**

**(యజు. 9-3)**

**'అపాం రసమ్'** = నీటి యొక్క సారమైన ఉదజని వాయువు ఉత్కృష్టమైన జీవశక్తి. అది సూర్యునిలో అపారముగా ఉన్నది.**'అపాం రసస్య యో రసః'** = ఆ నీటిసారమైన ఉదజని నుండి తీయబడిన మరొక రసము = హీలియం వాయువు. అది కూడా పుష్కలము గానే ఉన్నది. ఈ పరివర్తన నుండి వచ్చినదే ఆ అపార సౌరశక్తి.

# వేదాలలో ఉషోదయ వైశిష్ట్యము

సూర్య కిరణాలు ఎట్లు ఆరోగ్య లాభమును చేకూర్చునో అట్లే ప్రభాత ఉషస్సులును ఆరోగ్యదాయకములే. సూర్య కిరణ చికిత్సలో ఉషస్సుల ప్రసక్తి ఎందుకని కొందరికి సందేహము కలుగవచ్చు. పగలు వెలుతురు, వేడి ఉండటం, రాత్రి చీకటి, చల్లదనం ఉండటం ప్రకృతి ధర్మం. కాని ఉషస్సులలో ఈ రెండిటి కలయిక కనబడుతుంది. ఉషోదయ వేళ సూర్యుడు ఉదయించకపోయినా కొద్దిగా వెలుతురు, వేడి ఉంటాయి. దీనికి కారణం సూర్యకిరణాల కలయికయే. అట్లే సాయం ఉషస్సులలో సూర్యుడు అస్తమించినా కొద్ది వెలుతురు వేడి ఉంటాయి. అప్పుడును సూర్యకిరణ ప్రభావమే కారణం. కాన, ఉషస్సులకు సూర్యునికి సూర్య కిరణాలకు సంబంధం ఉంది. ఆ సూర్య కిరణ సంబంధ ఉషస్సులు మన ఆరోగ్యానికి దోహదం చేస్తాయి. విశేషించి అవి మానసిక ప్రసన్నతను, ఉత్సాహమును, ఉన్నతిని కలిగించు విశాల భావాలను, ఏకాగ్రతను, ధార్మిక ప్రవృత్తిని కలిగిస్తాయి. ఉషోదయ వేళ పురుషార్థ పరుడైన వ్యక్తి అన్ని విధాల ఐశ్వర్యాన్ని పొందుతాడు. ఇది కవులకు, కళాకారులకు, విద్యార్థులకు, పరిశోధకులకు స్ఫూర్తినిచ్చును. పండితులకే కాక పామరులకు కూడా ఉల్లాసము నిచ్చును. క్రీడాకారులకు, వ్యాయామ ప్రియులకు నూతనోత్తేజము నిచ్చును. అయితే అప్పుల భారంలో మునిగిన వారు సోమరులైన పరాన్నభుక్కులు ఈ ఉషోదయ ఆనందాన్ని అనుభవించ లేరని వేదం చెబుతుంది. అట్టి దుర్గతి రాకుండా ఈ క్రింది విధంగా ప్రార్థన చేస్తూ పూర్ణ పురుషార్థం చేయుమంటుంది.

**పర ఋణా సావీరధ మత్కృతాని మాహం**
**రాజన్నన్యకృతేన భోజమ్ ।**
**అవ్యుష్టా ఇన్ను భూయసీ రుషాస**
**ఆ నో జీవాన్వరుణ తాసు శాధి ॥ (ఋ. 2-28-9)**

ఓ వరుణ దేవ! సృష్టి పరిపాలక! పరమేశ్వర! నేను చేసిన ఋణ భారం నుండి మరియు నాకొరకు ఇతరులచే చేయబడిన ఋణ భారం నుండి నన్ను విముక్తుని జేయుము. నేను ఇతరుల కష్టమును భుజింప నిచ్చగింపకుందును గాక! ఏలయన ఋణ భారముతో నున్న నాకు ప్రభాత ఉషస్సులు కాంతి

విహీనము లగుచున్నవి. నన్ను ఋణ విముక్తుని జేసి ఉషోదయ ఆనందమును గ్రోలజేయును.

ఉషస్సులు సత్త్వగుణ ప్రేరకము లగుటచే వ్యక్తి బుద్ధి నిర్మలమై అతడు ఆత్మ పరమాత్మలను గురించి, వేద శాస్త్రాలలో గల సూక్ష్మవిషయాల గురించి ఆలోచించగలుగును. యోగాభ్యాసము ( ధ్యానాభ్యాసము) చేయువారికిది మిక్కిలి అనుకూల సమయము.

అందుచేతనే ఋషులు సంధ్యా సమయంలో సంధ్యోపాసన (ఈశ్వర స్తుతి ప్రార్థనోపాసనలు) చేయవలెనను విధాన మేర్పరచిరి. సంధ్యా సమయమనగా నక్షత్రాలు అదృశ్యమై నప్పటి నుండి సూర్యుడు ఉదయించు వరకు ఉండుకాలము. ఇది ప్రాతః సంధ్య (రాత్రిం దివములకు సంధి కాలము) మరొక మాటలో ప్రభాత ఉషోదయ వేళ.

ఉషాదేవి ఎవరో కాదు. మన సూర్యుని తల్లియే. ఆమె ముందు నడుచుండగా తల్లి చేయి పట్టుకొని బాల భాస్కరుడు వెంబడించి వచ్చునని వేదము చెప్పును. ఇది ఒక ఆలంకారిక వర్ణన మాత్రమే. ఉషాదేవి బాలభాస్కరులు మాతాపుత్రులు - స్త్రీ పురుషులు కారు. దివ్యగుణములతో విరాజిల్లు అరుణ భాస్కరుని గన్న ఆ ఉషామాత ఎంతటి దివ్య గుణములు కలదో ఉషా సూక్తములలో పరమేశ్వరుడు వర్ణించి చెప్పినాడు. నాలుగువేదాలలోను ఉషా సూక్తములు చాలానే కలవు. అన్నిటిని వ్రాయుట అసాధ్యమే. మచ్చుకు కొన్ని మంత్రాల అర్థం వ్రాయ ప్రయత్నింతును.

ఇదం శ్రేష్ఠం జ్యోతిషాం జ్యోతిరాగా చ్చిత్రః
ప్రకేతో అజనిష్ట విభ్వా।
యథా ప్రసూతా సవితుః సవాయ
ఏవా రాత్ర్యుషసే యోనిమారైక్ ॥

(ఋగ్. 1-113-1)

ఓ మానవులారా! జ్యోతులలోనే శ్రేష్ఠ జ్యోతి స్వరూపిణి యైన ఉషాజ్యోతి తూర్పున ప్రకటమగుచున్నది. అది తన విలక్షణమైన చిత్ర విచిత్రమైన ప్రకాశముతో ప్రకృతిని శోభాయమానము చేయుచున్నది. ఏ విధముగా సూర్యునిజన్మకు రాత్రి కారణమగుచున్నదో అట్లే ఉషస్సుల రాకకు

కూడా అదే కారణము. సూర్య పుత్రునితో వచ్చుచున్న ఉషస్సు కొఱకు రాత్రి తన స్థానమును వీడి తొలగిపోవును.

**రుశద్వత్సా రుశతీ శ్వేత్యాగాదారైగు కృష్ణే సదనాన్యస్యాః।**
**సమాన బన్ధూ అమృతే అనూచీ**
**ద్యావా వర్ణం చరత ఆమినానే ॥ (ఋగ్. 1-113-2)**

దివ్య తేజోమయమైన ఉషామాత తన తేజస్వరూపుడైన బాలభాస్కరునితో అరుదెంచినది. అట్లే ఉషామాత కొరకు రాత్రి తన స్థానమును విడిచిపెట్టినది. ఉషారాత్రులిద్దరు బంధువులే. అక్కచెల్లెండ్రే. వీరిద్దరు అమరులు. క్రమముగా ఒకరి తరువాత మరొకరు ఈ బ్రహ్మాండమును ప్రకాశింపజేయుటకై వచ్చుచునే ఉందురు.

ఈ విధముగా ప్రారంభించిన ఈ 20 మంత్రములలో ఉషాదేవి వల్ల కలుగు వివిధ ప్రయోజనములు వర్ణింపబడినవి. అందు ముఖ్యమైన కొన్ని వాక్యములను మాత్రము వ్రాయుట జరుగుచున్నది.

అక్కాచెల్లెండ్రైన ఉషారాత్రుల మార్గమొక్కటే. ఆ మార్గము అంతము లేనిది. ఈశ్వరాజ్ఞా బద్ధులై క్రమముగా ఒకరి వెనుక మరొకరు వచ్చుచునే యుందురు. వీరిద్దరు ఆదర్శ సోదరీమణులు. పరస్పర విరుద్ధ రంగులు కలవారైనా వీరిద్దరు సఖ్యత గలిగి యుండువారు. ఒకే లక్ష్యము కలవారు. వీరు ఎప్పటికి ఒకే స్థానమున ఉండరు. పయనించుచునే యుందురు. ఒకరి కార్యమునకు మరొకరు అడ్డురారు. (ఈ విధముగానే అక్కచెల్లెండ్రు, అన్నదమ్ములు అన్యోన్యానురాగములతో ఆదర్శంగా ఉండాలని ఉపదేశము.)

ఉషాదేవి (**సూనృతానాం నేత్ర**) మానవులను సత్కర్మల యందు ప్రేరేపించు నాయిక. వారిని నిద్రలేపి ద్వారములను తెరిపించి పురుషార్థ పరులను జేయును. (**రాయః నః అక్ష్యత్ ఉ**) మనను ఐశ్వర్యవంతులను జేయును. (**ఇష్టయే రాయే**) యజ్ఞాది సత్కర్మలు చేయుటకు ధనవంతులగుటకు ప్రేరేపించును. (**దభ్రం పశ్యద్భ్యః విచక్షే**) దృష్టిమాంద్యము గలవారికి దృక్శక్తిని పెంచును. (**అర్థం ఇవ ఇత్యై త్వం**) నీవు కోరుకున్న లక్ష్యమునకు నిన్ను చేర్చును. శుభ్ర వస్త్ర ధారిణియై లోకములను ప్రకాశింప ద్యులోక పుత్రియైన ఉషాదేవి వచ్చుచున్నది. ఆమె

నిత్య యౌవని. (విశ్వస్య పార్థివస్య వస్వ ఈశానా సుభగే ఉషః) పృథివి యందలి సమస్త ఐశ్వర్యములకు స్వామిని, ఉత్తమ భాగ్యశాలిని. తను ప్రకాశించుచు (జీవం ఉదీరయన్తీ) ప్రాణుల జీవితాలకు ఉన్నతిని కలిగించును. (కం చన మృతం బోధయన్తీ) మృతుని వలె పడియున్న వానిని నిద్రలేపును. రోగముతో కదలలేక పడియున్నవానిలో కూడా జాగృతిని, ఆశను చిగురింపజేయును.

(యక్ష్యమాణాన్ మానుషాన్ యత్ అజీగః) నిత్యాగ్నిహోత్రులను నిద్రలేపి దేవతలకు ప్రియమైన యజ్ఞకర్మను చేయించును. ప్రాణు లన్నిటికి మేలు చేయు ఆ శుభకర్మ ఆమె చేసినట్లే కదా! దివ్యమైన ఆ ఉషాదేవి కొద్దిసేపు మాత్రమే ఉన్నను ప్రతిదినం కొత్తదనంతో మరల మరల వచ్చుచునే యుండును. మనకు ఎన్ని ఉషస్సులు చూచే భాగ్యమున్నదో? ఆమె ఎట్టిదన-

**యావయద్ ద్వేషా ఋతపా ఋతేజాః**
**సుమ్నావరీ సూనృతా ఈరయన్తీ।**
**సుమంగలీర్బిభ్రతీ దేవవీతి**
**మిహా ద్యోషః శ్రేష్ఠతమా వ్యుచ్ఛ ॥ (ఋగ్.1-113-12)**

శత్రువులను దూరము చేయగలది. సత్యమును పాలించుచు సత్య ప్రచారము చేయునది, ప్రాణుల సుఖమును వృద్ధి చేయునది, మధురభాషిణి, అందరి కల్యాణమును కోరునది, దేవత లన్నిటికి ప్రియమును కలిగించు యజ్ఞము చేయునదియు నగు ఉషాదేవి నేడు ఇచ్చట ప్రకాశించునుగాక!

ఈ మంత్ర భావమేమనగా - ఉషా ప్రకాశము రాగానే శత్రువులు చోరులు పలాయన మగుదురు. ఛల కపట మోసాదులు తొలగిపోయి సత్యము బోధపడును. ఆమె తనవెంట తీసుకొని వచ్చు సూర్యునితో లోకమునకు కల్యాణ మగును. యజ్ఞాది సత్కర్మలు జరుగును. మానవులు పురుషార్థపరులై ఉన్నతిని బడయుదురు. అందుచే ఉష శ్రేష్ఠమైనది.

మహర్షి దయానందుడు వాచక లుప్తోపమాలంకారముతో ఈ మంత్రము ఉత్తమ విదుషీ స్త్రీలవల్ల కలిగే ప్రయోజనాలను వివరించుచున్నదని వ్రాసిరి. విదుషీ స్త్రీ ఉత్తమ సంతతిని బడసి వారిని శత్రుంజయులుగా, సత్యవాదులుగా, సత్య ప్రచారకులుగా, యజ్ఞానుష్ఠాన పరులుగా, లోక కల్యాణమునకై శ్రమించు వారిగా తీర్చిదిద్దవలెనని

ప్రేరేపించిరి. 'ఉషా' దేవతగల మంత్రములన్నిటికి ఋషి దయానందుడు స్త్రీలు పొందవలసిన ప్రేరణగురించియే వ్యాఖ్య వ్రాసినాడు.

ఈ సూక్తము ఇట్లే మరెన్నో దివ్య గుణములను వర్ణించి చివరగా యిట్లు హెచ్చరించుచున్నది.

**'యచ్చిత్రమప్న ఉషసో వహన్తి జానాయ శశమానాయ భద్రమ్॥' (ఋ.1-113-20)**

ఏ విలక్షణ విశిష్ట ధనము ఉషాదేవి వద్ద ఉన్నదో అది యజ్ఞాది సత్కార్మలు చేయువారికే లభించును.

అనగా ఉషోదయ వేళ అగ్నిహోత్ర దాన ధర్మాది సత్కార్మలు ఆచరించి దేని కొరకు పురుషార్థము చేయుదురో అది వారికి లభించును. మిగిలిన వారికి అది లభించదని అర్థం.

ఇదే ప్రథమ మండలములోని 123, 124వ సూక్తములును ఉషాసూక్తములే. నాలుగు వేదాలలో ఇట్టి ఉషాసూక్తములు, ఉషదేవతగా గల మంత్రములు లెక్కించుట కష్టమే. అన్నిటికి అర్థం వ్రాయుట అసాధ్యమే. కాన, ఈ విషయము నింతటితో విడచి ముందుకు పోదము రండు.

**"పరా ఋణా సావీరధ మత్కృతాని మాహం రాజన్నన్యకృతేన భోజమ్।**
**అవ్యుష్టా ఇన్ను భూయసీ రుషాస ఆ నో జీవాన్ వరుణ తాసు శాధి॥**

**(ఋ. 2-28-9)**

ఓ వరుణ దేవ ! ప్రపంచ పరిపాలక పరమేశ్వరా ! నేను చేసిన ఋణ భారముల నుండియు నా కొరకు నితరులచే జేయబడిన ఋణ భారముల నుండియు నన్ను విముక్తుని జేయుము. నేను ఇతరుల కష్టార్జితమును భుజింప నిచ్ఛగింపకుందును గాక! ఋణభారముతో ఉన్న నాకు ప్రభాత ఉషఃకాంతులు కాంతి విహీనము లగుచున్నవి. ఓ దేవ ! నన్ను ఋణ విముక్తుని జేసి ప్రభాత ఉషస్సుల ఆనందమును గ్రోల జేయుము.

# అద్భుత సూర్యకిరణాలు - అపార సౌరశక్తి

పరమేశ్వరుని ఈ అద్భుత సృష్టిలో కోటానుకోట్ల సూర్యులున్నాయి. ఒక్కొక్క సూర్య కుటుంబానికి ఒక్కొక్క బ్రహ్మాండమని పేరు. బ్రహ్మాండాలు అసంఖ్యాకం. కాన పరమేశ్వరుని అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుడని అంటారు. మన బ్రహ్మాండ (సూర్య కుటుంబ) నాయకుడైన సూర్యుని గురించి క్రిందటి ప్రకరణాలలో కొంత తెలిసికొన్నాము. సూర్య కిరణాల గురించి, సౌరశక్తి గురించి కూడా కొన్ని విషయాలు తెలిసికొన్నాము. మరికొంత స్పష్టంగా ఇక్కడ తెలుసుకుందాము.

సూర్యుని నుండి ముఖ్యంగా మనకు ఉష్ణము, ప్రకాశము, శక్తి అను మూడు అద్భుత శక్తులు లభిస్తాయి. అందులో మొదటిది ఉష్ణం. సూర్యుని నుండి ఉష్ణం లభించకుంటే 24 గంటలలో వాతావరణంలోని నీరంతా మంచుగా మారిపోయి మంచు వర్షం కురిసి భూమంతా మంచుతో కప్పుకుపోయేది. 72 గంటలలో సమస్త ప్రాణి జాతులు మరణించి ఉండేవి. మనకు కావలసిన ఉష్ణ శక్తంతా సూర్యుని నుండే లభిస్తున్నది. రెండవది ప్రకాశం. ఇది లేకుంటే మనమంతా అంధకారంలో పడి మరణించేవారం. మూడవది శక్తి. ఇది ఆహార రూపంలో మనకు లభిస్తున్నదంటే అది సూర్యుని వల్లనే. ఈ మూడింటితో బాటు విద్యుత్ కూడా సూర్యుని నుండి లభిస్తున్నదని వేదం చెబుతుంది.

**త్రిస్రోద్యావః సవితుర్ద్వా ఉపస్థాం**
**ఏకా యమస్య భువనే విరాషాట్ ।**
**ఆణిం న రథ్యమమృతాధి తస్థురిహ**
**బ్రవీతు య ఉ తచ్చికేతత్ ॥ (ఋ. 1-35-6)**

పరమేశ్వరుడు సూర్యుని నుండి 3 దేవతలను సృష్టించెను. అవి ఏవి అనగా అగ్ని, ప్రకాశము, విద్యుత్. అందు రెండు (అగ్ని, ప్రకాశములు) భూమిని చేరును. మూడవదైన విద్యుత్(**యమస్య భువనే విరాషాట్**) గాలిలో (వాతావరణంలో) ఉంటుంది. అదే గ్రహ ఉపగ్రహము లన్నిటిని రథములవలె నడిపిస్తున్నది. కనుక ఓ మానవులారా! మీరు పరస్పరం ఆలోచించుకొని అంతరిక్షములోని ఆ విద్యుత్‌ను పొందుడు. (మనం విడిగా 'శక్తి' ఊర్జ అనే మూడవది అగ్నిలో అంతర్భాగమే).

మహర్షి దయానందుడు క్రీ.శ. 1874లోనే ఈ వేదమంత్ర ఆధారంగా సూర్యుని నుండి విద్యుత్‌ను పొందవచ్చని తన వేద భాష్యంలో వ్రాసాడు. కాని, వైజ్ఞానికులు నూరు సంవత్సరాల తరువాత క్రీ. సం. 1973 నుండి సూర్యునినుండే నేరుగా విద్యుత్‌ను పొంది దూరవాణి యంత్రాలను (టెలిఫోన్లు) నడుప గలుగుతున్నారు.

ఋగ్వేదంలోనే మరొక చోట :

**తరణిర్విశ్వ దర్శతో జ్యోతిష్కృదసి సూర్య।**
**విశ్వమాభాసి రోచనం॥ (ఋ.1-50-4)**

వేదం సూర్య కిరణములలో ప్రకృతిని శోభాయమానము చేయు వివిధ ప్రకాశములు, ఉష్ణము, విద్యుత్ ఉన్నవని చెబుతుంది. కాన, వీటిని గురించి మనం కొంత వివరంగా తెలిసి కొందాము.

## ఉష్ణము

ఉష్ణము, ప్రకాశము (7 రంగులు), శక్తి, విద్యుత్ అని వేరు వేరుగా చెప్పుకునే యివి అన్నీ కూడా సూర్యుని నుండి విడుదలయ్యే కాస్మిక్ రేస (Cosmic Rays) యొక్క వివిధ రూపాలే. మనం క్రిందటి ప్రకరణంలో సూర్య గర్భంలో 1 కోటి 40 లక్షల డిగ్రీల ఉష్ణోగ్రత ఉంటుందని తెలుసుకున్నాం. ఆ వేడికి హైడ్రోజన్ అణువులు విడిపోయి హీలియం వాయువుగా మార్పు చెందుతాయి. ఆ మార్పు చెందేటప్పుడు అతి తీవ్రమైన కాస్మిక్ రేస విడుదలౌతాయి. వీటితో బాటు కొన్ని గామా కిరణాలు, కొన్ని ఎక్స్‌రే కిరణాలు విడుదలౌతాయి. ఆ ప్రచండ తాపమును నిరోధించుటకు పరమేశ్వరుడు సూర్యునిలో ఏరులేటాన్ అయినోస్ఫియర్ క్షేత్రాలను సృష్టించాడు. అందలి నైట్రోజన్ వాయు అయానులు వేడిని చాలావరకు నిరోధిస్తాయి. అందుచే సూర్యోపరితలం చేరేటప్పటికి ఉష్ణోగ్రత 6000 డిగ్రీలకు తగ్గిపోతుంది. ఆ తదుపరి రోదసిలో 50 కోట్ల 30 లక్షల మైళ్ళ ప్రయాణం చేసేసరికి మరికొంత తగ్గిపోతుంది. ఇంతేగాక భూవాతావరణ పైభాగంలో సూర్య కిరణాల ప్రభావం వల్ల 3 ఆక్సిజన్ అణువులు కలిసి ఒక ఓజోన్ (03) వాయు కణంగా మారుతుంది. ఆ ఓజోన్ ఒక పొరగా ఏర్పడి భూమి చుట్టూ ఒక గర్భసంచిగా ఏర్పడుతుంది. అది మిగిలిన

ప్రమాదకరమైన కిరణాలను వెనుకకు త్రిప్పి కొడుతుంది. వేడిని కూడా చాలావరకు పీల్చి వేసుకుంటుంది. ఈ ఓజోన్ పొరను గురించి వేదం ఈ విధంగా చెబుతుంది.

**మహత్ తదుల్బం స్థవిరం తదాసీద్**

**యేనా విష్టితః ప్రవివేశిథాపః (ఋ. 10-51-1)**

'స్థూలమైన పెద్ద గర్భసంచి వంటి వాయుపొర ఒకటి భూమికి రక్షణ కవచంగా ఉన్నది. అది సూర్యతాపాన్ని కొంత తగ్గించి - కొంత చల్లబరచి భూమిపైకి పంపుతున్నది'. అథర్వవేదం ఈ పొరను'' **తస్యేత జాయమానస్యో ఆసీద్ హిరణ్యయః॥** (అ. 4-2-8)'' హిరణ్యయ పొరగా వర్ణిస్తుంది. అనగా పరమేశ్వరుడు భూమిపై నున్న ప్రాణి జాతులను రక్షించుటకు పెద్ద ఓజోన్ సంచిని ఏర్పాటు చేసినాడని భావం.

ఈ మధ్య వాతావరణ కాలుష్యం ఎక్కువగా పెరిగిపోవుట వల్ల ఈ ఓజోన్ పొరలో రంధ్రాలు ఏర్పడటం జరుగుతున్నదని శాస్త్రజ్ఞులు హెచ్చరిస్తున్నారు. అంటార్కిటికా ప్రాంతంలో చాలా పెద్ద (అమెరికా సంయుక్త రాష్ట్రాలంత) రంధ్రం ఏర్పడిందట. అర్కిటిక్ ప్రాంతంలో కూడా రంధ్రాలు ఏర్పడుతున్నవట. పరిశ్రమల నుండి ఏర్పడే కాలుష్యం, పెట్రోలు వాహనాలతో ఏర్పడే కాలుష్యం, ముఖ్యంగా రిఫ్రిజిరేటర్స్‌లో ఉపయోగించే 'క్లోరోఫ్లోరో' కార్బన్ల వల్ల ఏర్పడే కాలుష్యం అన్నీ కలిసి ఓజోన్ పొరను క్షీణింపచేస్తున్నాయని వైజ్ఞానికు లంటున్నారు. ఈ పొర క్షీణిస్తే సూర్యుని నుండి వెలువడే అతి నీలలోహిత కిరణాల (అల్ట్రావైలెట్ కిరణాల) ప్రభావం తీవ్రమై నీటిలో నివసించే జల చరాలకు ప్రమాదం వాటిల్లవచ్చు. పంటల దిగుబడి తగ్గుతుంది. వివిధ చర్మ వ్యాధులు, చర్మ కాన్సర్ రావచ్చు. మానవులలో రోగ నిరోధక వ్యవస్థ దెబ్బ తింటుంది. చూపు మందగిస్తుంది. అంధత్వం కూడా రావచ్చు. కనుక ఆ పొరను కాపాడుకోవడం మన అందరి బాధ్యత. నాగరికత పేరుతో కృత్రిమ జీవనాన్ని గడుపుతూ ప్రకృతి సమతౌల్యతను భంగపరచి ప్రమాదాన్ని కొని తెచ్చుకోవడం మంచిది కాదు. సహజ వనరులతోనే సంతృప్తి చెందడం మంచిది.

తదుపరి భూ వాతావరణ పొర ఉష్ణాన్ని మరికొంత తగ్గిస్తుంది. భూమిపై నున్న జలము (సముద్రాదులు), వృక్షములు, పంట పొలాలు,

పచ్చిక బయళ్ళు మరికొంత ఉష్ణాన్ని పీల్చుకుంటాయి. ఈ విధంగా సూర్యోపరితలం పై 6000 డిగ్రీలు గల ఉష్ణం మన దగ్గరకు వచ్చేటప్పటికి ఎక్కువలో ఎక్కువ 50 డిగ్రీలకు తగ్గిపోతుంది. అప్పుడు అవి దివ్యమై మనకు మేలు చేస్తుంది.

ఇప్పుడు కూడా మనం సూర్యుని నుండి ఉష్ణ శక్తిని పొందవచ్చని వేదం చెబుతుంది.

**క్రత్వా దక్షస్య తరుషో విధర్మణి దేవాసో అగ్నిం జనయన్త చిత్తిభిః।**
**రురుచానం భానునా జ్యోతిషా మహామత్యం న వాజం సనిష్యన్ ఉపబ్రువే॥**
**(ఋ. 3-2-3)**

విజ్ఞాన వేత్తలు అనేక ఇంధనముల ద్వారా అగ్నిని ఉత్పన్నము చేయుచు జనుల కష్టములను ఇబ్బందులను దూరము చేయుదురు. విశ్వాస పూర్వకముగా చెప్పుచున్నాను. (**భానునా జ్యోతిషా**) సూర్య కిరణముల నుండి తేజస్సు గొప్ప శక్తివంతమైన, (**అత్యన్**) గుణములను (**అశ్విక శక్తిని**) (**సనిష్యన్**) పొందగలరు.

ప్రాచీన కాలంలో అశ్వ, అత్యన్ పదాలు శక్తికే వాడబడేవి. తదుపరి అశ్వములు శక్తి వంతములు, వేగ వంతములు గాన ఆ పదములు వాటికి వాడుట జరుగుతున్నది. ఇప్పటికీ యంత్రాల శక్తులను గణించుటకు అశ్విక శక్తి (Horse Power) అని వాడుచున్నారు.

భూమి కన్న 13 లక్షల రెట్లు పెద్ద గోళమైన సూర్యోపరితలంపై ప్రతి సెకనుకు 60 డిగ్రీల అశ్విక శక్తి తయారై విస్తరింప బడుతోంది. ఆ అపార శక్తిలో కేవలం 1/220 కోట్ల వంతు మాత్రమే భూమికి చేరుకుంటున్నది. అయినా ప్రతి సెకనుకు 270 కోట్ల రూపాయలు విలువగలదై ఉంటుందన్నారు విజ్ఞాన వేత్తలు. అందుచే సూర్యుని నుండి ఉష్ణ శక్తిని పొందే ప్రయత్నాలు చేస్తున్నారు. సోలార్ హీటర్లు, సోలార్ కుక్కర్లు మొదలైనవి తయారు చేస్తున్నారు. ఎంత మాత్రం వాతావరణ కాలుష్యం జరుగని ఉష్ణ శక్తిని మనం సూర్యుని నుండి పొందవచ్చు. అందుకనే వేదం దీనిని దివ్యమైన ఉష్ణశక్తి అంటుంది. అటి ఉష్ణ శక్తిని మనం విద్యుత్‌గా కూడా మార్పుచేసి నిల్వ చేసుకోవచ్చు. ఆ విషయం ముందు ప్రకరణంలో తెలిసి కొందాము.

# ప్రకాశము

సూర్యుని నుండి విడుదలయ్యే కిరణాలలో మనం కొన్నిటినే చూడగలం. కొన్నిటిని చూడ లేము. వాస్తవముగా తరంగాలన్నీ ఒకటే అయినా వాటి తరంగ దీర్ఘతలను బట్టి వాటిని వేరువేరుగా వర్గీకరించ వలసి వస్తుంది. వాటివాటి గుణాలు కూడా వేరు వేరుగానే ఉంటాయి. ఆధునిక విజ్ఞానం వాటి క్రమాన్ని ఈ విధంగా పేర్కొంటుంది.

**కిరణాల పేరు**

1) కాస్మిక్ కిరణాలు
2) గామా కిరణాలు (రేడియం నుండి విడుదలైనవి)
3) ఎక్స్‌రే కిరణాలు (ఇవి ఎముకలలో నుండి గట్టి ధాతువుల నుండి కూడా ప్రసరించ గలవు)
4) అల్ట్రా వైలెట్ కిరణాలు
5) రంగు కిరణాలు (ఏడు) - ఎఱుపు రంగు,
నారింజ రంగు, పసుపు రంగు,
ఆకుపచ్చ రంగు, నీలము రంగు,
గాఢ నీలము (Indigo), వైలెట్ (నీలం వంకాయల రంగు)

**సాధారణ కిరణాలు** (చిత్రములు తీయుటకు ఉపయోగపడును).

1) ఇన్‌ఫ్రారెడ్
2) హార్టిజన్ కిరణాలు
3) విద్యుత్ ప్రభావ కిరణాలు
4) వైర్‌లెస్ (ఆకాశ వాణి) కి సంబంధించిన కిరణాలు.
5) మందగతి గల కిరణాలు.

ఇక ఒక్కొక్క దాన్ని గురించి సంక్షిప్తంగా తెలిసి కొందాము.

1) కాస్మిక్ కిరణాలు: వీటికి తరంగాలని పేరున్నా యివి తరంగాలు కావు. కోటానుకోట్ల ఆవేశ శక్తితో కూడిన అణువులు. వీటిని మానవులు నిర్మించలేరు. ప్రపంచ విజేత కావాలని ప్రయత్నించిన జర్మనీ నియంత హిట్లర్ వీటిని ఉత్పన్నం చేయగల యంత్రాన్ని కనుగొనాలని చాలా ప్రయత్నించాడు. దానితో సర్వశత్రు నాశనం చేయాలనుకొని కలలు గన్నాడు. కాని ఆ ప్రయత్నం ఫలించకుండానే ఆత్మహత్య చేసుకుని మరణించవలసిన దుర్గతి పట్టింది. ముందు విజ్ఞాన శాస్త్రం వీటిని కూడా నిర్మించగలదేమో వేచి చూడాలి.

ఇప్పుడు రేడియం పూసిన అంకెలు గల గడియారాలు వస్తున్నాయి. వీటి నుండి కూడా యిట్టివే కిరణాలు (రేడియేషన్స్) వస్తుంటాయట. ఇవి ఒక పరిమితికి మించి మానవ శరీరంలో ప్రవేశిస్తే జన్యు సంబంధమైన వ్యాధులు వచ్చే ప్రమాదం ఉందని వైద్యులు హెచ్చరిస్తున్నారు. ఈ కాస్మిక్ కిరణాలు అత్యంత తీవ్రంగా అన్నిటిలో చొచ్చుకు పోగల (Highly Penetrating) అతి ప్రమాదకర కిరణాలు. ఇట్టి భయంకర కిరణాలు కన్న ఓజోన్ పొరగుండా చొచ్చుకు వచ్చినప్పటికి భూవాతావరణాన్ని, అయస్కాంత క్షేత్రాన్ని ఢీకొట్టుకుని వెనుకకు మరలి పోతాయి. కాని ధ్రువ ప్రాంతాలలో ఆ క్షేత్రాలు తక్కువగా ఉంటాయి. కనుక వాటిని త్రిప్పికొట్టలేక పోవుటచే అక్కడ వాటి ప్రభావం కొంత ఉండవచ్చునని వైజ్ఞానికులంటారు.

ఈ కిరణాలు పాలపుంత (గెలాక్సీ) లో అంతట అన్ని వైపుల అత్యంత వేగంగా (కాంతి వేగంతో సమానంగా) ప్రయాణిస్తుంటాయి. కొన్ని మరింత శక్తివంత మౌతుంటాయి. వీటిని ప్రైమరీ కాస్మిక్ కిరణాలంటారు. ఇందులో కొన్ని చిన్నవి భూవాతావరణ పైపొరలోకి చొచ్చుకు వచ్చి గాలిలోని అణువులతో కలిసి సెకండరీ కాస్మిక్ కిరణాలుగా మారతాయి. వీటిలో 1% శాతం కిరణాలు మరింత క్రిందికి దిగి భూమిపైకి వస్తాయి. ఇవి ప్రమాదకరమైనవి కాదు. ఈ ప్రమాద రహిత కాస్మిక్ కిరణాలు నిముషానికి సుమారు 600 మన శరీరంలో నుండి ప్రసరిస్తుంటాయట. అయినా మనకెట్టి హానీ కలుగదు. ఇది పరమేశ్వరానుగ్రహం. కాని, మానవుడు నిర్మించేవే ప్రమాదకరం.

2) గామా కిరణాలు (Y-Rays): వీటి తరంగ దీర్ఘత 0.0001 నుండి 0.1 nm ఇవి ఫొటోగ్రాఫిక్ ప్లేటుపై రసాయనిక మరియు అయినైసేషన్ క్రియలను జరుపగలుగుతాయి. ఇవి గొప్ప వేదన క్షమత కలిగి యున్నప్పటికి ఆవేశ రహితంగా ఉంటాయట. ఇవి విద్యుదయస్కాంత వికిరణాలు (Rediations), కనుక కాంతి వేగంతో ప్రయాణం చేస్తాయి. వీటి తరంగ దైర్ఘ్యం ఎక్స్ కిరణాల కంటే తక్కువ. ఇవి అత్యధికంగా చొచ్చుకు పోగలిగే సామర్థ్యం గలవి. ఇవి మానవ శరీరం గుండా సులభంగా చొచ్చుకు పోయి కాన్సరు కణాలను నాశనం చేయగలవు. కాని, వీటికి ఎక్కువ గురి చేయటం ప్రమాదకరం.

3) ఎక్స్‌రే కిరణాలు (X-Rays): తరంగ దీర్ఘత 0.0001 నుండి 10 nm. ఇవి కూడా గామా కిరణాల వంటివే కాని, కొంత తక్కువ వేధన (చొచ్చుకు పోగల) శక్తి గలవి పరమణావులోని ఎలక్ట్రాన్ల పరివర్తన వల్ల వివిధ తరంగ దైర్ఘ్యంగల ఎక్స్‌రే కిరణాలు ఉత్పత్తి అవుతాయి. ధృఢమైన ఎక్స్-కిరణాలతో పరిశ్రమలలో గట్టి వస్తువులను శోధించడానికి ఉపయోగిస్తారు. వీటితో స్ఫటికాల నిర్మాణాన్ని గురించి తెలుసుకోవచ్చు.

మృదు ఎక్స్ కిరణాలు మన శరీరంలోని గట్టి కండరాల నుండి కూడా చొచ్చుకు పోగలవు. కాని ఎముకలలో నుండి పోలేవు. అందుచే వీటిని రోగ నిర్ధారణకి ఉపయెాగిస్తారు. కొన్ని రకాల రోగ నివారణ కు కూడా ఉపయోగిస్తారు. ఈ చికిత్సను రేడియో థెరపీ అంటారు. వీటిని కూడా ఎక్కువగా వాడటం మంచిది కాదంటున్నారు శాస్త్రజ్ఞులు.

4) అల్ట్రా వైలెట్ (అతినీల లోహిత) కిరణాలు:- తరంగ దీర్ఘత 0.45 మీ నుండి 1 nm ఈ కిరణాలు సూర్య ప్రకాశంలో అధికంగా ఉన్నప్పటికి భూమిపై నున్న వాతావరణం లోనే యివి ఎక్కువగా ఉండిపోతాయి. ఉదయం సాయంకాలములందు సూర్య కిరణాలు ఏటవాలుగా పడతాయి. కనుక కొద్దిసేపు అవి భూమిని చేరుకుంటాయి. ఇవి కంటి రెటీనాపై ప్రభావమును చూపలేవు. కాన, ఇవి కంటికి కనబడవు. అయినప్పటికి ఇవి (1) ఫోటో గ్రాఫిక్ ప్లేటుపై రసాయనిక ప్రభావమును చూపిస్తాయి. (2) ప్రతి దీప్తిని (Flurescence)ను ఉత్పన్నము చేస్తాయి. (4) గాలిని ఆటమ్స్‌తో నింపుతాయి. (Ionisotion) చేస్తాయి. వీటిని ఎక్కువ తాపశక్తిగల పదార్థములతో ఉత్పన్నము చేయవచ్చును.

**ఉపయోగాలు:** ఇవి (1) మన శరీరములో విటమిన్'డి'ని ఉత్పన్నము చేస్తాయి. వీటి ప్రభావం మన చర్మము క్రింద క్రొవ్వు పొరలోనున్న హైడ్రో కొలెస్ట్రాల్ (Hydro-Cholestral) పై పడుటచే అది విటమిన్'డి'గా పరివర్తన చెందుతుంది. (2) ఇవి గాలిలోని రోగ కారక క్రిములను ఎండలో ఆరవేసిన వస్త్రములలోని సూక్ష్మ క్రిములను కూడా చంప గలవు. నీటిలో ఎంత వరకు ఈ కిరణములు వ్యాపించగలవో అంత వరకు ఉన్న సూక్ష్మ క్రిములను ఇవి చంపగలవు. (3) ఈ కిరణాలు వేరు వేరు రంగుల గల రాళ్ళపై పడినప్పుడు అవి విభిన్న రంగులతో ప్రదీప్తమవుతాయి (మెరుస్తాయి). వీనిలో ఇట్టి గుణముండుటచే విలువైన రాళ్ళను అవి సహజమైన (అసలైనవో) కృత్రిమమైన (నకిలీ)వో తెలిసికోవచ్చును. వీటితో ముఖ్యమైన అభిలేఖ (దస్తావేజు) లందలి వ్రాతలను పరిశీలించి వాడిన సిరాలోని మార్పులను గమనించవచ్చును.

ఈ అతినీల లోహిత శరీరం స్వల్పంగా గురియైనప్పుడు చర్మం మాడినట్లుగా అవుతుంది. వీటికే ఎక్కువ కాలం గురయైతే కాన్సరుతో బాటు అనేక చర్మ వ్యాధులు వస్తాయి. భూమికి రక్షణ కవచంగా ఉన్న ఓజోన్ పొర వాతావరణ కాలుష్యాలవల్ల క్రమంగా క్షీణిస్తున్నదట. అందుచే శరీరానికి సూర్యకాంతి ఎక్కువగా తగలడం మంచిది కాదని కొందరంటున్నారు.

ఇంతవరకు వివరించిన కాస్మిక్, గామ, ఎక్స్‌రే, అల్ట్రావైలెట్ కిరణాలు కంటికి కనబడవు. వీటి తదుపరి గల రంగు కిరణాలు - ఏడు కంటికి కనబడతాయి. సూర్యకిరణ చికిత్సలో ఇవే ఎక్కువగా ఉపయోగ పడతాయి. వీటి గురించి ముందు ప్రకరణంలో వివరంగా తెలిసి కొందాము. రంగు కిరణముల తదుపరి గల 5 రకముల సాధారణ కిరణములు కూడా కంటికి కనబడవు. వీనిలో మొదటి రకానికి చెందిన ఇన్‌ఫ్రారెడ్ కిరణములు మాత్రమే చికిత్సకు ఉపయోగపడతాయి. (మిగతా కిరణాలు విద్యుత్, రేడియో, టెలివిజన్ మొదలగు పరికరములకు ఉపయోగపడును) కాన ఇన్‌ఫ్రారెడ్ కిరణముల గురించి కొంత తెలిసి కొందాము.

**5) ఇన్‌ఫ్రారెడ్ కిరణాలు:** తరంగ దీర్ఘత 0.7 నుండి 100 ...మీ. ఈ కిరణాలను తక్కువ తాపక్షమత కలిగిన వస్తువుల నుండి కూడా ఉత్పన్నము చేయవచ్చును. ఇవి కంటి రెటీనాను ప్రభావితము చేయలేవు.

కనుక కనబడవు. వీటిని శరీరముపై ప్రసరింప చేసినప్పుడు లోనికి చొచ్చుకొని వేడిని కలిగించ గలవు. అందుచే వీటిని వేడి కిరణాలు (Heat Rays) అని కూడా అంటారు. చికిత్సలో అల్ట్రావైలెట్ కిరణ ప్రయోగము కన్న ఈ కిరణముల ప్రయోగం క్షేమకరం. ఇవి పొగమంచులోను, గాఢమైన మంచులోను కూడా చొచ్చుకు పోగలవు. అందుచే అటువంటి స్థలాలలో, చీకటిలో కూడా చిత్రములు (Photos) తీయుటకు ఉపయోగపడును. ఇవి వేడిని ఉత్పన్నం చేయగలవు. కాని వీటిని కాపడముల (Fomentations) కు ఉపయోగించుకోవచ్చును. వీటిని కృత్రిమముగా విద్యుత్ దీపములుగా (ఇన్‌ఫ్రారెడ్ లేంప్పుగా) తయారు చేయుదురు. ఆ విద్యుత్ దీపముల ఫిలమెంటు తీగకు థోరియం ఆక్సైడ్ పూత పూయుటచే ఈ కిరణాలు ఉత్పన్నమగును. సిలికాన్ కార్బైడ్ కడ్డీల ద్వారా విద్యుత్ పంపినను ఇట్టి కిరణాలు వెలువడను.

సూర్య ప్రకాశ స్థితి గతులను బట్టి వాతావరణాన్ని అధ్యయనం చేసి రాబోవు వర్ష తీవ్రతను, వాయు తీవ్రతను, తుఫానులు, ఉప్పెనలు మొదలగు వాటిని తెలుసుకోవచ్చు. వీటికొరకు దేశంలో అక్కడక్కడ సూర్యప్రకాశ అభిలేఖిక (Sunshine Recorders) లను ఏర్పాటు చేయుదురు. వాటిని సూర్యోదయము మొదలు సూర్యాస్తమయం వరకు (ఎట్టి ఆటంకములు లేకుండా) ఎండ పడునట్లుగా ఎత్తైన ప్రదేశములో ఏర్పాటు చేయుదు. ఇట్టి అంతరిక్షీయ వేధశాలలు (Metereocologecal Labaratories) మన దేశంలో పూనా మరియు దిల్లీ పట్టణములలో గలవు. వీటివల్ల వ్యవసాయ దారులకు, వైమానికులకు, నావికులకు హెచ్చరికలు లభించు ను. ప్రమాదములను, నష్టములను చాలా వరకు తగ్గించుకోవచ్చును.

ఇక్కడ మరొక ముఖ్య విషయం తెలుసుకోవడం చాలా అవసరం. అల్ట్రా వైలెట్ మరియు ఇన్‌ఫ్రారెడ్ కిరణాలకు చికిత్సా పరంగా కొన్ని మంచి గుణాలున్నా అవి తీవ్రమైతే కొన్ని నష్టాలు జరిగే అవకాశ ముంది. కనుక అవసరాన్ని బట్టే తగు మాత్రలో వీటిని ఉపయోగించుకోవాలి. అందుచేతనే సూర్యగ్రహణం ముఖ్యంగా సంపూర్ణ సూర్యగ్రహణం చూడకూడదంటారు. సూర్యగ్రహణ సమయంలో చంద్రుడు సూర్యకిరణాలలో ($3^9$x$10^6$ jlfts $3^8$x$10^6$ వరకు ఉండే) ప్రకాశ కిరణాలను అడ్డుకుంటాడు. అందుచే అంతకు పైన ఉన్న అల్ట్రావైలెట్ కిరణాలు, క్రింద ఉన్న ఇన్‌ఫ్రారెడ్ కిరణాలు వస్తూనే ఉంటాయి. వీటి తీవ్రతను తగ్గించే ప్రకాశ

కిరణాలు (7 రంగు కిరణాలు) లేకుండుటచే వాటి తీవ్రత హెచ్చుగా ఉంటుంది. తగిన జాగ్రత్తలు తీసుకోకుండా ఆ సమయంలో సూర్యుని చూస్తే కంటి రెటీనా పూర్తిగా దెబ్బతినవచ్చు. అందుచే సంపూర్ణ సూర్య గ్రహణాన్ని అసలు వట్టి కంటితో చూడకూడదు. పాక్షిక సూర్యగ్రహణం కూడా వట్టి కంటితో చూడకుండా ఉండుటే మంచిది. గర్భవతులపై వీటి ప్రభావం ఎక్కువగా ఉంటుందట. కాన వారు గ్రహణ సమయంలో ఎండలోకి వెళ్ళుట మంచిది కాదట.

82 సంవత్సరాల అనంతరం 26-2-1980వ రోజున మన భారత దేశంలో సంపూర్ణ సూర్యగ్రహణం ఏర్పడింది. అప్పుడు జైపూర్ సమీపంలోని అవికానగర్‌లో జరిగిన పరిశోధనలలో కొన్ని విషయాలు వెల్లడైనవి. గర్భం ధరించిన కొన్ని జంతువులపై జరిపిన పరిశోధనలలో కొన్ని విషయాలు స్పష్టమైనవి. ఎండలో ఉంచిన జంతువుల నాడి గతి కొన్నిటిలో మందగించుట, కొన్నిటిలో ఎక్కువగుట జరిగినది. శ్వాసగతి కొలత తగ్గినది. రక్తములోని ఇనుము (హీమోగ్లోబిన్) శాతం కొద్దిగా తగ్గినది. రక్తములో పొటాషియం పరిమాణం స్వల్పంగా తగ్గినది. చీకటి గదులలో ఉంచిన జంతువులలో పై మార్పులు ఏమీ లేవు. కాని రక్తంలోని పొటాషియం శాతం కొద్దిగా పెరిగినట్లు కనబడినది. షిల్లాంగ్‌లో జరిపిన కోడిగ్రుడ్ల పరిశీలనలో గ్రహణం మరునాడు పెట్టిన కోడిగ్రుడ్లపై కొన్ని విచిత్రమైన మచ్చలు, రేఖలు (గీతలు) కనబడినవి. ధార్ వాడ్‌లోని పిచ్చి ఆసుపత్రిలోని రోగులలో గ్రహణ సమయంలో కొంత ఉద్రిక్తత కనబడింది. స్త్రీ రోగులలో ఇది ఎక్కువగా కనబడినట్లు వైద్యులు చెప్పిరి. కాన, గ్రహణ సమయంలో గర్భిణీ స్త్రీలు, మానసిక రోగులు కొన్ని జాగ్రత్తలు తీసుకొనుట అవసరం. అట్లని వీరిని గాలిరాని చీకటి గదులలో మూసి ఉంచవలసిన అవసరం లేదు. ఇండ్లలో సామాన్య స్థితిలో ఉంచవచ్చును.

### శక్తి (Energy):

సూర్యుని నుండి మనకు లభించే మరొక గొప్ప వరం శక్తి. దీనినే నేడు కేలరీలు అంటున్నారు. కేలరీ అనగా 1 గ్రాము నీటిని 1/ డిగ్రీ వరకు వేడి చేయగల ఉష్ణశక్తి. అయితే ఈ కొలత సరిపోక 1 కిలో గ్రాము నీటిని 1 సెంటీగ్రేడ్ వరకు వేడి చేయగల దానిని కిలోకాలరీగా (K cal) నిర్ణయించి ఆ ప్రకారం లెక్కలు వేస్తున్నారు. నేడు ఈ కిలో కేలరీలని కూడా

వ్యవహారంలో కేలరీగానే పలుకుతున్నారు. మనం జీవించడానికి, తిరగడానికి, పనులు చేయడానికి, గొప్ప కార్యాలు సాధించడానికి శక్తి అవసరం. కార్యాలయాలలో బుద్ధితో పనిచేసే వారికి రోజుకు 1400 కేలరీలు శక్తి అవసరమవుతుంది. పనులు చేసే వారికి 2,800 నుండి 3,900 కేలరీల వరకు శక్తి కావలసి ఉంటుంది. ఎంత విశ్రాంతిగా ఉన్నప్పటికి గుండె, ఊపిరి తిత్తులు, నాడీ మండలం, రక్త ప్రవాహం మొదలగునవి పని చేయటానికి ఎంతో కొంత శక్తి అవసరమే. ఈ శక్తి మనకు ఎక్కడ నుండి వస్తున్నదని ఆలోచిస్తే ఆహారం ద్వారా వస్తున్నట్లు తెలుస్తుంది. ఆహారం ఎక్కడ నుండి లభిస్తున్నది? వృక్షజాతి నుండి. మాంసాహార జంతువులకు కూడా శాకాహారం తిని పెరిగిన జంతువుల మాంసమే ఆహారం అవుతుంది. కాన శక్తికి మూలం వృక్ష జాతులు. అయితే ఆ వృక్ష జాతులు మన కందించే ఆహారం తయారు చేయడానికి సూర్య కిరణాలు అనివార్యం. లోతుగా ఆలోచిస్తే సూర్యశక్తే ఆహారంలో నిక్షిప్తమై ఉంది. అది ఎట్లన -

జంగమ ప్రాణులన్నీ నిరంతరం గాలిలోని ప్రాణ వాయువును లోపలికి పీల్చుకుని బొగ్గు పులుసు వాయువును (కార్బన్ డై ఆక్సైడ్‌ను) విడిచి పెడుతూ ఉంటాయి. దానివల్ల వాతావరణమంతా కలుషితం అవుతూ ఉంటుంది. సామాన్యంగా గాలిలో 0.6 శాతం బొగ్గు పులుసు వాయువు ఉంటే మనకు ఏమీ అనిపించదు. కాని అది 1.5 శాతానికి చేరుకుంటే తలనొప్పి, చిరాకు, నీరసం మున్నగునవి వస్తాయి. అదే ఒకవేళ 7.5 శాతానికి చేరుకుంటే ఆగాలి విషం అవుతుంది. ప్రాణి జాతి జీవించలేదు. అందుచేతనే దయామయుడగు పరమేశ్వరుడు వృక్ష జాతిని ముందు సృష్టించి తదుపరి జంగమ ప్రాణులను సృష్టించినాడు. వృక్ష జాతులు మనం వదలిపెట్టిన బొగ్గు పులుసు గాలిని లోపలకు తీసుకొని దానిని బొగ్గు (కార్బన్) మరియు ప్రాణ వాయువు (ఆక్సిజన్)గా విడగొట్టి ప్రాణ వాయువును మరల గాలిలోకి విడిచి పెడుతూ ఉంటాయి. దానివల్ల గాలిలో బొగ్గు పులుసు గాలి శాతం పెరగకుండా ఉంటుంది.

విడగొట్టిన బొగ్గును భూమి నుంచి గ్రహించిన నీటిని కలిపి వృక్ష జాతులు కార్బోహైడ్రేట్స్‌గా (పిండి పదార్థంగా) మారుస్తాయి. వీటినే భూమి నుండి గాలి నుండి గ్రహించిన నత్రజని లోహ లవణాదులతో మరికొన్ని మార్పులు చేసి మాంసకృత్తులుగా, క్రొవ్వులుగా, జీవరసాయనాలుగా,

విటమిన్లుగా, ఔషధాలుగా మారుస్తాయి. వీటితో పండ్లు, కాయలు, ధాన్యములు, పప్పులు మొదలగు వాటి రూపంలో మనకు ఆహారాన్ని నిర్మించి యిస్తాయి. ఆ ఆహారం వల్లనే మనకు శక్తి లభిస్తున్నది. ఈ ఆహార నిర్మాణ కార్యమంతా సూర్య ప్రకాశము (ఎండ) లేనిచో అసంభవము.

వృక్షజాతి ఆకులందలి పత్రహరితవము (క్లోరోఫిల్) సూర్య కిరణములను గ్రహిస్తుంది. ఆ గ్రహింప బడిన సూర్య కిరణాలు బొగ్గు అణువులను నీటి అణువులను సంయుక్తంగా పిండి పదార్థంగా (కార్బోహైడ్రేట్స్‌గా) నిర్మిస్తాయి. దీనినే కిరణ జన్య సంయోగ క్రియ అంటారు. ఆహారంలో శక్తినిచ్చే ప్రధాన ఆహారం పిండి పదార్థమే. దానిని మనం భుజించినప్పుడు జీర్ణమై అనగా నీటిలో కరుగునంతగా కలుస్తుంది. (గ్లూకోజ్‌గా) సూక్ష్మీకరింపబడి రక్తములో కలుస్తుంది. అది రక్తము ద్వారా కణవముల మధ్యకు చేరుతుంది. క్లోమం గ్రంధి (Pancreas) విడుదల చేసిన ఇన్సులిన్ అను ఒక హార్మోను ప్రభావంతో కణాల వద్ద ఆ గ్లూకోజ్ దహింప బడుతుంది. అనగా కలిసి ఉన్న బొగ్గు అణువులు మరియు నీటి అణువులు విడకొట్టబడినందున శక్తి ఉత్పన్న మవుతుంది. ఆ శక్తియే మనను జీవింప చేస్తుంది. అణు విచ్ఛేదం వల్ల శక్తి ఉత్పన్నమైనట్లుగా మన శరీరంలో బొగ్గు నీరు కలిసిన కార్బోహైడ్రేట్స్ (గ్లూకోజ్) అణువుల విచ్ఛేదం వల్ల శక్తి ఉత్పన్న మగుచున్నది.

ఋగ్వేదంలో 'ద్రవ్యం నుండి శక్తి ఉత్పన్న మగునని, శక్తి నుండి ద్రవ్యం ఉత్పన్న మగునని'. సంకేతం కనబడుతుంది. మంత్రం ఈ విధంగా ఉంటుంది -

**భూర్జ జ్ఞే ఉత్తాన పదో భువ ఆశా అజాయన్త।**
**అదితేర్దక్షో అజాయత దక్షాద్వదితః పరి॥ (ఋ. 10-72-4)**

భూమి సూర్యుని నుండి ఉత్పన్నమగును. భూమి నుండి దిక్కులు - తూర్పు, పడమర మొదలగు దిశలు ఉత్పన్న మగును. అనగా సూర్యుడు ఉదయించే దిశ తూర్పు అని, అస్తమించే దిశ పడమర అని వ్యవహరింప బడును. అతి నుండి దక్ష ఉత్పన్నమగును. అనగా అక్షయమగు ప్రకృతి నుండి పదార్థము నుండి (దక్ష) శక్తి ఉత్పన్నమగును. దక్ష నుండి (శక్తి నుండి) అదితిః (పదార్థము) ఉత్పన్న మగును.

విభజింపబడిన బొగ్గు అణువులు ప్రాణ వాయువుతో సంయుక్తమైనప్పుడు బొగ్గు పులుసు వాయువు (కార్బన్‌డై ఆక్సైడు) విసర్జింప బడుతుంది. దానితో గాలి కలుషితం అవుతుంది. మరల సూర్య కిరణాలే వృక్షజాతి ద్వారా వాటిని విడగొట్టి శుద్ధి చేసి మరల నీటి అణువులతో కలిపి ఆహారంగా ఇవ్వగలవు. అయితే వృక్ష జాతులు ఎండ ఉన్నప్పుడే ఈ పని చేయగలవు. లేకున్న చేయలేవు. అందుచేతనే పగటికన్న రాత్రి గాలిలోని బొగ్గు పులుసు గాలి శాతం 12 శాతం పెరుగుతుంది. భూమిపై ఉన్న వృక్షజాతి అంతా కలిసి ప్రతి సంవత్సరం $60 \times 10^{12}$ కిలో గ్రాముల కార్బన్‌డై ఆక్సైడును తినే ఆహారంగా మార్చి వేస్తున్నాయట. భూమిపై పడే సూర్య కిరణాలలోని 1 x 10 .4 భాగం కేవలం ఈ కిరణజన్య సంయోగ క్రియకే వినియోగింప బడుతున్నదని వైజ్ఞానికులు చెబుతారు. అందుచేతనే ఋగ్వేదం 'సూర్య ఆత్మా జగతః తస్థుషః (ఋ 2-115-1) **(జగతః)** జంగమ ప్రాణులైన మానవ పశుపక్ష్యాదులకు, **(తస్థుషః)** స్థావరములైన ఓషధీ వనస్పతి వృక్షలతాదులకు **(సూర్య ఆత్మా)** సూర్యుడే జీవనాధారమని చెబుతుంది. మరొక చోట **''అధారయద్ హరితోర్భూరి భోజనమ్''** (ఋ. 3-44-3) ఆ సూర్యుడు తన హరిత కిరణములతో సదా లోకము (ప్రాణు)లన్నిటికి పుష్కలంగా భోజనము పెట్టు చున్నాడు'' అని చెప్పబడింది. అనగా సూర్య కిరణాల వల్లనే పంటలు పండుచున్నవని భావం. మరొక చోట **'అప్సు సూర్యే మహద్ధనమ్** (ఋ. 8-38-9) అనే వాక్యంలో యిదే భావం కనబడుతుంది.

పంచమహా యజ్ఞాలలోని దేవయజ్ఞం (అగ్ని హోత్రం) చేసేటప్పుడు కొంత కార్బన్‌డై ఆక్సైడు వెలువడుతుంది. అందుచే అది సూర్య కిరణాలు ఉన్నప్పుడే చెయ్యాలని ఋషులంటారు. దానివల్ల రెండు ప్రయోజనాలు నెరవేరుతాయి. ఒకటి - అగ్నిహోత్రం నుండి వెలువడే వాయువులు సూర్య కిరణాల ప్రభావంతో కొన్ని రసాయనిక మార్పులు చెంది శక్తివంతమై రోగకారక క్రిములను కాలుష్యాన్ని నివారించ గలుగుతాయి. రెండవది అందుండి వెలువడే కార్బన్‌డై ఆక్సైడ్ వాయువు చెట్లకు ఆహారముగానై గాలి కాలుష్యం కాకుండా ఉంటుంది. పెద్దపెద్ద యజ్ఞాలు చేయగోరే వారు చుట్టూ చెట్లు ఉండే తోటలో చేయుట మంచిది.

యజుర్వేదంలో యజ్ఞశాలల చుట్టూ వృక్షాలు పెంచి శోభాయమానంగా చెయ్యాలని ఉంది. యజ్ఞశాలలను పచ్చని తోరణాలతో

అలంకరించాలని చెప్పబడింది. కార్బన్ డై ఆక్సైడ్ ప్రభావాన్ని తగ్గింపడానికి కావచ్చు ఈ సూచనలు. మన పెద్దలు శుభకార్యాలలో, సమావేశాలలో జనులు అధిక సంఖ్యలో ఏకత్రితమగు జన సాంద్రత (జన సమ్మర్దత) ఏర్పడే చోటును మామిడి తోరణాలతో అలంకరించాలంటారు. మామిడాకులు చెట్ల నుండి విరిచినప్పటికి ఆకులు పచ్చగా తేమతో ఉన్నంతవరకు కార్బన్ డై ఆక్సైడ్‌ను గ్రహిస్తూ ఉంటాయిట. అందులో మామిడి ఆకులు వాడిపోకుండా రెండు రోజులు ఉంటాయి. అందుచే ఎక్కువగా మామిడాకుల తోరణాలు కడుతూ ఉంటారు. దీనికి ఈ క్రింది వేదమంత్రం ఆధారం.

**తమిత్ సమానం వనినశ్చ వీరుధోంతర్వతీశ్చ సువతే చ విశ్వహా॥**

**(సామ, 1824 ఋ. 10=91-6)**

వృక్ష వనస్పతులు సమాన వాయువును (ఆక్సిజన్‌ను) విడిచి పెట్టుచుండును. (ఈ మంత్రం ప్రాణ వాయువునే 'సమానం' అని పేర్కొంది).

పత్రహరితం (క్లోరోఫిల్) గురించి వేదం ఈ విధంగా చెబుతుంది.

**అవిర్వై నామ దేవతర్తేనాస్తే పరివృతా।**

**తస్యా రూపేణేమే వృక్షా హరితా హరితస్రజః॥**

**(అథర్వ. 10-8-31)**

వృక్ష జాతులో **'అవి'** (రక్షకతత్త్వము - క్లోరోఫిల్) ఉండుట చేతనే అవి పచ్చగా నున్నవి.

ఈ విధంగా వెతికితే వేదాలలో అనేక రకాల విజ్ఞానాలకు (Sciences కు) మూలాధారాలు కనిపిస్తాయి.

## విద్యుత్తు

సూర్యుని నుండి కేవలం ప్రాణుల మనుగడకు అవసరమైన జీవన శక్తి (Energy) యే గాక యంత్రాదులు పని చేయడానికి అవసరమైన అశ్విక శక్తి (హార్స్‌పవర్) వంటివి విద్యుత్ రూపంలో లభిస్తున్నది. ఇంతేగాక, ఆ స్రోతస్సు అక్షయ భండారం. ఈ సృష్టి ఉన్నంతవరకు అది లభిస్తూనే ఉంటుంది. **'అప్సు సూర్యే మహద్ధనమ్'** (ఋ. 8-38-9)

సూర్యునిలో గొప్ప ధనం (శక్తి) ఉన్నదని వేదం చెబుతుంది. నేటి విజ్ఞానం కూడా దీనిని ఒప్పుకుంటుంది. సూర్య కిరణాలను ఏకత్రితం చేసి వాటర్ హీటర్లు, కుక్కర్లు, పండ్లు మొదలయినవి ఎండబెట్టే డ్రైయర్స్ నిర్మించుచుండుటయేగాక విద్యుత్తును కూడా ఉత్పత్తి చేస్తున్నారు. కాని, ఈ విషయంలో ఇంకా పరిపక్వత రాలేదు.

అమెరికా సంయుక్త రాష్ట్రాలలో కాలిఫోర్నియాకు చెందిన మెజోవె (MAJOEE) ఎడారిలో ఒక పెద్ద 'సోలార్ పవర్ ప్లాంట్' నిర్మింపబడింది. అనువృత్తాకారపు (PAROBOLIC) అద్దాలు సూర్యమార్గాన్ని అనుసరిస్తూ ఉండేటట్టు ఏర్పాటు చేసి వాటి వేడితో కృత్రిమమైన నూనె నింపిన గొట్టాలను వేడి చేస్తున్నారు. దానితో సూపర్ హీటెడ్ ఆవిరి ఉత్పత్తి కావడం, జనరేటర్ పని చేయడం జరుగుతున్నది. నేడు ప్రపంచంలో ఇదే అతి పెద్ద సౌర విద్యుత్ ఉత్పత్తి కేంద్రం - ప్రపంచ సౌర శక్తిలో ఇదే 92% ఉత్పత్తి చేస్తోంది. ఇది చాలా వ్యయ ప్రయాసలతో కూడిన పని. కాని మన ప్రాచీనులు చాలా తేలికగా సూర్యుని నుండి విద్యుత్తు నుత్పన్నం చేసినట్లు ఆధారాలు కనబడుతున్నాయి.

**అథయన్త్ర ముఖాత్ విద్యుచ్ఛక్తిం సూర్యాంశుభిః క్రమాత్।**
**సమాహర్తుం విశేషేణ ఉపాయః పరికీర్త్యతే।**

(బృహత్ విమానశాస్త్రం పుట - 340, శ్లో 357, 358)

అనగా 'విశేష యంత్ర సహాయముతో సూర్యుని నుండి విద్యుత్ శక్తిని గ్రహించి విమానములు నడుపవలె' నని భావము. ఇదే శాస్త్రమున మరొక చోట ఒక్క క్షణములో 1000° సెంటిగ్రేడ్ ఉష్ణశక్తిని గ్రహించు సాధనమును నిర్మించుమని ఆదేశం కనబడును. వీటిని బట్టి ప్రాచీన కాలంలో సౌర విద్యుత్‌తో విమానాలు నడిపేవారని గ్రహించవచ్చు. ఏలన అప్పటికి పెట్రోలు మొదలగునవి కనిపెట్టబడ లేదు కదా! వాల్మీకి రామాయణంలోని పుష్పక విమాన వర్ణన మన అందరకు తెలిసినదే. అది జరిగి కొన్ని లక్షల సంవత్సరాలయ్యింది. అప్పుడు పెట్రోలు ఎక్కడిది?

పెట్రోలు కనిపెట్టింది క్రీ.శ. 1850లో. అది బహుళంగా వాడుకలోకి వచ్చింది. 19వ శతాబ్దంలోనే. అది అప్పుడే చివరి దశకు వచ్చింది. మరొక 40, 50 సంవత్సరాలలో నిల్వలన్నీ సమాప్తమయిపోయి పెట్రోలు మటుమాయం అయిపోతుంది. (ఈ విధంగానే విరివిగా వాడకం చేస్తే)

అప్పుడు మన గతి ఏమి? ఇంతేగాక దీని విలువ ఎంత పెరిగిపోతున్నదో మీ అందరకు తెలిసినదే కదా! ఇప్పుడు మన భారతదేశం ప్రతి సంవత్సరం 34,000 కోట్ల విలువగల పెట్రోలియం ఉత్పత్తులను దిగుమతి చేసుకుంటోంది. ఇది మన బడ్జెట్‌లో 25%. ఇది మనకు ఎంత ఆర్థిక భారమో ఆలోచించండి. జల విద్యుత్‌ను పెంపొందింప చేసుకునే అవకాశం చాలా తక్కువ. బొగ్గు కూడా తరిగి పోతున్నది. కనుక థర్మల్ విద్యుత్ కూడా కష్టమే అవుతుంది. అణురియాక్టర్లతో విద్యుదుత్పత్తి ప్రమాదకరం. వ్యయంతో కూడినది. పవన విద్యుత్ అన్ని చోట్ల అనువు కాదు. ఈ స్థితిలో సౌర విద్యుత్ కొరకు ప్రయత్నించడమే ఉత్తమం. అది అన్ని ప్రాంతాలకి అనుకూలంగా ఉంటుంది.

మన ప్రాచీనుల విజ్ఞానానికి మూలం వేదం. ఆ విధంగా వారు వ్రాసిన శాస్త్రాలలోనే వారు వ్రాసుకున్నారు. బృహద్ విమాన శాస్త్రం, యంత్ర నిర్మాణ శాస్త్రం మొదలగునవన్నీ వేదాల జ్ఞానం నుండి ఆవిర్భవించినవే. వారు వేదమంత్రాల స్వాధ్యాయ మనన చింతనా ధ్యానములు చేసి అంతర్ముఖులై అంతర్యామి యైన సృష్టికర్త ద్వారా వాటి అర్థాలను తెలిసి కొన్నారు. ప్రయోగాలు చేసి యంత్రాలు నిర్మించారు. ఆధునిక మహర్షియైన దయానందుడు కూడా యిట్టి కోవకు చెందిన విజ్ఞాన వేత్తయే. ఆయన వ్రాసిన వేద భాష్యంలో ముఖ్యంగా ఋగ్వేద భాష్యంలో ఎన్నో విజ్ఞాన విషయాలు కనబడతాయి. ఆయన సౌర విద్యుత్ గురించి ఒక చోట ఈ విధంగా భాష్యం వ్రాసినాడు.

**ఇంద్రాగ్నీ తపన్తి మాఘా అర్యో అరాతయః।**
**అప ద్వేషాంస్యా కృతం యుయుతం సూర్యాదధి॥**

(ఋగ్. 6-59-8)

ఈ మంత్రంలోని 'సూర్యాత్ అధి ఆ యుయుతమ్'' అను వాక్యమునకు మహర్షి వ్రాసిన భాష్యం ఈ విధంగా ఉన్నది. ''**సవితృమణ్డలాత్ ఉపరి భావే వాయువిద్యుతౌ విభాజయతమ్**'' అనగా 'సూర్యుని ఉపరితలం నుండి వెలువడే వాయు విద్యుత్‌లను వేరువేరుగా గ్రహించుము' అని అర్థం. ఈ మంత్ర భావార్థంలోనున్నది 'ఓ రాజుతో కూడిన రాజ్యప్రజలారా! మీరు సూర్యుని నుండి విద్యుత్‌ను సంపాదించే విద్యను (ప్రక్రియను) తెలిసి కొనుడు - అని ప్రేరేపించినాడు.

సృష్టిలోని అణువణువులో శక్తి (విద్యుత్) దాగి ఉంది. ఆల్ బర్ట్ ఐన్‌స్టీన్ క్రీ.శ. (1879-1955) పదార్థాన్ని దాగియున్న శక్తి($E=mc^2$) అని అంటాడు. కనుక ప్రతి పదార్థం నుండి విద్యుత్ శక్తిని గ్రహించవచ్చు. ఈ విషయాన్నే మహర్షి దయానందుడు (క్రీ.శ. 1824) తన భాష్యంలో-

**యే విపులం అగ్నిం సర్వేభ్యః పదార్థేభ్యో నిఃసారితుం జానన్తి**

**(ఋగ్. భాష్యం 4-7-5)**

అనగా ఏ మానవులు అన్ని పదార్థాల నుండి విద్యుత్‌ను సంపాదించగల విద్యను తెలిసి కొందురో వారు అత్యంత సుఖమును పొందుదురు (తరతరాలకు ఆ సుఖమును అందివ్వగలరు). దీనికి ముందుగల ఋగ్. 4-7-4 లో ''ఏ మనుష్యులు సూర్యాది పదార్థముల నుండి విద్యుత్ మొదలగు పదార్థములను గ్రహించగలరో వారు ప్రజలకు సుఖముల నిచ్చువారు అగుదురు'' అని భావార్థం వ్రాసారు. తరువాతి దైన ఋగ్ . 4-7-6 మంత్రానికి ''ఏ మానవులు సర్వపదార్థములలో వేరువేరుగా విద్యమానమై యుండు అగ్ని గురించి యథార్థముగా తెలిసికొన గలరో అట్టివారు సకల కార్యములను సాధించగలరు'' అని వ్రాసారు? మరి వారు ఏ విజ్ఞాన గ్రంథాలు చదివి ఈ మాటలు వ్రాసారు. ఆలోచించండి. ఋషుల జ్ఞానమంటే ఈ విధంగా ఉంటుంది.

పృథివిలోని అనేక పదార్థాల నుండి సూర్యుని నుండే కాకుండా అంతరిక్షం నుండి కూడా విద్యుత్‌ను గ్రహించండని వారు ప్రేరేపించారు. **''ఆ రోదసీ అపృణదా స్వర్మహజ్జాతం... (ఋగ్. 3-2-7)** అనే మంత్రానికి అర్థం వ్రాస్తూ ఏ విద్యుత్ రూప అగ్ని పృథివీ సూర్యులలో ఉన్నదో అది అంతరిక్షమందు నిండి ఉన్నది. ఒకవేళ ఆ అంతరిక్షస్థ విద్యుత్‌ను ప్రయాణ సాధనాలలో ఉపయోగించుకోగలిగినట్లయితే అందరికి మేలు జరుగుతుంది'' అని వ్రాసారు. ఈ మాటలు అభూత కల్పనలు కావు. ఏలన మన చుట్టూ, అంతరిక్షమంతా అనేక రకాల కిరణాలతో నిండి ఉంది. ఉష్ణ, ప్రకాశ, ధ్వని, రేడియో, టెలివిజన్, టెలిఫోన్, అయస్కాంత మొదలగు అనేక తరంగాల మధ్య మనం తిరుగాడుతున్నాం. ఇవేగాక సూర్యునిలో జరిగే విస్ఫోటాల వల్ల కాస్మిక్, గామా, ఎక్స్‌రే మొదలగు ఎన్నో రకాల కిరణాలు విడుదల అవుతూ వుంటాయి. అవి అంతరిక్షమంతా వ్యాపించి ఉన్నాయి. వాటిని విద్యుత్ శక్తిగా మార్చుకునే అవకాశం ఉంది. అప్పుడు సూర్యప్రకాశం

లేకున్నా మన ప్రయాణాలు నిర్విఘ్నంగా సాగుతాయి. శాస్త్రవేత్తలు మహర్షి సూచించిన మార్గంలో ఆలోచిస్తే మార్గాలు దొరకవచ్చు. ఇంతేగాక ఉరుములతో కూడిన మెరుపులో ఎంతో శక్తి దాగి ఉంది. ఒక మెరుపులో ఉన్న శక్తి ఒక గ్రామానికి ఒక సంవత్సరం వరకు సరిపడగల ఇంధన శక్తిని సమకూర్చగలదట. అందుచేతనే వేదాలలో, ఋషుల శాస్త్రాలలో మెరుపును మరియు విద్యుత్తును కూడా 'ఇంద్రుడు' (గొప్ప ఐశ్వర్యవంతమైన పదార్థం) అని పేర్కొనుట జరిగింది. ఎప్పుడూ భూగోళం చుట్టూ ఎక్కడో ఒక చోట మేఘాలు, ఉరుములు ఉంటూనే ఉంటాయి. వాటి నుండి ఎంతో శక్తిని గ్రహించవచ్చు. దానిని విద్యుచ్ఛక్తిగా మార్చుకోవచ్చు.

ఈ అంతరిక్షస్థ మెరుపు నుండి విద్యుచ్ఛక్తిని గ్రహించ వచ్చనే ఆలోచన మొదటి సారిగా క్రీ.శ. 1746లో సుప్రసిద్ధ అమెరికన్ రాజనీతిజ్ఞుడు, తత్త్వవేత్త అయిన డా. బెంజిమన్ ఫ్రాంక్లిన్‌కు కలిగింది. ఆయన అనేక ప్రయోగాలు చేసి క్రీ.శ. 1756లో మెరుపు విద్యుల్లతయే తప్ప మరేమీ కాదని ఋజువు చేసాడు. అటు తరువాత అనేక పరిశోధనలు జరిగాయి. ఒక భౌతికశాస్త్ర విజ్ఞానవేత్త ఉరుములతో మెరుపులతో కూడిన తుఫానులో ఆల్ప్స్ పర్వతశ్రేణిలో మెరుపు నుండి విద్యుచ్ఛక్తిని గ్రహించే ప్రయోగం చేసి విజయాన్ని పొందాడు. కాని దురదృష్టవశాత్తు ప్రమాదానికి గురియై మరణించాడు. ఇది 50, 60 సంవత్సరాల క్రిందటి విషయం. నాటికీ నేటికీ విజ్ఞానం ఎంతగానో అభివృద్ధి చెందింది. కాన, యిప్పుడు ప్రయత్నిస్తే సాధ్యం కావచ్చు. మేఘాలు లేకుండా వాతావరణం పొడిగా ఉన్నప్పుడు సైతం అంతరిక్షంలో నిక్షిప్తమై యున్న విద్యుచ్ఛక్తిని గ్రహించే ప్రయత్నాలు జరుగుతున్నాయి. కనుక ముందు ముందు ఇది సాధ్యమౌతుందని ఆశిద్దాం.

ప్రస్తుత విషయం సూర్యకిరణ చికిత్స గనుక ఇచ్చట విద్యుత్ గురించి చాలా సంక్షిప్తంగానే వ్రాయటం జరిగింది. వివరంగా తెలిసికోగోరు వారు శ్రీ బ్రహ్మచారి ప్రదీప్ ఆర్య 'నైష్ఠిక్' (అధ్యక్షులు, ఆర్య సమాజము, భీనమాల్, జాలోర్,(రాజస్థాన్) గారు ఇటీవలే వ్రాసిన 'వేదాలలో విద్యుత్ విద్య' అనే హిందీ వ్యాసాన్ని చదువ గోరెదను.

ఈ సందర్భంలో పాఠకులు శ్రీ మామిళ్ళపల్లి వెంకటరామ కృష్ణారావు గారి ఈ క్రింది వ్యాసం చదవడం అవసరమే. అప్పుడే పై మాటలోని ఔచిత్యం మీకు బాగా అర్థమవుతుంది.

# విద్యుత్ భారతీయులు కనుగొన్నదే

కోట్ల సంవత్సరముల క్రితమే భారతీయులకు విద్యుత్ గురించి తెలుసు. ఇది నిజం.

నేడు నిత్యావసరమే కాదు, అత్యవసరం కూడా. మరి ఈ విద్యుత్‌ను ఎవరు కనుగొన్నారు? అని ఏ భారతీయుడిని అడిగినా పొరపాటున కూడా భారతీయుల చేత కనుగొనబడిందని చెప్పరు. థకీమని పాశ్చాత్యుల చేత కనుగొనబడిందని చెప్పేస్తారు. అయితే ఇప్పుడే కాదు కోట్లాది సంవత్సరాల పూర్వమే ప్రాచీనుల చేత కనుగొనబడిన విద్యుత్ మరెన్నో గొప్ప విషయాలు మనకు తెలియకపోవడానికి కారణం - ఆ విషయాలన్నీ సంస్కృతభాషలో ఉండడమే! ఆ అమూల్య గ్రంథ సంపదను భారతీయులు ఔపాసన పట్టకముందే పాశ్చాత్యులు దోచుకుపోయారు. వాటిని చదివి వాటిలో వివరించిన విజ్ఞానం తమ స్వంతమేనని అది పాశ్చాత్యులు తాము సాధించినదేనని చెప్పుకొంటుంటే; నేడు మనం కొండపల్లి బొమ్మల్లా తలఊపే స్థితిలో ఉండటం నిజంగా మన దురదృష్టకరమేనని చెప్పాలి.

నేడు పాశ్చాత్యుల చేత కనుగొన్నామని చెప్పబడే ఎన్నో విషయాలు ఏనాడో కోట్ల సంవత్సరాలకు పూర్వమే మన మహర్షుల చేత కనుగొనబడ్డాయి.

అందరూ భావిస్తున్నట్లు విద్యుత్‌ను మొదట కనుగొన్నది పాశ్చాత్యులు కానే కాదు. ఖచ్చితంగా ముమ్మాటికి మన భారతీయులే! అణుశక్తి మొదలు - అంతరిక్ష విజ్ఞానం వరకు, రోబోట్స్ మొదలు రసాయన పరిజ్ఞానం వరకు సర్వశాస్త్రాలలోనూ ఈ వేదభూమిలో పుట్టినవారికి వేదకాలంనాడే పరిచయం ఉంది. పరిచయం ఉంది అనడమే కాదు - అందుకు మన వేదాలలో, వేదాంతాలలో, ఉపనిషత్తులలో, పురాతన గ్రంథాలలో అక్షర రూపంలో మనకు ఆధారాలు సాక్షాత్కరిస్తున్నాయి.

నాగరికత ఏమాత్రం అభివృద్ధి చెందని ఆ రోజుల్లో సాంకేతికత అణుమాత్రమైనా అభివృద్ధి చెందనే లేదని మనం భావించే ఆ రోజుల్లోనే కరెంటు గురించి అద్భుత వివరణ వేదాల్లో ఇవ్వబడింది. కరెంటు లేకుండా వారు జీవించారు. అయితే అంతమాత్రం చేత వారు కరెంటు గురించి తెలియనివారు అనుకోవడం పొరపాటే. యజుర్వేదంలో (24-15-19) ఐదు (సూత్రాల్లో) మంత్రాల్లో విద్యుత్ గురించి ప్రస్తావించడం జరిగింది.

విద్యుత్ అగ్నిస్వరూపమని, దానికి రెండు తలలని, ఒక తలతో వస్తూ రెండో తలతో వెనక్కి పోతుందనీ చెప్పబడింది. ఇక్కడ రెండు తలలంటే ఋణాత్మక, ధనాత్మక విద్యుత్. (పాజిటివ్ ''+'', నెగటివ్ ''-'') కావచ్చును. ఈ వివరణ చేత కరెంటు గురించి మన పూర్వీకులకు ఖచ్చితంగా తెలుసునని ఘంటాపథంగా చెప్పవచ్చును. ఇది నిర్వివాదాంశం.

భరద్వాజ మహర్షి ''అంశుబోధిని'' అనే గ్రంథంలో కాంతి, ఉష్ణము, ధ్వని, తంత్రి, వార్త, విమాన నిర్మాణము, విద్యుచ్ఛక్తి ప్రయోగాల గురించి రాశారు. నేడు మనకు తెలియని ఎన్నో విద్యుదుత్పాదక పద్ధతులు మన అర్వాచీన గ్రంథాలలో లభించబడినాయి. సూర్యకిరణములు, (ఈనాటి సోలార్ విద్యుత్) తోకచుక్కలు, క్షారములు, కొన్ని రకముల వృక్షములనుండి విద్యుదుత్పాదకత గురించి గ్రంథాలలో పూర్తి వివరాలు, ఆధారాలూ ఉన్నాయి. నేడు మనం తయారు చేస్తున్న సోలార్ కరెంటు గురించి ఆనాడే భరద్వాజ మహర్షి ''క్రియాకాండ'' అను గ్రంథంలో రాశారు. ఆ వివరాలు -

**శ్లో॥ రౌద్రీ భాస్వంతు సంయోగా జ్జాయతే మారికాభిదా ॥**
**విషశక్తి స్తయా సూర్యకిరణాశని సంభవం ॥**

రౌద్రీ దర్పణము వలన జనించే రౌద్రీ శక్తితో, సూర్యకిరణ సంయోగము జరిగేసరికి, మారిక అను గొప్ప విషశక్తి పుట్టును. ఈ మారిక శక్తి వలన సూర్యకిరణములనుండి ప్రచండమైన దుర్నిరీక్ష్యమగు విద్యుచ్ఛక్తి ఉద్భవించునని భావము. ఇది ఖచ్చితంగా సోలార్ విద్యుత్ గురించి అని మీకు అర్థమయ్యే ఉంటుంది.

మేఘమునందలి విద్యుత్‌ను గురించి, ఈశ్వరుడు - ''సౌదామిని కలా'' అనే గ్రంథంలో వర్షఋతువులో మేఘ మండలంలో - **'వారుణీ విద్యుత్; దండా విద్యుత్; మహావిద్యుత్; రావిణీ కా విద్యుత్‌లు''** ఉత్పన్నమగుచుండునని పేర్కొన్నారు.

తోకచుక్కలలో విద్యుత్‌ను గురించి ''క్రియా సారతంత్రము'' లో ఆకాశంలో ఎనిమిదవ మండలంలో ఉన్న మూడుకోట్ల ఎనిమిదివేల తోకచుక్కలూ, విద్యుద్గర్భములు. వీటిలో మహాకాలాదులగు పంద్రెండు తోకచుక్కలలో విద్యుత్ ఎంతో ఎక్కువగా ప్రసరించునని చెప్పబడింది. వీటి పేర్లను అగస్త్య మహర్షి ''శక్తి మంత్రము'' లో చెప్పారు. ''ఖేటక సర్వస్వము''

అనే గ్రంథంలో జైమిని మహర్షి సూర్య విద్యుత్‌తో పాటు తోకచుక్కల విద్యుత్ కూడా కలిసి ఉండునని చెప్పారు.

నేడు బ్యాటరీలద్వారా తయారగు రాసాయనిక విద్యుత్ గూర్చి చెప్పాలంటే పూర్వం రసాయనిక విద్యుత్‌నే అధికముగా వాడినట్లు ఆనాటి గ్రంథముల వలన తెలుస్తోంది. 'సౌదామినీ కలా'' యందు పన్నెండు విధములైన విద్యుత్‌లు, వాటి పనితీరులు విశదపరచబడినవి.

మన ప్రాచీన ఋషులు ''బృహద్యంత్ర సర్వస్వము'' మున్నగు గ్రంథములందు విమానములలో విద్యుద్యంత్రములు నెలకొల్పి విద్యుత్ ప్రసారమునకు తీగలు, బటన్స్, స్విచ్‌లు అమర్చు పద్ధతులు తెలిపియున్నారు. **''త్వత్నిర్గయా కారవము''** అను గ్రంథమునందు కరెంటు షాకు తగులకుండా ఉండేటందుకు విద్యున్నిరోధకములగు కొన్ని చర్మముల గురించి తెలియజేశారు అంటే ఆనాడు వారు కరెంటు తయారు చేయడమే కాక, దాన్ని స్వప్రయోజనాలకు వినియోగించుకునేవారని, వినియోగించుకొన్నారని సుస్పష్టము.

నేడు పాశ్చాత్యులచే కనుగొనబడినదని భావింపబడే కరెంటు - కోట్లాది సంవత్సరాలకు పూర్వమే మన ప్రాచీన మహర్షులు కనుగొన్నారంటే ఆశ్చర్యపోక చేసేదేమీ లేదు. భారతీయ మేధాసంపత్తి ఎంత గొప్పదో మనకర్థమవుతోంది కదా! అలాంటి ప్రాచీన మేధావులు, ఋషులు, మహర్షులను కన్న వేదావాఙ్మయమునకు పట్టుగొమ్మ అయిన ఈ పుణ్యభూమిలో జన్మించిన మనం పునీతులం, ధన్యులం అయినాము. మన హృదయం సంతోషానంద పులకాంకితము కావడం లేదా!

**- మామిళ్లపల్లి వెంకట రామకృష్ణారావు**

**(విశ్వరచన, సూర్యశక్తి పత్రికల సౌజన్యంతో)**

**కదాచ నాస్తమేతి, నోదేతి' - ఐతరయే బ్రాహ్మణం**
**భూమికి పైగా వెళ్ళిచూస్తే సూర్యుని**
**ఉదయాస్తమయాలు ఉండవు.**

# ప్రాచీన సూర్యకిరణ చికిత్సలు సంధ్యా అగ్నిహోత్రాలు

ప్రాచీనకాలంలో ప్రజల జీవన విధానం, సంస్కృతి, సభ్యత, సదాచారం అన్నీ ప్రాకృతిక శక్తులకు దగ్గరగా ఉండేవి. ప్రత్యేకించి చికిత్సా పద్ధతులేవీ అవసరం ఉండేవి కాదు. అందుచే ప్రాచీన ఆయుర్వేద గ్రంథాలలో సూర్యకిరణ చికిత్స పేరుతో పెద్దగా చికిత్సలు లేవు. ఇంతేగాక, వివిధ ఆహార పదార్థాలలో, మూలికలలో, ఖనిజాలలో అనేక రంగులు దృశ్యంగాను, అదృశ్యంగాను ఉండే ఉంటాయి. ఈ రంగులన్నీ సూర్యకిరణ సంయోగంవల్ల కలిగినవే. వాటిని మనం ఆహారంగా, ఔషధంగా తీసికొన్నప్పుడు అవి మనలో ఆయా రంగుల గుణాలను వృద్ధి చేస్తాయి. వాటిపైనే మన శరీర తత్త్వము, ఆరోగ్యము ఆధారపడి ఉంటాయి. మన శరీరంలో ప్రధానంగా వాతము, పిత్తము, శ్లేష్మము అను మూడు ద్రవ్యాలు ఉంటాయి. వీటినే ఆయుర్వేదం దోషములు అంటుంది. వీటిని సరళంగా చెప్పాలంటే గాలి, అగ్ని, నీరు అని చెప్పవచ్చును. ఇందు అగ్ని సూర్యుని నుండి వచ్చినదే అసలు సూర్యుడే లేకపోతే భూమిపై వృక్ష జాతులే ఉండేవి కావు. ఇక ప్రాణి జాతు లెట్లుండును?

పూర్వము పట్టణాలు ఏవైనా నదీ తీరంలో ఉండేవి. వాటి చుట్టూ ఉపవనాలు ఉండేవి. అందరు ఉదయం 4 గంటలకే నిద్ర లేచి ఈశ్వరోపాసన చేసేవారు. తదుపరి ఉపవనాలకు వెళ్ళి భ్రమణం (నడక) చేసేవారు. ప్రాకృతిక ఉషస్సుల ఆనందాన్ని పొందేవారు. మనం పూర్వ ప్రకరణంలో తెలిసికొన్న వేదం చెప్పే ఉషస్సుల గుణాలను పొందేవారు. శారీరకంగా, మానసికంగా ఆరోగ్యాన్ని పొందేవారు. పిమ్మట నదిలో స్నానం చేసి సూర్యోదయ సమయంలో సూర్యాభిముఖులై సంధ్యావందనం (పరమేశ్వర ప్రార్థన) చేసేవారు. దానివల్ల ప్రభాత సూర్యకిరణాలలో ఉండే సుగుణాలన్నీ వారికి లభించేవి. అనంతరం ఇంటికి వచ్చి అగ్నిహోత్రం చేసేవారు. అగ్నిహోత్రం వల్ల కలిగే లాభాలేమో ముందే తెలిసి కొన్నాము కదా! మరల సాయంత్రం సూర్యాస్తమయ సమయములో అగ్నిహోత్రం చేసుకొని సాయం ఉషస్సుల మధురానుభూతి పొందుటకు ఉపవనాలకు వెళ్ళి విహరించేవారు. మరల

స్నానం చేసి ఏకాంతంగా సంధ్యావందనం చేసుకొని యింటికి తిరిగి వచ్చేవారు. ఈ దినచర్యలో సదాచారంలో సూర్యకిరణ చికిత్స యిమిడియే యున్నది. అందుచే ప్రత్యేక చికిత్సా పద్ధతులేమీ ఆయుర్వేదంలో కనబడవు. ఇచ్చట మరొక ఆధ్యాత్మిక విషయం తెలిసికొనుట అవసరం.

సంధ్యోపాసనను కొందరు భౌతిక సూర్యుని ఉపాసనగా భావింతురు. ఇది సరికాదు. సంధ్యామంత్రాలలో సృష్టికర్తయైన పరమేశ్వరుని ప్రార్థనయే ఉన్నది. గాయత్రీ మంత్రములోని 'సవితుః' పదానికి సృష్టికర్తయైన పరమేశ్వరుని పరంగానే అర్థం చెప్పుకోవాలి. అతడే మనలోని అవిద్యాది సమస్త క్లేశాలను పోగొట్టగలడు. సర్వాంతర్యామియైన యతడే మన బుద్ధులను సత్కార్యాలలో ప్రేరేపించగలడు. భౌతిక సూర్యునికి అట్టి శక్తి లేదు. అది ఒక జడదేవత. అనగా జ్ఞానం లేని ప్రాకృతిక పదార్థం. ఆ సూర్యదేవత నుండి భౌతిక లాభాలే నెరవేరుతాయి. ఆ కిరణాలతో కాగల ప్రయోజనాలేమిటో తెలిసికొని వాటిని పొందుటయే భౌతిక సూర్యోపాసన కాగలదు.

## సూర్యనమస్కార వ్యాయామం

సూర్యనమస్కారాల పేరుతో చేసే వ్యాయామం కొన్ని ఆసనాల సంపుటి. ఇవి సూర్యోదయ సూర్యాస్తమయ కాలాలలో సూర్యాభిముఖులై కొద్ది ఎండ ఉన్నప్పుడు చేస్తే వ్యాయామ లాభంతో బాటు సూర్య కిరణాల వల్ల ఆరోగ్య లాభం కూడా కలుగుతుంది. వీటిలో ప్రాణాయామం కలిసి ఉంటుంది. కనుక ఆ లాభం కూడా వస్తుంది. ఈ వ్యాయామం చాలా సరళమైన సమగ్రమైన వ్యాయామం. 8 సంవత్సరములు పైబడిన స్త్రీ, పురుషులంతా చేయవచ్చు. వీటివల్ల శరీరములోని అన్ని అంగాలకు, అవయవాలకు, బహిష్కారావయవాలకు నాళికా అనాళికా గ్రంథులకు వ్యాయామం కలుగుటవల్ల మంచి ఆరోగ్యం, ఇంద్రియ పటుత్వం శారీరక మానసిక బలం, ఏకాగ్రత, సదాచార సచ్ఛీలములు, దీర్ఘాయువు లభిస్తాయి. ఆ ఆసనాల క్రమం ఈ విధంగా ఉంటుంది.

1) నమస్కారాసనము (అవస్థానమ్): కేవలం లంగోటి ధరించి లేదా వీలైనంత తక్కువ దుస్తులతో ఈ ఆసనములు వేయుట మంచిది. సూర్య కిరణాలు ఎంత ఎక్కువగా మన శరీరంపై ప్రసరిస్తే అంత మంచిది. స్త్రీలు

అందుకు తగిన ఏర్పాట్లు చేసుకోవలెను. ఇచ్చట ఈ వ్యాయామ ప్రక్రియ సూచనప్రాయంగా మాత్రమే తెలుపుట జరుగుతున్నది. వీటిని తెలిసినవారి వద్ద అభ్యసించుట మంచిది. సూర్యాభిముఖముగా నిలబడి రెండు చేతులు జోడించి హృదయానికి ఆనించి నిటారుగా ఏకాగ్రతతో నిలబడవలెను.

**2. హస్తోత్తానాసనము :** చేతులను క్రిందకు దించి నెమ్మదిగా గాలిని పీల్చుకొనుచు రెండు చేతులను సమానంగా నెమ్మదిగా పైకి ఎత్తవలెను. శ్వాసను కుంభించియే ఉంచవలెను. పైనుండి క్రిందివరకు నిటారుగా ఒక కట్టెవలె వుండవలెను. కొద్దిగా వెనుకకు వంగుట కూడా మంచిదే. తదుపరి

**3. పాద హస్తాసనము (జానునాసనమ్) :** గాలిని కుంభించియే నెమ్మదిగా ముందుకు వంగుట ప్రారంభించి చేతులు మోకాళ్లకు తిన్నగా వచ్చుట తోడనే శ్వాసను నెమ్మదిగా వదిలిపెడుతూ మోకాళ్లు వంగకుండా రెండు అరచేతులను పాదములపై మోపుటకు ప్రయత్నించవలెను. క్రమాభ్యాసం వలన ఇది సాధ్యమగును. పిమ్మట

**4. అశ్వ సంచాలనాసనము (ఊర్ధ్వేక్షణమ్)** :చేతులనట్లే కాళ్లముందు భూమిపై లేదా వస్త్రముపై మోపియుంచి, ఎడమ కాలును కూడా అట్లే యుంచి కుడికాలును వెనుకకు జాచి, దాని మోకాలును, వ్రేళ్లను భూమికానించి, ఎడమ కాలును మడచి ఛాతీని శిరస్సును వీలైనంతవరకు వెనుకకు వంచి ఆకాశమును చూడవలెను. ఎడమకాలి మోకాటిని రెండు చేతుల మధ్య ముందుకు పొడిగించి శ్వాసను నెమ్మదిగా పీల్చుకుని బిగపట్టవలెను. దీనిని వామకుంచిత భుజంగాసనము అని అనవచ్చును. అనంతరం

**5. పర్వతాసనము (తులితవపుః) :** శ్వాసను కుంభించియే యుంచి ఎడమ కాలును వెనుకకు చాచి కుడికాలుతో జోడించి కర్రవలె వంకర లేకుండా ఉండవలెను. దండాసనము వలె నగును. తదుపరి

**6. సాష్టాంగాసనము :** చేతులను వంచి శ్వాసను విడిచిపెట్టుచూ మోకాళ్లను భుజములను, నుదురును నేలపై ఆనించవలెను. పిమ్మట

**7. భుజంగాసనము (కశేరు సంకోచమ్) :** కాళ్లను, చేతులను అట్లేయుంచి శ్వాసను నెమ్మదిగా పీల్చుచు తలను పైకి ఎత్తుచు ఆకాశమును చూడ ప్రయత్నించవలెను. అటుపిమ్మట

8. కశేరు వికాసనమ్ :చేతులను అట్లే యుంచి నడుమును పైకెత్తుచు పాదములను నేలపై మోపవలెను. గడ్డమును ఛాతీకి ఆనించి నాభిని చూడవలెను.

తదుపరి వెనుక క్రమములో అశ్వ సంచాలనాసనము, పాద హస్తాసనము, నమస్కారాసనము వేయవలెను. ఈ క్రమము ఒక సూర్య నమస్కారమైనట్లు తలంచవలెను. ఈ విధముగా ఎన్నిసార్లు వేయగలిగితే అన్నిసార్లు వేయవచ్చును.

ఈ వ్యాయామము చేసేటప్పుడు సూర్యునికి నమస్కరిస్తూ కొన్ని మంత్రాలు (వాక్యాలు) చదివే అభ్యాసం కొందరికి ఉంది. అవి ఈ విధంగా వుంటాయి.

1. ఓం మిత్రాయ నమః
2. ఓం రవయే నమః
3. ఓం సూర్యాయ నమః
4. ఓం భానవే నమః
5. ఓం ఖగాయ నమః
6. ఓం పూష్ణే నమః
7. ఓం హిరణ్యగర్భాయ నమః
8. ఓం మరీచయే నమః
9. ఓం ఆదిత్యాయ నమః
10. ఓం సవిత్రే నమః
11. ఓం అర్కాయ నమః
12. ఓం భాస్కరాయ నమః

ఈ 12 పేర్లు సూర్యునియొక్క 12 గుణాలను తెలుపుతాయి. వీటి అర్థాలు మనం సూర్యుని నామాలు అనే ప్రకరణంలో తెలుసుకున్నాము. ఇందలి 'ఓం' పదం కేవలం పరమేశ్వరునికే వర్తిస్తుంది. భౌతిక సూర్యునికి వర్తించదు. పరమేశ్వరునియందును ఆ గుణాలు ఉండుటచే ఇవి పరమేశ్వరునికిని వర్తించును. అయితే ప్రకరణాన్ని బట్టి అర్థం చేసుకోవలసి వుంటుంది.

పై వాక్యాల చివరి 'నమః' పదానికి నమస్కరించడం అనే సామాన్యార్థమే కాక సత్కరించుట, గౌరవించుట, ఆదరించుట లేదా వాటి గొప్ప గుణాలు గుర్తించుట అనే అర్థాలుకూడా ఉన్నాయి. విచిత్రమేమిటంటే ఈ పదానికే అన్నము పెట్టుట, నమనము చేయుట = శిక్షించుట అనే అర్థాలుకూడా ఉన్నాయి. కనుక సందర్భాన్ని బట్టి (కాంటెక్స్టను బట్టి) అర్థం చెప్పుకోవలసి వుంటుంది. మన నమస్కారాన్ని స్వీకరించలేని స్పందించలేని ప్రతి జడపదార్థానికి చేతులెత్తి నమస్కరించడం సరియైన పద్ధతికాదు. వాటి గొప్ప

గుణాలను గుర్తించి వాటిని ఏ ప్రయోజనంకోసం పరమేశ్వరుడు సృష్టించాడో తెలుసుకుని వాటినందుకే వినియోగించుకోవాలి. అప్పుడే జడపదార్థాలకు నమస్కారం చేసినట్లు అవుతుంది.

కొందరు పై 12 వాక్యాలకు హ్రాం, హ్రీం, హ్రూం మొదలగు బీజాక్షరాలను కలిపి ఉచ్చరించాలంటారు. కాని, ఇట్టి పద్ధతులు ప్రాచీన శాస్త్రాలలో కనబడవు. ఇవి మధ్యకాలంలో వచ్చిన తాంత్రిక పూజలకు చెందినవి కావచ్చును. వీటి అర్థాలు ఏవోకూడా తెలియదు. కొందరు సూర్యాష్టకము, మండలాష్టకము, ఆదిత్య హృదయము మొదలగు స్తోత్రములు పఠింతురు. వీటికి పరమేశ్వరుని పరంగాను, భౌతిక సూర్యుని పరంగాను రెండు విధాల అర్థం చెప్పుకునే అవకాశం వుంది. పైన చెప్పినట్లు భౌతిక పదార్థాల గుణాలను తెలుసుకొని తగిన ప్రయోజనాలను పొందటమే ఉత్తమం. వేదంలో జడ పదార్థాలకు నమః చెప్పడం చాలా చోట్ల కనబడుతుంది. ఉదాహరణకు ఒక వేద మంత్రానికి అర్థం తెలుసుకుందాము.

**ప్రాచీ దిగగ్నిరధిపతి రసితో రక్షితాదిత్యా ఇషవః।**
**తేభ్యోనమో ఽధిపతిభ్యోనమో రక్షితృభ్యోనమ**
**ఇషుభ్యోనమ ఏభ్యో అస్తు।**
**యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మస్తంవో జమ్భే దధ్మః॥**
**(అథర్వ 3-27-1)**

**ప్రాచీదిక్ అగ్నిః అధిపతిః** = తూర్పు దిశలో ప్రకాశ స్వరూపుడైన పరమేశ్వరుడు అధిపతిగానుండి

**అసితః రక్షితా ఆదిత్యాః ఇషవః** = ఆదిత్య (సూర్య) బాణముతో చీకటిని పారద్రోలుచు రక్షించుచున్నాడు.

**తేభ్యో నమః** = అట్టి పరమేశ్వరునికి నమస్కారము

**అధిపతిభ్యః నమః** = తన ప్రకాశ శక్తితో విశ్వమునకధిపతిగా కొలువైయున్న పరమాత్మకు వందనములు.

**రక్షితృభ్యోనమః** = అంధకార రక్షకునకు నమస్సులు

**ఇషుభ్యో నమః** = అతని బాణరూప ఆదిత్యునకు (భౌతిక సూర్యునకు) నమస్కారము

**ఏభ్యః అస్తు** = పరమేశ్వరునికి, అతని ప్రకాశ శక్తికి, అతని ఆదిత్య బాణమునకు మరొకసారి వందనములు.

**యః అస్మాన్ ద్వేష్టి, యం వయం ద్విష్మః** = ఎవరు మమ్ములను ద్వేషించుచున్నారో, మేము ఎవరిని ద్వేషించుచున్నామో

**తం వః జమ్భే దధ్మః** = అట్టి పరస్పర ద్వేష భావమును ఓ పరమేశ్వర! నీ న్యాయరూప బాహువుల కర్పించుచున్నాము. (నీవే మాకు రక్షకుడవు) న్యాయాధీశుడవు. కాన తగిన న్యాయము చేయుము. మేము పరస్పర ద్వేష రహితులమై నీ ఆజ్ఞల పాటించుచు సామాజిక జీవనము గడుపుదుము గాక అని భావం.

పై వేద మంత్రములో భౌతిక సూర్యుడు పరమేశ్వరుని బాణంగా వర్ణింపబడింది. మనను ఎన్నో కష్టాలనుండి, బాధలనుండి రక్షించే ఆ సూర్య బాణానికి నమస్కరించాలి. అనగా ఆ సూర్యునివల్ల కలిగే ప్రయోజనాలేవో తెలుసుకొని లాభాన్ని పొందాలి అని అర్థం.

## సూర్యకిరణ స్నానం

సూర్య నమస్కార వ్యాయామం చేయలేకపోయినా అందరూ సూర్యకిరణ స్నానం చేయవచ్చు. వీలైనంత తక్కువగా దుస్తులు ధరించి ఉదయ సాయంకాలములందలి నీరెండలో విహరించుటయే సూర్యకిరణ స్నానం. ఉదయం సూర్యుడు ఉదయించినప్పటినుండి వేసవికాలంలో ఒక అరగంట లేదా ఒక గంట లోపుగాను, శీతాకాలంలో రెండు గంటల లోపుగాను, ఈ చికిత్స చేసుకోవడానికి అనుకూలంగా వుంటుంది. సాయంత్రం సూర్యాస్తమయానికి ఒక గంట ముందునుండి ఈ చికిత్స ప్రారంభించడం మంచిది. ఈ చికిత్సకు ముందు శరీరానికంతటికి కొద్దిగా నూనె రాసుకుని లేదా మర్దన చేసుకుని చేయడం ఎక్కువ లాభకరం. నూనె రాసుకోవడంవల్ల చర్మ రంధ్రాలు వికసించి కొంత క్రొవ్వు పదార్థం శరీరంలోకి ఇంకుతుంది. అప్పుడు సూర్యకిరణాలవల్ల మన శరీరంలో విటమిన్ 'డి' తయారుకావడానికి ఎక్కువ అనుకూలంగా ఉంటుంది. లేకుంటే ఆ సమయంలో ఒకవేళ చల్లటి గాలి వీస్తే చర్మం దెబ్బతింటుంది. మన శరీరోష్ణాన్ని కాపాడడానికి చర్మ రంధ్రాలు మూసుకుపోతాయి. అందుచే చర్మం బిర్రబిగిసి పొడారిపోతుంది. పెళుసుబారడం, పగుళ్లు ఏర్పడడం కూడా జరుగవచ్చు. కాన ఈ దురవస్థనుంచి కాపాడుకోవడానికి నూనె

రాసుకోవడమే మంచిది. తదుపరి స్నానం చేసేటప్పుడు పిండితో రుద్దుకుంటే నూనె జిడ్డు పోయి చర్మం నిగనిగలాడుతుంది. సబ్బులలో కాస్టిక్ షోడా వుంటుంది. అది చర్మానికి మంచిది కాదు. కాన, వాడకుండుట మంచిది.

ఈ చికిత్సకు ముందు కొద్ది మంచినీరు త్రాగడం మంచిది. ఎండదెబ్బ తగలకుండా వుంటుంది. విదేశాలలో ఈ చికిత్స పేరుతో కొందరు నగ్నంగానే విహరిస్తున్నారు. ఇది సభ్యత కాదు. ఇంతేగాక తలకు, మర్మావయవాలకు అధిక శీతోష్ణాలనుండి రక్షణ కావాలి. అందుకే పరమేశ్వరుడు వాటిపై వెంట్రుకలు సృష్టించాడు. కాన తలకు ఒక గుడ్డ చుట్టుకుని మర్మావయవాలకు గుడ్డలు ధరించి ఈ చికిత్స చేసుకోవాలి. తిరుగలేని బలహీనులు కూర్చోవచ్చును. లేదా పడుకోవచ్చును. సూర్యకిరణాలను ఉదయం పృష్ఠభాగంనుండి (వెనుకవైపునుండి) సాయంత్రం అభిముఖంగాను సేవించాలని పెద్దలంటారు. ఈ పద్ధతి ఆరోగ్య దృష్ట్యా అవసరమే. ఉదయం సూర్యాభిముఖంగా ప్రకృతి సౌందర్యాన్ని చూడడం కష్టమే అవుతుంది. అప్పుడు సూర్యుని చూడడం కంటికి ప్రమాదకరం కావచ్చు.

**ముంచామి త్వా హవిషా జీవనాయ**
**కమజ్ఞాత యక్ష్మాదుత రాజయక్ష్మాత్।**
**గ్రాహిర్జగ్రాహ యద్యేతదేనం తస్యా ఇన్ద్రాగ్నీ**
**ప్ర ముముక్తమేనమ్॥ (అథర్వ. 3-11-1)**

ఓ వ్యాధిగ్రస్థుడా ! నీకు నేను శ్రద్ధతో చికిత్స చేతును. నిన్ను అజ్ఞాత యక్ష్మాది రోగముల నుండియు, ప్రకటమైయున్న రాజయక్ష్మాది రోగముల నుండియు విడిపింతును. నిన్ను పట్టిపీడించుచున్న గ్రాహిని (బాధలను) ఇంద్రాగ్నులతో చికిత్స చేసి విడిపింతును. (ఇంద్రాగ్నులనగా చంద్ర సూర్యులు లేదా విద్యుత్ అగ్నులు లేదా చల్లటి వేడి చికిత్సలని అర్థము)

# ఆధునిక సూర్యకిరణ చికిత్సలు

## రంగు కిరణాల స్వరూప స్వభావాలు

ఈ చికిత్సలను గురించి తెలుసుకోబోయే ముందు సూర్యకాంతిలో ఉండే వివిధ రంగులను గురించి, వర్ణ సిద్ధాంతం గురించి తెలుసుకోవడం అవసరం. ఈ చికిత్సలన్నీ వాటిపైననే ఆధారపడి వున్నాయి. మన కంటికి తెల్లగా కనబడే సూర్యకాంతి నిజంగా తెల్లనిది కాదు. అది ఏడురంగుల కలయికవల్ల ఏర్పడిన మిశ్రమ రంగు. ఈ విషయం ఆకాశంలో ఇంద్రధనుస్సు ఏర్పడినప్పుడు మనకు తెలుస్తుంది.

వర్షాకాలంలో వాతావరణం నీటి తుంపరలతో కూడి ఉన్నప్పుడు వాటి గుండా సూర్యకిరణాలు ఏటవాలుగా ప్రసరించడం తటస్థిస్తే ఇది ఏర్పడుతుంది. లేదా మనం ఒక చీకటి గదిలో త్రికోణాకారం గల గాజుపట్టకం (ప్రిజమ్) గుండా యుక్తితో సూర్యకిరణాలను ప్రసరింపజేస్తే దాని ఎదురు గోడపై ఈ ఇంద్ర ధనుస్సు ఏర్పడుతుంది. అప్పుడు ఈ ఏడు రంగులను ప్రత్యక్షంగా చూడవచ్చు. అప్పటికి కూడా 3 రంగులే ప్రస్ఫుటంగా కనబడతాయి. మిగతా రంగులు వీటి మిశ్రిత రంగులే.

గాజు పట్టకం గుండా సూర్యకాంతిని ప్రసరింపజేసినప్పుడు తెరపై ఏడు రంగులు కనబడతాయి. అవి క్రిందనుండి పైకి వరుసగా

1. ఊదా రంగు (వయొలెట్) V
2. ముదురు నీలం (ఇండిగో) I
3. ఆకాశ నీలం (బ్లూ) B
4. ఆకుపచ్చ (గ్రీన్) G
5. పసుపు పచ్చ (యెల్లో) Y
6. నారింజపండురంగు (ఆరెంజ్) O
7. ఎరుపు రంగు (రెడ్) R

వీటి క్రమాన్ని తేలికగా గుర్తుపెట్టుకోవడానికి ఆంగ్లపదాలలోని మొదటి అక్షరాలను వరుసగా కలిపి 'విబ్జియార్' (VIBGYOR) అనే పదంగా నిర్మించి ప్రయోగిస్తున్నారు.

దైవనిర్మితమైన మానవనేత్రం ఈ ఏడు రంగులను, వీటి మిశ్రమాలతో

ఏర్పడిన వందల వేల రంగులను చూడగల అద్భుత సాధనం. అందుకోరకు పరమేశ్వరుడు మన చిన్నకంటిలో కాంతికి స్పందించే పదమూడు కోట్ల ఫోటో రెసెప్టార్‌లతో కూడినరెటీనాను (కంటి వెనుక భాగంలోని తెరవంటి దానిని) నిర్మించాడు. అందులో వేలాది రంగులను గుర్తించగలిగే అరవై లక్షల 'కోన్స్ అమర్చాడు. వెలుతురులోని తేడాలను గుర్తించే 'రాడ్స్' నిర్మించాడు. మనం చూచిన వస్తువు యొక్క దృశ్యం కంటి తెరకు చేరిన తక్షణం (సెకండులో వెయ్యోవంతు కాలంలోనే) విశ్లేషించగల నాడీ వ్యవస్థను ఏర్పాటు చేసాడు. అందుచేతనే మన ఋషులు **'సర్వేంద్రియాణాం నయనం ప్రధానం'** అన్నారు. అట్టి అమూల్యమైన ఇంద్రియాన్నిచ్చిన పరమేశ్వరునికి మనం ఎంత ఋణ పడి ఉన్నామో! వేరే ప్రాణులకు ఇన్ని రంగులను గుర్తించే శక్తి లేదు. ఏవో 1, 2 రంగులను మాత్రమే చూడగలవు.

ఇవి అన్ని విద్యుదయస్కాంత కిరణాలే అయినా వాటి తరంగాల దీర్ఘతలో స్వల్పమైన వ్యత్యాసాలు ఉండటంవల్ల 7 రంగులుగా కనబడతాయి. వీటిలో అన్నిటికన్న ఊదారంగు కిరణం (Violet) పొట్టిది. దీని తరంగ దీర్ఘత 0.4 ...మీటరు. (... మీటరు అనగా మైక్రో మీటరు. అంటే మిల్లీ మీటరులో వెయ్యవ వంతు) అన్నిటి కంటె పొడవైనది ఎరుపు. దీని తరంగ దీర్ఘత 0.7 .. మీ. దీనికన్న పొడవైన పరారుణ మొదలగు రేడియో తరంగాలు మనకు కనబడవు. అట్లే వీటికన్న పొట్టివైన అల్ట్రావైలెట్, ఎక్స్, గామా కిరణాలు కూడా మన కంటికి కనబడవు. అందుచే ఈ చిన్న పరిమితిగల కిరణాలకే దృగ్గోచర వర్ణపటం అనే పేరు వచ్చింది. ఈ 7 రంగులు సూర్యకాంతి నుండే కాక ఏ దీపపు కాంతినుండైనా వెలువడతాయి. కాని, చికిత్స కొరకు సూర్యుని నుండి వెలువడే రంగు కిరణాలే శ్రేష్ఠము.

సృష్టిలో మనకు కనబడే వివిధ రంగులన్నీ ఈ ఏడు రంగుల నుండి కలిగినవే. 2, 3 లేదా ఎక్కువ రంగులను వివిధ పాళ్ళలో కలిపి వందల, వేల రంగులను (Shadesను) తయారు చేయవచ్చు. మన శరీరంలోని అవయవాలన్నీ ఏదో రంగుని కలిగి ఉంటాయి. వాటిలో సహజంగా ఉండవలసినంత రంగుకన్న ఎక్కువ ఉన్నా, తక్కువ ఉన్నా అనారోగ్యం కలుగుతుంది. మరల ఆ రంగులను సరి చేస్తే అనారోగ్యం పోయి స్వస్థత చేకూరుతుంది. అట్లే మనం తీసుకునే ఆహార పదార్థాలన్నింటిలోను ఏవో కొన్ని రంగులు ఉంటాయి. ఆహారంలోని పోషక శక్తులు మనకు పోషణ

నిచ్చినట్లే ఆయా రంగులు మన శరీరంలో ఆయా రంగులను వృద్ధి పరుస్తాయి.

**ఆరోగ్యంపై రంగుల ప్రభావం:** విటమిన్లు, ఖనిజ లవణాదులు తక్కువయితే (లేదా ఎక్కువైతే) ఆరోగ్యం చెడినట్లే. ఈ రంగులు తక్కువైనా, ఎక్కువైనా ఆరోగ్యం చెడుతుంది. అప్పుడు తక్కువైన రంగులను పూరించటం, ఎక్కువైన రంగులకు విరుగుడుగా వ్యతిరేక రంగులను ప్రసరింపచేయటంచేయవలసి ఉంటుంది. ఆహార పదార్థాలలోని రంగులను కనిపెట్టడం కష్టం. వాటిని గుర్తించడానికి ఎన్నో పరికరాలు అవసరం. అప్పటికీ మనం మిశ్రమాహారం తీసుకుంటాము కనుక వాటిలోని రంగుల పరిమాణాలను లెఖ్ఖ కట్టడం కష్టం. అందుచే సూర్యకిరణాల ద్వారా ఆయా రంగులను స్వీకరించి పూరించుకోవడం సులభం. అది అందరికీ అందుబాటులో ఉంటుంది.

మన శరీరంలో ఏ రంగు ఎక్కువయ్యింది, ఏ రంగు తక్కువయ్యింది అని తెలుసుకోవడం కూడా కష్టమే. అయినా మనకు కలిగే వ్యాధులను బట్టి, బాధలను బట్టి, మిగిలిన లక్షణాలను బట్టి లోపించిన లేదా ఎక్కువైన రంగులేవియో తెలిసికోవచ్చును. అందుచే ఇది కూడా లాక్షణిక చికిత్సయే.

## మందులలో రంగులు

మనం మందుల రూపంలో వాడే మూలికలలో, ఖనిజాలలో, వజ్రాలలో, వివిధ మందులలో ఆయా గుణాలు వాటిలో ఉండే రంగును బట్టే కలుగుతాయి. ఉదాహరణకు - మిరప కాయలు, ఎఱ్ఱ దేవదారు, బ్రొమైన్ ఐరన్ ఆక్సైడ్ మొదలగునవి గాఢమైన ఎరుపును కలిగి ఉంటాయి. ఈథర్, ఆల్కాహోలు, అమోనియా, పొటాషియం, హైడ్రోజన్ స్పెక్ట్రోస్కోపు ద్వారా చూస్తే ఎఱ్ఱగా కనబడతాయి. వీటిని వైద్యశాస్త్రం 'వేడి చేసేవి', ఉద్రేకింప చేసేవి, నాడీ రక్త ప్రవాహ వేగాలను ఎక్కువ చేసేవి అని చెబుతుంది. పైగుణాలు కలిగిన వేరే ఏ మూలికను చూసినా ఎఱుపు రంగు కనబడుతుంది. సామాన్య కంటికి అది కనబడక పోయినా స్పెక్ట్రోస్కోపు పరికరం ద్వారా చూస్తే కనబడుతుంది.

కుంకుమ పువ్వు, ఆవాలు, చేదు పుచ్చ, పసుపు, అల్లము, గంధకము, నేల తంగెడు మొదలగునవి పసుపు, నారింజ పండు రంగులలో ఉంటాయి. అందుచే ఇవి మెదడును, నరాలను ముఖ్యంగా జీర్ణావయవాలకు చెందిన

నరాలను ఉత్తేజ పరుస్తాయి. విరేచన కారక ఔషధాలన్నిటిలో పసుపురంగు ఉంటుంది. కొన్ని తీవ్రమైన విరేచన కారకాలలో పసుపుతో పాటు కొద్ది ఎరుపురంగు కూడా కలిసి ఉంటుంది. మూత్రకారక, వమన కారక తీవ్ర ఔషధాలలోను, మెదడును ఉత్తేజ పరచు ఔషధాలలోను పసుపు, ఎరుపు రంగులు కలిసి ఉంటాయి. ఎరుపు రంగుకు రక్తాన్ని ఉత్తేజింపచేసే శక్తి ఉంది. మన కాలేయంలో తయారగు పైత్యరసం కొద్ది ఆకుపచ్చ కలిసిన పసుపు రంగులో జీర్ణకారిగా, విరేచన కారిగా పని చేస్తుంది.

ఇక ముదురు నీలం, ఆకాశ నీలం, ఊదా (వైలెట్) రంగులను గురించి ఆలోచిద్దాము. వసనాభి, నల్ల ఉమ్మెత్త, డిజిటాలిస్, ఎర్గాట్, తొగర చెక్క, నీలి మందు, ఫాస్పారిక్ యాసిడ్, సల్ఫ్యూరిక్ యాసిడ్, నైట్రిక్ యాసిడ్, హైడ్రో క్లోరిక్ యాసిడ్, టార్టారిక్ యాసిడ్, మైలతుత్తము, అన్నభేది, నేరేడుపండు, క్లోరోఫారమ్ మొదలగు మందులలో ఈ నీలం రంగులు ఉంటాయి. అందుచేతనే యివి తాపశాంతి, మేహశాంతి, దాహశాంతి కలుగ చేసేవి గాను, చలువ చేసేవి గాను ఉంటాయి. రక్త స్రావాలను, కొంకర్లను నివారిస్తాయి. నిద్రను కలిగిస్తాయి. క్రిమి సంహారకములుగాను, బలకరమైనవి గాను కూడా ఉంటాయి. రంగు గుణాలను గురించి వివరంగా వచ్చే ప్రకరణంలో తెలుసుకుందాము. ఇక్కడ ముఖ్యంగా గుర్తించ వలసింది ఏమనగా సూర్యుని యొక్క రోగనివారక శక్తే ఆహారంలో, మందులలో రంగుల రూపంలో దాగి ఉంది. అదే మనకు ఆరోగ్యాన్ని యిస్తున్నది. రంగులు కేవలం అందం కొరకే కాదు ఆరోగ్యం కొరకు కూడా అని గుర్తించాలి.

> **యొజనానాం సహస్రేద్వే ద్వేశతే ద్వేచ యోజనే ।**
> **ఏకేన నిమేషార్ధేన క్రమమాణ నమో z స్తుతే ॥**
>
> (ఒక ఖగోళ విజ్ఞాన గ్రంథం)

రెప్పపాటుకాలంలోని సగం సమయంలో సూర్యకాంతి 2, 202 యోజనాలు పయనిస్తుంది.

నిమేష మనగా రెప్పపాటుకాలం - 16/75 సెకండ్లు

యోజన మనగా - 8 మైళ్ళ కన్న కొంత ఎక్కువ (13 లేక 14 కి.మీ)

పై లెఖ్ఖ ఆధునిక విజ్ఞానానికి చాలా దగ్గరగా ఉంది.

# ఆధునిక చికిత్సల ఆవిష్కర్తలు

ఈ ఆధునిక చికిత్సలు పాశ్చాత్య దేశాలలో ప్రారంభమైనవి. వీటిని మొదటగా ప్రారంభించిన వ్యక్తి జనరల్ పంలిజన్ హోన్ అని చెబుతారు. తదుపరి డా. పేన్‌స్కాట్, డా. రాబర్ట్ బోహలెండ్ అను వారు వీటిని కొంత విస్తృత పరచారు. పిమ్మట డా. ఎడ్విన్ బాబిట్ అనేక ప్రయోగాలు చేసి దీనిని హేతుబద్ధమైన చికిత్సగా నిరూపించారు. ఎన్నో వ్యాసాలు వ్రాసి ప్రపంచ మేధావుల దృష్టిని ఆకర్షించారు. 4, 5 గ్రంథాలు వ్రాసి ఈ చికిత్స కొక చక్కటి రూపాన్ని తీసుకు వచ్చారు.

డా. బాబిట్‌గారు తమ పరిశోధనల సారాంశాన్ని ఒకచోట ఈ విధంగా వ్రాస్తారు.

"Light is a material substance as well as the result of certain vibratory laws of motion in the atoms through which it passes and each of the colours which combines to form the full ray of light, has a special grade of substance with it's own style of power, which is capable of being transmitted as a refined medicine or chemical agent to the human system direct into water or other substances which may be taken in to the stomach, applied externally to the skin etc..."

- HUMAN CULTURE AND CURE (Page 47)

పై బృహద్వాక్య భావమేమంటే - 'కాంతి ఒక భౌతిక పదార్థం. అది దేనినుండి ప్రసరిస్తుందో ఆ పదార్థం నుండి కొన్ని పరమాణువులు (Atoms) విడుదలై వివిధ తరంగ దీర్ఘతలతో (సప్తవిధ కాంతి కిరణాలుగా) ప్రసరిస్తాయి. అవి అన్నీ కలిసిపోయి పూర్ణ ప్రకాశ కిరణంగా (తెల్లగా) మనకు కనబడుతుంది. ఆ (సప్తవిధ) కాంతి తరంగాలు (కిరణాలు) తమవైన దివ్య శక్తులను కలిగి ఉంటాయి. అవి నేరుగా గాని, నీరు మొదలగు పదార్థాల ద్వారా కడుపులోనికి గాని, పై పూతల ద్వారాగాని మానవ శరీరంలో ప్రవేశిస్తే సామాన్య ఔషధాల కన్న ఎక్కువ శోధింపబడిన ఔషధాలుగా పని చేస్తాయి.

'కాంతి' పదార్థమనే పై భావం వేద శాస్త్రాలకు భిన్నమైనది కాదు. ప్రకాశం సూర్యుని యొక్క లేదా అగ్ని, విద్యుత్‌ల యొక్క అవయవం అనే భావించాలి. **'హిరణ్య పాణిః సవితా' (ఋ. 1-35-9) 'హిరణ్య హస్తో అసురః...'' (యజు, 34-26), హిరణ్యపాణిం సవితారం (అ. 3-21-8)**

**హిరణ్య పాణిః సవితా సుజిహ్వాః** (ఋ. 3-54-11) అని వేదం చెబుతుంది. ఇచ్చట హిరణ్యం అంటే బంగారం అని కాదు. **'హిరణ్యం వై జ్యోతిః** - హిరణ్య మనగా జ్యోతి - ప్రకాశం. ప్రకాశము చేతులుగా గల, ప్రకాశము హస్తములుగా గల సూర్యుడు అని పై వేద వాక్యాలకు అర్థం అవుతుంది. మరొక చోట (యజు. 3-9-10లలో) **''సూర్యో జ్యోతిః జ్యోతిః సూర్యః స్వాహా' 'సూర్యో వర్చో జ్యోతిర్వర్చః' 'జ్యోతిః సూర్యః సూర్యో జ్యోతిః'** అనే వాక్యాలు కనబడతాయి. 'సూర్యుడు ప్రకాశ స్వరూపుడు. ప్రకాశమే సూర్య స్వరూపమని పై వాక్యముల కర్థం. మహర్షి కణాదుడు తన వైశేషిక దర్శనంలో పంచభూతాలలోని అగ్నిని 'తేజః' అనే పేరుతో సూచిస్తాడు. **'పృథివ్యాపస్తేజో వాయురాకాశం కాలో దిగాత్మా మన ఇతి ద్రవ్యాణి' (వైశేషిక ద. 1-1-5)** అనేది సూత్రం. వాటి గుణాలను వివరించే కారికలలో ఋషులు **'స్పర్శాద్యష్టౌ రూపవేగౌ ద్రవ్యత్వం తేజసో గుణాః'** అంటూ వాటిని తేజస్సు యొక్క గుణాలుగానే తెలిపారు. కాన, ప్రకాశం పదార్థమేనని ఋషుల అభిప్రాయం.

ప్రకాశం పదార్థమే అయినా అందులో మేళవించియున్న సప్తవర్ణాలు మందులౌతాయా? అని సందేహించ నవసరం లేదు. ఉదాహరణకు సూర్యకాంతి, పసుపు, ఎరుపు కాంతులు వేడిని కలిగిస్తాయి. దానికి భిన్నంగా నీలికాంతి చల్లదనాన్ని, హాయిని యిస్తుంది. నీలికాంతిని హైడ్రోక్లోరిక్ ఆమ్లంపై ప్రసరింప జేస్తే ఆ ఆమ్లం అణువులుగా మారుతుందని; పసుపు, ఎరుపు కాంతులను ప్రసరింప చేస్తే అణువులుగా మారదని; అట్లే, ఫోటోగ్రాఫిక్ ప్లేటుపై నీలం కాంతిని ప్రసరింప చేస్తే అది నల్ల పడుతుందని; పసుపు, ఎరుపుల కట్టి శక్తి లేదని డా. బాబిట్ గారి పరిశోధనలలో వెల్లడయ్యింది. కాన, రంగుల కాంతులు మందులుగా పని చేస్తాయి.

డా. అనిబిసెంటుగారు మొట్ట మొదటగా ఈ సూర్యకిరణ చికిత్సను వీరి పుస్తకాలతో మన భారత దేశానికి పరిచయం చేసారు.

మన దేశంలో ప్రకృతి వైద్యులే ఈ చికిత్స వైపు ఎక్కువగా ఆకర్షింప బడ్డారు. అందుచే ఈ చికిత్స ప్రాకృతిక చికిత్సలో అంతర్భాగమయ్యింది. వైద్యులు వారివారి బుద్ధి కుశలత ననుసరించి అనేక ప్రయోగాలు చేసి ఎన్నో సూర్యకిరణ చికిత్సా పద్ధతులను ఆవిష్కరించారు. వీటిని గురించిన విపుల సాహిత్యం అన్ని భాషలలోను లభిస్తుంది. ముఖ్యంగా శ్రీ గోవింద బాపూజీ

టోంగూ మరియు డా. ద్వారకానాథ్‌నారంగ్‌గార్లు హిందీలో వ్రాసిన గ్రంథాలు చదువ దగినవి. శ్రీగోవింద బాపూజీగారు ఎన్నో మందులు వాడినా తగ్గని తన జబ్బు రంగు నీరుతో తగ్గిపోవుటతో సేవా భావంతో తన జీవితాన్ని ఈ చికిత్సకే అంకితం చేసారు. డా. జ్వాలా ప్రసాద్ జీ (కాశీ) ఈ చికిత్సను ఆధునికీకరణ చేసి నూతన పద్ధతులను ఆవిష్కరించారు. కలర్ సోలరైజ్డ్ ప్రోగ్రస్ ప్రాన్స్, కలర్ బ్రీతింగు, కలర్ వాటర్, కలర్ బాత్, తుంపర స్నానం మొదలగు పద్ధతులను, ప్రవేశ పెట్టారు. సూర్యరశ్మి లేకపోయినా విద్యుద్దీపాలతో కావలసిన రంగుల ద్వారా ఆయా అవయవాలకు ఆయా రంగులను ప్రసరింపచేస్తున్నారు. అందుకు తగినగదులు, కుర్చీలు, పెట్టెలు, బల్లలు తయారు చేసారు. దీని ద్వారా కూడా మంచి ఫలితాలే వస్తున్నాయి. ఇది క్రోమోపతి పేరుతో అమెరికా వంటి సంపన్న దేశాలలో బహుళ ప్రాచుర్యం పొందింది. ఇవన్నీ భాగ్యవంతుల వెర్రి. మనకు పాత చికిత్సలే అనుకూలం. గుణవంతం. అయితే, సూర్యకాంతిని మనకు అనుకూలమైన గదిలోకి లేదా వరండాలోకి ప్రసరింప చేయగల ఏర్పాట్లు చేసుకోవాలి. అద్దాలతో ఇట్లు చేయవచ్చు. రంగులను కావలసిన భాగాలపైకి ప్రసరింప చేసుకునే ఏర్పాట్లు చేసుకోవాలి. ఇచ్చట సంక్షిప్తంగా కొన్ని ముఖ్య విషయాలను మాత్రం వ్రాయుట జరుగుచున్నది. వివరంగా తెలిసికొనగోరువారు దగ్గరలోని ప్రకృతి చికిత్సాలయానికి వెళ్ళి చికిత్సలను స్వయంగా చూసి, సాహిత్యం చదివి తెలిసికొనగోరెదను.

## సప్తవర్ణాల విశిష్ట గుణాలు

**''సూర్యస్య సప్త రశ్మిభిః'' (ఋగ్. 8.72-16)**

**''సప్త త్వా హరితో రథే వహన్తి దేవసూర్య''(ఋగ్. 1-50-8)**

ఓ దివ్యగుణ యుక్త సూర్య దేవతా! రోగనివారక సప్త అశ్వములు నీ రథమును నడుపుచున్నవి.

సూర్యరశ్మిలో సప్తవిధ కిరణము లున్నవను విషయం 17వ శతాబ్దంలో సర్ ఐజాక్ న్యూటన్ క్రొత్తగా కనుగొన్నది కాదు. ప్రథమ మానవ సృష్టి కాలంలోనే ఈ విషయం పరమేశ్వరుడుపదేశించాడని పై వాక్యాలు రుజువు చేస్తున్నాయి. అప్పటి నుండి మన పూర్వులు **'సప్తాశ్వరథమారూఢం'**అని

సూర్యుని కీర్తిస్తూనే ఉన్నారు. పౌరాణిక భక్తులు చిత్రాలను, విగ్రహాలను రూపొందించి గుళ్ళు కూడా కట్టారు. పూర్వం వర్ణ చికిత్స కూడా ఉండి ఉండవచ్చు. పాతది ఏమైనా మనం యిప్పుడు విజ్ఞాన రంగంలో శరవేగంతో ముందుకు సాగిపోతున్నాం. మేధస్సు కూడా ఎంతో వికసించింది. ఎన్నెన్నో పరికరాలు రూపొందుతున్నాయి. కనుక నేటి విజ్ఞానం ఈ రంగులను గురించి ఏమి చెబుతున్నదో తెలిసి కొందాము.

### 1) అరుణ నీలం (ఊదా రంగు - Violet):

ఇది ఎరుపు, నీలం రంగుల మిశ్రిత రంగు. అయిదు భాగముల ఎరుపు + ఎనిమిది భాగముల నీలం కలిపి ఈ రంగును నిర్మించవచ్చు. అయినను ఇది ప్రాకృతికముగా లభించు ఊదారంగునకు సరికాదు. కొన్ని రకముల పూవులలో మాత్రమే యిది కనబడును. అన్నిటి కన్న ఉత్తమంగా ఈ రంగు ఉదయించుచున్న సూర్యకిరణాలలో ఉంటుంది. ఈ రంగును పొందుటకు అదే ఉత్తమమైన సాధనం.

సామాన్యంగా ఎరుపు ఉద్రేకాన్ని, వేడిని కలిగిస్తుంది. నీలం ఉద్రేకోపశమనం కలిగించి చలువ చేస్తుంది. ఈ రెండింటి కలయిక గలిగిన దగుటచే దీనిలో కొన్ని విశిష్ట గుణాలు వచ్చాయి. ఎక్కడ ఉద్రేకము కలిగించని ఉత్తేజనం (Stimulant) అవసరమౌతుందో అక్కడ ఈ రంగు అవసరమౌతుంది. ముఖ్యంగా ఇట్టి ఉత్తేజనం మెదడు, నాడీ మండలం, గుండె, ఊపిరితిత్తులు, మూత్ర పిండాలు, జీర్ణకోశ కాలేయాలకు అవసరమౌతుంది. ఈ రంగు వాటిలో సామాన్యమైన ఉత్తేజాన్ని కలిగించి రోగనిరోధక శక్తిని పెంచుతుంది. అందలి రోగాలను పోగొట్టి వాటికి బలాన్ని యిస్తుంది. ముఖ్యంగా క్షయ వ్యాధికి, గుండె జబ్బులకు ఇది గొప్ప మందు.

ఇది మెదడులోని ఉద్వేగాన్ని తగ్గించి చక్కటి నిద్రను కలిగిస్తుంది. ఎఱ్ఱ రక్త కణాలను వృద్ధి పరచి పాండు రోగమును పోగొడుతుంది. కాలేయమును సరిచేసి కామెర్ల రోగమును పోగొడుతుంది. ఇప్పుడిప్పుడు ఆంగ్లేయ వైద్యులు ఈ రంగులోని విశిష్టతను గుర్తించి కామెర్ల రోగులకు అరుణోదయ రశ్మిలో కొద్దిసేపు ఉండాలని సలహాల నిస్తున్నారు. అల్లోపతి వైద్యంలో కామెర్ల వ్యాధికి మందు లేదనే విషయం మనకందరికీ తెలిసినదే కదా! ఆ వ్యాధి చికిత్సకు ఆయుర్వేదాది భారతీయ చికిత్సలనే వారు ఆశ్రయించ వలసి వస్తున్నది. గుండె జబ్బులలోను ఈ రంగు

ఉపయోగపడుతుందని కొందరు గుర్తిస్తున్నారు. వేదాల మార్గంలోకి వస్తున్నారు. ఈ విషయంలో మన వేదం ఏమి చెబుతున్నదో మరొకసారి గుర్తు చేసుకోండి.

**ఉద్యన్నద్య మిత్రమహ ఆరోహన్ ఉత్తరాం దివమ్ హృద్రోగం మమ సూర్య హరిమాణం చ నాశయ॥ (ఋగ్. I-50-11)**

**అనుసూర్యముదాయతాం హృద్ద్యోతో హరిమా చ తే।**

**(అథర్వ. 1-22-1)**

ఈ మంత్రార్థాలను ముందే తెలిసికొన్నాము కదా! 'హరిమా' అనగా రక్తహీనతతో శరీరము కొద్ది పచ్చబడుట కామెర్ల వ్యాధి అని అర్థం. ఎరుపు ఎక్కువగా కలిసిన ఊదారంగు జీర్ణశక్తిని ఉత్తేజింపచేస్తుంది. కాన మందాగ్నికి మంచిది. నీలం ఎక్కువగా కలిసిన ఊదారంగు కడుపులో మంటను, ఉద్రేకమును తగ్గిస్తుంది. మంట ఎక్కువగా ఉంటే కేవలం నీలం రంగు మంచిది.

నీలం, ఎరుపులు సమానంగా కలిసిన ఊదారంగు సీసాలోని నీరు (అనగా ఒక రోజంతా ఎండలో పెట్టి సూర్యపుటము వేసిన నీరు) జీర్ణశక్తికి సాయం చేస్తుంది. ఈ నీటిని స్త్రీల గర్భాశయ రోగాలకు మరియు గుదసంబంధమైన అన్ని రకముల రోగాలకు వస్తిగా (ఎనిమాగా) ఇచ్చిన చాలా మేలు చేస్తుంది. తలలో చుండ్రు, జుట్టు రాలిపోవుటకు ఈ నీటిని తలకు మర్దన చేయాలి.

మన శరీరంలోని అనాళికా గ్రంథులకు రాణిగా పేర్కొనదగిన పిట్యూటరీ గ్రంథి మెదడు అడుగు భాగంలో ఉంది. దానిని ఈ రంగు ఉత్తేజింప చేయగలదు. దానితో శరీరంలోని అన్ని గ్రంథులకు చైతన్యం కలుగుతుంది. ఆ గ్రంథికి నేరుగా సూర్యకాంతిని ప్రసరింపచేయగలగాలంటే 'కలర్ సోలరైజ్డు ప్రోగ్రెస్ ఫ్యాన్' ద్వారా చేయవలసి ఉంటుంది. లేదా ఊదారంగు పూవులు సంపాదించి అదే రంగుల గుడ్డలో పోసి తలపై కప్పుకున్నట్లుగా పరచి సౌమ్యమైన ఎండ తలకు పడేటట్లు చేయాలి. లేదా ఆ రంగును ప్రసరింపజేసిన నీటిని త్రాగుట ఆ గాలిలో ప్రాణాయామము చేయుట చేయవచ్చును. చికిత్సా పద్ధతులను గురించి వచ్చే ప్రకరణంలో తెలుసుకుందాము.

ఊదారంగుకు ఎలక్ట్రోకెమికల్ శక్తి ఉందని తెలిసింది. ఇది పిట్యూటరీ గ్రంథికి సమీపంలోని హైపోథాలమస్ ప్రాంతాన్ని ప్రభావితం చేసి మానసిక ప్రశాంతతను, ఆధ్యాత్మిక శక్తిని (ఏకాగ్రతతో ధ్యానం చేయగల శక్తిని) యిస్తుందని కొందరు చెబుతారు.

## ముదురు నీలం రంగు (Indigo):

ఊదా, గాఢనీలం, ఆకాశ నీలం రంగులు మూడును స్వల్ప భేదం కలిగినను ఒక వర్గానికి చెందినవే. ఈ మూడును చలువ చేస్తాయి. వ్యాకోచించిన వాటిని సంకోచింప చేస్తాయి. నరాలకు శక్తినిస్తాయి. నాళాలను ముకుళింప జేసి స్రావాలను ఆపు చేస్తాయి (Stringent), చల్లబరుస్తాయి. (Reringent) క్రిమిసంహారక గుణాన్ని (Antiseptic) కలిగి ఉంటాయి. జ్వరాలను, వాపులను తగ్గిస్తాయి. ముడత లాగుకు పోయే నొప్పులను తగ్గిస్తాయి. (Anti Spasmodic) చక్కటి నిద్రను కలిగిస్తాయి. కొన్ని ప్రత్యేక పరిస్థితులలో తప్ప యివి సామాన్యంగా అందరికి మేలునే చేస్తాయి.

శరీరం చల్లబడి చలితో బాధపడే వారికి, శరీరం పాలిపోయి పచ్చబడ్డ వారికి, నయం కాని స్థితి ఏర్పడి అవసాన దశకు చేరుకున్న వారికి యివి సరిపడవు. అట్టి వారికి మేలు కన్న కీడే జరుగవచ్చును. కాన వారికి వాడరాదు. (అట్టి స్థితిలో కూడా శరీరంలో ఉద్రేకం, ఉండి, రక్త స్రావాదులు ఉంటే స్వల్ప పరిమాణంలో వాడవచ్చు).

ఈ నీలం వర్గానికి చెందిన వాటిలో శీతలత్వాది పైగుణాలు ఉండుటచే నీళ్ళ విరేచనాలను, రక్తబంక విరేచనాలను, కడుపులో మంట, పోటులను, నిద్ర లేమిని, వాపులను, కేన్సర్‌కు చెందిన మంటలను, వివిధ జ్వరాలను, తాపాలను, ఉద్రేకాలను తగ్గిస్తాయి. నోటిపూత, చిగురుల వాపు, రక్తము కారుట మొదలగు వాటిలో పుక్కిలించు ఔషధములలో వీనికి మించినది లేదు. అద్భుతమైన ఉపశమనాన్ని కలిగిస్తాయి. అట్లే కండ్ల కలకలు, పోట్లు, మంటలు ఉన్నప్పుడు దీనితో సమానమైన కంటి చుక్కలు లేవు. అరచేతులు పొరలు ఊడుటకు, తలలో చుండ్రుకు నీలోదకం పైకి రాస్తే మంచిది. వళ్ళు కాలిన భాగాలపై నీలోదకంలో తడిపిన గుడ్డలను వేస్తూ ఉంటే మంటలు తగ్గుతాయి. క్రిమి దోషం కలుగకుండా ఉంటుంది. పొడి చర్మం

(Dry skin)తో బాధపడే వారికి చాలా మేలు చేస్తుంది. చర్మాన్ని మృదువుగా నిగనిగలాడేలా చేస్తుంది. గాయాలను, పుండ్లను మాన్పుతుంది. నీలం నీటితో వస్తి (ఎనిమా) చేస్తే మలశంకలు (Piles), గుద పగుళ్ళు (Fissures), భగందరములు (Fistulae) మొదలగునవి తగ్గుతాయి. స్త్రీలలోని రక్తస్రావాలు వాపులు ఉపశమిస్తాయి. నీలంరంగు ఒక అద్భుతమైన నరాల బలవర్ధక ఔషధం (Nerve Tonic).

పైన వర్ణించిన గుణాలన్నీ నీలిరంగు వర్గానికి చెందిన ఊదా, గాఢనీలం, ఆకాశ నీలాల మూడిటి యొక్క సామాన్య గుణాలు. ఇప్పుడు గాఢ నీలం రంగు యొక్క విశేష గుణాలు తెలిసికొందాము.

గాఢనీలం అన్నిటికన్నా ఎక్కువ చలువ చేస్తుంది. ఇంతేగాక దీని ప్రభావం అతి శీఘ్రంగా కనబడుతుంది. ఎక్కువ పుష్టిదాయక మగుటచే కొందరిలో మలబద్ధకమును కలిగించవచ్చు. రోగి తత్త్వాన్ని బట్టి రోగము యొక్క ఉధృతాన్ని బట్టి ఏ నీలం ఎక్కడ అవసరమౌతుందో దానిని ఎంచుకోవలసి ఉంటుంది. ఇది అతి దాహాన్ని, తీవ్ర జ్వరాలను శాంతింప జేస్తుంది. గొప్ప కీటాణునాశని (Antibiotic). రక్తస్రావాదులను తగ్గిస్తుంది. ఆ అవయవాలలో ఏర్పడిన ఉద్రిక్తను, వాపులను నివారిస్తుంది. నరాలకు శక్తినిస్తుంది. నిద్రను కలిగిస్తుంది. అయితే మన శరీరంలో ఈ రంగు ఎక్కువయితే కూడా కొన్ని లక్షణాలు, బాధలు కలుగుతాయి. అప్పుడు ఈ రంగుకు విరుగుడుగా ఎరుపు రంగును ప్రయోగింప వలసి వస్తుంది.

మన శరీరంలో గాఢనీలం ఎక్కువయితే మలమూత్రాలు, నాలుక, కండ్లు, చర్మము, గోళ్ళు తెల్లగా పాలిపోతాయి. జలుబు, దగ్గు, ఆయాసము, కఫము కలుగుతాయి. అతినిద్ర బద్ధకము, శరీర శిథిలత, నీరసము కలగవచ్చు. ఆయుర్వేద పరిభాషలో దీనిని కఫతత్త్వం పెరిగిందని చెప్పవచ్చు. అప్పుడు దానికి విరుగుడుగా ఎరుపురంగు అవసరమౌతుంది.

ఊదారంగు పిట్యుటరీ గ్రంథిపై ప్రభావాన్ని చూపుతున్నట్లే ఈ గాఢనీలం పీనియల్ గ్రంథిపై ప్రభావం చూపుతుంది. ఇది పిట్యుటరీ గ్రంథికి కొద్ది పైభాగంలో మధ్య మెదడు యొక్క అడుగు భాగంలో ఉంటుంది. శరీరం ఎదుగుదలకు జననేంద్రియాల ఎదుగుదలకు దీనితో సంబంధమున్నదని వైద్యులు చెబుతారు. కాని ఇంకా దీని నిర్దిష్ట గుణాలు

కనుగొనబడలేదు. బహుశః ఈ రంగు అధికోష్ణాన్ని తగ్గించి శరీర వికాసానికి తోడ్పడవచ్చు. ఇది ఫ్రాంటల్ ప్లెక్సస్ (నుదుటి భాగంలోని నాడీ కూడలి)పై ప్రభావం చూపుతుందని కొందరంటారు.

**ఆకాశనీలం (Blue) రంగు**

ఆకాశ నీలం బహుళ ప్రయోజనకరమైన ఒక గొప్ప మందు. ఇది శరీరాన్ని, మనస్సును శాంతపరచి ప్రసన్నతను కలిగిస్తుంది. కొందరు కవులు 'ఓ ప్రశాంత ఇంద్రనీల కాంతి కిరణమా! దుఃఖోపశమనం చేసి నా మనస్సును కుదుట పరచు' అంటూ కీర్తించారు. మన శరీరంలోని స్వరపేటిక వద్దనున్న నాడీ కూడలిపై దీని ప్రభావం ఎక్కువగా ఉంటుందని గుర్తించారు. బాధలతో ఉద్రేకాలతో చికాకు పడిపోతూ అశాంతిగా ఉండేవారిపై ఈ నీలపు కాంతిని ప్రసరింప జేస్తే వారికి చాలా ఉపశాంతి కలుగుతుంది. మనసు కుదుట పడుతుంది. ప్రశాంతత కలుగుతుంది. విశాల భావాలు కలుగుతాయి. ఇది కంటికి చాలా మంచిది. అన్ని రంగులకన్న ఈ రంగును ఎక్కువసేపు చూడగలుగుతాం. వినీలాకాశాన్ని చూస్తూ ఉంటే గంటలు క్షణాలుగా గడచిపోతాయి కదా! గాఢనీలానికి ఉన్న సుగుణాలన్నీ దీని కున్నాయి. విశేషంగా యిది గొప్ప క్రిమి సంహారిణి (Antibiotic). వాతావరణ కాలుష్యాన్ని తగ్గించే గుణం దీనికి ఉంది. డాక్టర్ ఎడ్విన్ బాబిట్ గారు 'నీలి కిరణం ఈ ప్రపంచాన్ని విషపూరిత వాతావరణం నుండి రక్షించే ఒక గొప్ప యాంటిసెప్టిక్ (విషహర) సాధనం' అంటారు. నీలం నీటితో నిస్సంకోచంగా అన్ని రకాల గాయాలను శుభ్రం చెయ్యవచ్చు. కాలిన గాయాలపై నీలం నీటితో తడిపిన శుభ్రమైన గుడ్డలు కప్పితే మంటలు తగ్గుతాయి.

నీలంరంగు సీసాలో కొబ్బరి నూనె పోసి ఒక నెలరోజులు సూర్యపుటం పెట్టి ఉంచుకుంటే ఎన్నో విధాల ఉపయోగపడుతుంది. తలకు రాచుకుంటే భృంగామలక తైలం వలె చల్లదనాన్ని కలిగిస్తుంది. తలలో చుండ్రు పోతుంది. వెండ్రుకలు గట్టి పడతాయి. మా ప్రకృతివైద్య గురువులు కీ.శే. శ్రీ ప్రకృతి శర్మగారు తేలుకుట్టిన చోట ఈ తైలం మర్దన చేసి ఎందరికో బాధా నివృత్తి కలిగించారు. పాము కాట్లకును ఉపయోగపడవచ్చు. ప్రయత్నించి చూడాలి. శరీరంలో ఎక్కడ మంటలు, పోట్లు, లేదా వేడి ఉన్నా ఈ తైలం మర్దించవచ్చు.

దీని ముఖ్య గుణం చలవ చేయడం. అందుచే నిది అన్ని రకాల జ్వరాలలోను ఉపయోగపడుతుంది. అట్టి వారికి నీల కాంతిని ప్రసరింప చేయటం కన్న నీలం రంగు సీసాలో సూర్యపుటం పెట్టిన నీరు ఎక్కువ మేలు చేస్తుంది. ఈ నీటికి ఉద్రేకాలను తగ్గించే గుణం కూడా ఉండుటచే అన్నిరకాల విరేచనాలకు, గ్రహణికి, సంగ్రహణి కి ఉత్తమమైన మందు. అట్లే అన్ని రకాల రక్తస్రావాలను తగ్గిస్తుంది. అధికోష్ణంవల్ల కలిగే చర్మ వ్యాధులన్నిటికి ఈ నీటిని లోపలికి యిస్తూ ఆకుపచ్చ కాంతిని చర్మానికి ప్రసరింప జేస్తే అద్భుతమైన ఫలితాలు వస్తాయి. వేడి గడ్డలు (సెగ గడ్డలు) కాన్సర్ కంతులు మొదలగు వాటిలో ఈ నీరు లోపలికి తీసుకోవటం గుణకారి.

నీలం కాంతిలో నిద్ర బాగా పడుతుంది. ఉద్రేకంతో కూడిన పిచ్చివారిని నీలపు కాంతితో నింపిన గదిలో పెడితే కొన్ని గంటలలోనే క్రమంగా వారి ఉద్రేకాలు, తిట్టటం, కొట్టటం, కొరకటం మొదలగునవన్నీ తగ్గి చక్కగా నిద్రపోయినట్లు డా. బాబిట్‌గారు వ్రాసారు. వేడితత్త్వం గలవారు నీలంరంగు వేసిన గదులలో ఉండటం, నీలం దుస్తులు ధరించటం మంచిది. అట్టివారు నీలం మణి (Sapphire) ధరించటం మంచిదని కొందరంటారు.

ప్రసిద్ధ వర్ణచికిత్సా నిపుణులు శ్రీ గోవింద బాపూజీ టోంగూగారు ఈ నీలంరంగును అన్నిటి కన్న శ్రేష్ఠమైనదిగా కొనియాడారు. ప్రాణి మాత్రులన్నిటికి యిది జీవనాధారమైనదని వారంటారు. దీనిలో సూక్ష్మమైన విద్యుత్, ప్లాష్టికత ఉంది. చల్లదనాన్ని కలిగించటంలో దీనికి మించినది లేదు. ఎంత తేలిక నీలం (Light Blue) అయితే అంత ఎక్కువ చల్లదనాన్ని కలిగిస్తుంది. సూర్య తాపాన్నుండి ప్రాణులను రక్షించటానికే పరమేశ్వరుడు ఆకాశాన్ని నీలంగా సృష్టించాడేమో! అనిపిస్తుంది. (ఇచ్చట ఆకాశం నీలంగా ఉందంటే ఖాళీ స్థలం నీలంగా ఉంటుందని కాదు. ఆకాశానికి ఏ రంగూ ఉండదు. భూమి చుట్టూ ఉండే వాతావరణ పొరే మనకు నీలంగా కనబడుంది. వ్యవహారంలో దానినే మనం ఆకాశం అంటున్నాం).

వాతావరణంలో ధూళి, నీటి యావిరి కణాలు ఉంటాయి. అవి మరియు వాయు కణాలు అన్నీ కలిసి సూర్యకాంతిలోని నీలం కాంతులను (ఊదా, గాఢనీలం, ఆకాశ నీలం కాంతులను) చెదరగొడతాయి. మిగిలిన ఆకుపచ్చ, పసుపు, నారింజ, ఎరుపు కణాలు పొడవైనవి కావటం చేత సరాసరి

వాతావరణాన్ని దూసుకుని వచ్చి భూమిని చేరుకుంటాయి. వాతావరణం చెదరగొట్టిన ఆ నీలం రంగులే మనకు నీలంగా కనబడుతున్నాయి.

ఒక హెచ్చరిక ఏమనగా ఈ నీలం రంగులు ఎంత గొప్పవైనా మన శరీరంలో కఫతత్త్వం తగ్గి పిత్తతత్త్వం పెరగటంవల్ల వచ్చే వ్యాధులకే మేలు చేస్తాయి. కఫజనిత వ్యాధులైన జలుబు, దగ్గు, కఫం, ఉబ్బసం, చలి మొదలైన వాటిలో ఏమీ లాభం చేయవు. కీళ్ళవాతం, పక్షవాతం, మలబద్ధకం, స్థూలత మొదలగు వాతజనిత వ్యాధులందును ఇవి అంతగా ఉపయోగపడవు. పై వ్యాధులలో ఇవి మేలు చేయకపోగా కీడు చేయవచ్చు. అట్టి వారికి ఎరుపు రంగులు అవసరమౌతాయి.

### హరిత వర్ణం (ఆకుపచ్చ రంగు - Green)

సూర్యతాపాన్ని తగ్గించే మరొక అద్భుత వర్ణం హరితం. (ఆకుపచ్చ) దయామయుడగు పరమేశ్వరుడు నీలంరంగుతో ఆకాశాన్ని (వాతావరణాన్ని) నింపి ఆకుపచ్చని వృక్షజాతితో భూమిని కప్పి మనని కాపాడుతున్నాడు. ఈ హరితవర్ణం మనకి ఆహారాన్ని యివ్వడమే కాక చల్లదనాన్ని కూడా యిస్తుంది. మేఘాలను ఆకర్షించి వర్షాలను కురిపిస్తుంది. ఎడారి భూములైన గల్ఫ్ రాజ్యాలలో శాస్త్రవేత్తలు చల్లదనం కోసం విశ్వప్రయత్నాలు చేస్తున్నారు. అన్నిటికన్న సరళ మార్గం ఈ హరిత వర్ణమేనని గుర్తించారు. పెద్దపెద్ద వృక్షాలను పెంచలేక పోయినా పచ్చిక బయళ్ళు పెంచితే చల్లదనం వస్తున్నట్లు కనుగొన్నారు. ఆ ఎడారి భూములపై మెత్తటి మట్టి ఒక పొరగా పోసి పచ్చగడ్డి బయళ్ళను వేసి కొద్ది నీటితోనే వాటిని కాపాడుతున్నారు. దానివల్ల పూర్వం కన్న యిప్పుడు అక్కడ వేడికొంత తగ్గిందని అంటున్నారు. అక్కడి వేడి పచ్చగడ్డిలోని తేమవల్ల తగ్గిందా? లేక పచ్చని రంగువల్ల తగ్గిందా? అని మరల పరిశోధనలు కొనసాగించారు. తేమవల్ల కన్న పచ్చదనం వల్లనే ఎక్కువ శాతం వేడి తగ్గుతున్నట్లు కనుగొన్నారు. అందుచే నీరు దొరకని ప్రాంతాలలో పచ్చని తివాచీల వంటివి పరవడం, యింటి కప్పులపై పచ్చని రంగు పూయటం చేస్తున్నారట. హరిత వర్ణమే మేఘాలను ఆకర్షించి వర్షాలు కురిపిస్తున్నదేమో ఆలోచించాలి. నిర్దిష్టమైన ఫలితాల కోసం మరికొంత కాలం వేచి చూడాలి.

హరితం సూర్యతాపాన్ని తగ్గించినట్లే మన దేహ తాపాన్ని తగ్గిస్తుంది. పిత్తప్రకోప వ్యాధులలో నీలం రంగులతో బాటు హరితం కూడా అవసరమౌతుంది. ముఖ్యంగా పిత్తజనిత చర్మ వ్యాధులలో ఇది

అద్వితీయమైన ఔషధం. సామాన్యంగా చర్మవ్యాధులన్నిటికి పిత్త ప్రకోపమే కారణంగా ఉంటుంది. ఫంగస్ క్రిములు, బ్యాక్టీరియాలు, వైరస్‌లు అన్నీ ఆ తరువాతనే చర్మంలో స్థావరం ఏర్పరుచుకొని బాధిస్తాయి. దానితో గజ్జి, తామర, సోరియాసిస్, దద్దుర్లు మొదలగు అనేక రకాల చర్మ వ్యాధులు కలుగవచ్చు. వాటికి ఎన్ని పై పూతలు పూసినా, ఎన్ని క్రిమి సంహారకాలు వాడినా తాత్కాలిక ఉపశమనమే కలుగుతుంది కాని నివారణ కాదు. మరింత బలమైన క్రిమి సంహారకాలు వాడి అణచిపెడితే పిత్తం అంతర్ముఖమై గుండె, ఊపిరి తిత్తుల వంటి ప్రధానావయవాలను రోగగ్రస్తం చేస్తుంది. కాని, హరితవర్ణం క్రిములను హరించటమేగాక మూలకారణమైన పిత్తాన్ని కూడా హరిస్తుంది. చర్మవ్యాధులలో రాజుగా చెప్పబడు కుష్ఠువ్యాధి హరిత వర్ణంతో అవలీలగా పోతుంది. అయితే అందుకు తగినట్లు ఆహార విహారాలను పాటించవలసి ఉంటుంది.

భీమవరం ప్రాకృతిక చికిత్సాలయ స్థాపకులు డా. వేగిరాజు కృష్ణంరాజు గారు ఎంతోమంది కుష్ఠు రోగులను బాగు చేసారు. ఆహార నియమాలతో బాటు కటిస్నానం, ఒంద్రు స్నానం, ఆతప స్నానాలు చేయిస్తూ ఉండేవారు. ఇందు ఆతపస్నానం సూర్యకిరణ చికిత్సయే. వీరు హరిత సూర్య కిరణాలను ఆకుపచ్చ అద్దాలతో కాక అరటి ఆకులతో ప్రసరింపచేసేవారు. (ఈ విధానం తరువాత తెలిసి కొందాము) దీనితో చర్మములోని మాలిన్యాలు క్రమంగా కరిగిపోయి చెమట రూపంలో బహిష్కరింప బడేవి. అంతకు పూర్వం మొద్దుబారి దళసరెక్కిన చర్మం క్రమంగా మెత్తబడి స్వేదరంధ్రాలు వికసించేవి. రక్తప్రసరణ చర్మగతమై మాలిన్య బహిష్కరణ జరిగేది. చర్మము శక్తివంతమై తైల గ్రంథులు పునర్నిర్మింపబడేవి. క్రమంగా నిగనిగలాడుతూ సామాన్య చర్మమయ్యేది.

సర్వోదయ నాయకులు శ్రీ ప్రభాకర్ జీ తరచు డా. రాజుగారి ప్రకృతి ఆశ్రమానికి వస్తూ ఉండేవారు. అక్కడ సాధించే చికిత్సా ఫలితాలను చూసి ఆశ్చర్య పడుతూ ఉండేవారు. ఒకసారి మహాత్మా గాంధీ గారితో శ్రీ ప్రభాకర్‌జీ ఈ విషయం చెప్పారు. అది విని గాంధీగారు తన సాబర్మతీ ఆశ్రమంలో ఉన్న యిద్దరు కుష్ఠు రోగులను శ్రీ ప్రభాకర్ జీ వెంట భీమవరం పంపారు. డా. రాజుగారు ఆ కుష్ఠు రోగులిద్దరిని తన ఆశ్రమంలో పెట్టుకొని కొన్ని నెలలోనే పూర్తిగా నయం చేసి తిరిగి పంపారు. ఆ ఫలితాలను చూసి

గాంధీ గారు డా. రాజుగారిని తన ఆశ్రమానికి పిలిపించుకొని అభినందనలు తెలిపారు. ఈసారి దక్షిణ భారతదేశ యాత్రకు వచ్చినప్పుడు నీ ఆశ్రమానికి తప్పక రాగలనని ఆశ్వాసమొసగి, ఆశీర్వదించి, ప్రోత్సహించి పంపారు. దురదృష్టవశాత్తు గాంధీగారు ఇటువైపు రాకపూర్వమే హత్యకు గురయ్యారు.

ఆ తదుపరి శ్రీ వినోబా భావే గారు వీరి ఆశ్రమానికి వచ్చి ఒక నెలరోజులు ఉండి వెళ్ళారు. ప్రభుత్వం వీరి అద్భుత చికిత్సా ఫలితాలను చూసి 'వైద్యరాజ' అను గౌరవ పట్టా (Doctorate) ఇచ్చి గౌరవించింది. కుష్ఠరోగుల చికిత్స కొరకు ఆశ్రమంలో నాలుగేసి పడకలు గల (గదులు గల) నాలుగు పెంకుటిళ్ళను నిర్మించి యిచ్చింది. పేదవారి చికిత్సకు నిధిని (గ్రాంటును) యిచ్చింది. ఈ కథ అంతా ఎందుకనగా సూర్యుని హరితవర్ణ అద్భుతాలను తెలుపుట కొరకే.

హరితవర్ణం అనేక రకాల గడ్డలకు, కేన్సర్ గడ్డలకు, వివిధ పుండ్లకు, పగుళ్ళకు, పొడి చర్మానికి చాలా ఉపయోగపడుతుంది. కుళ్ళిన వ్రణాలకు దానితో ఏర్పడిన గేంగ్రిన్‌కు ఇది చాలా మేలు చేస్తుంది. ఇంతేగాక, శరీరం లోపల ఏర్పడిన జీర్ణకోశ వ్రణాలను, గుద స్థానంలో ఏర్పడిన ఫిస్టులా వంటి వ్రణాలను, మూల శంకలను తగ్గిస్తుంది. అవి యివి యననేల శరీరం లోపల బయట ఏర్పడిన అన్నిరకాల కంతులకు, వ్రణాలకు వాటి నుండి విడువకుండా వచ్చే స్రావాలకు హరితం ఉత్తమమైన మందు.

హరితవర్ణం మన శరీరంలోని ఇనుము, కాల్షియం, పొటాషియం మొదలైన రాసాయనిక ద్రవ్యాల హెచ్చు తగ్గులను సరి చేస్తుంది. వృక్షజాతి ద్వారా మనకు ఆహారాన్నిస్తున్నది ఈ హరిత వర్ణమే. నీలవర్ణం నరాలకు శక్తినిచ్చునట్లే ఈ వర్ణం కండరాలకు, మాంస ధాతువుకు బలాన్నిస్తుంది. వాటిని వృద్ధి పరుస్తుంది. (పుష్టి కలిగిస్తుంది). రక్తంలోని మాలిన్యాలను, విజాతీయ పదార్థాలను తొలగించి శుద్ధి చేస్తుంది.

హరితం మనస్సులోని ఈర్ష్యా ద్వేషాలను శాంతింప చేసి వ్యక్తిని ప్రసన్నచిత్తుని చేస్తుంది. ఇది భగ్నప్రేమికుల హృదయ తాపాన్ని, విరహ వేదనతో అలమటించే వారి మానసిక ఒత్తిడిని తగ్గించగల అద్భుతమైన ఔషధమని కొందరంటారు. వారిపై 'కలర్ సోలరైజ్‌డ్ ప్రోగ్రెస్ ఫేన్స్' అనే పరికరాల ద్వారా ఆకుపచ్చ కాంతిని ప్రసరింపజేస్తే వారి డిప్రెషన్ (విచారం), టెన్షన్ (మానసిక వత్తిడి), రక్తపోటు తగ్గుతున్నదని వారు చెబుతున్నారు.

హృదయ సమీపంలోని కార్డియన్ ప్లక్సస్ అనే నాడీ కూడలిని యిది ప్రభావితం చేస్తున్నట్లు కనుగొన్నారు.

కొన్ని రకాల జ్వరాలలో నీలం రంగులతో బాటు హరితం అవసరమౌతుంది. ముఖ్యంగా శరీరములో ఎక్కడైనా చీము ఉండి వచ్చే జ్వరాలకు (సెప్టిక్ ఫీవర్స్‌కు) ఇది చాలా మేలు చేస్తుంది. ఇది నీలం రంగువలె చలువ చేస్తుంది. ఇది కంటికి చల్లదనాన్ని, శక్తినిస్తుంది. అధికోష్ణం వల్ల కలిగే స్వప్న స్ఖలనాలను తగ్గిస్తుంది. స్త్రీలలో కలిగే జననేంద్రియ ఉత్తేజాన్ని శాంతింప జేస్తుంది. హిస్టీరియా వంటి మూర్ఛలను, భయాలను, ఆందోళనలను నివారిస్తుంది. డా. బాబిట్ గారు హరిత వర్ణ గుణాలను సమీకరించి సంక్షిప్తంగా ఈ విధంగా నిర్వచించారు. -

''ఆకుపచ్చ రంగు ముఖ్యంగా నీలం వలె చలువ చేస్తుంది. దీనిలో పసుపురంగు కొంత మిళితమై యున్నను అది నరాలలో సౌమ్యమైన ఉత్తేజాన్ని కలిగిస్తుంది గాన గర్భాశయ వాపులు మొదలగు వాటిలో మేలు చేస్తుంది. ఈ ఆకుపచ్చ రంగు నడుము, వెన్నెముక చివరి భాగాలపై ప్రభావం చూపుతున్నది. అందుచే కామోద్రేకత, అధికోష్ణం, వీర్యనష్టం మొదలగు వాటికి ఉపయోగపడుతుంది. (నీలం, పసుపు రంగులను సమపాళ్ళల్లో కలిపితే ఆకుపచ్చ రంగు వస్తుంది).

శరీరంలో ఈ రంగు ఎక్కువయితే అవయువాలలో నొప్పులు కలుగుతాయి. అప్పుడు దానికి విరుగుడుగా పసుపురంగు అవసరమౌతుంది.

### పీత (పసుపు) వర్ణం (Yellow)

పరమేశ్వరుని ఈ అద్భుత సృష్టిలో పసుపు రంగుకు ఒక విశిష్ట స్థానం ఉంది. ఆకుపచ్చ మనకు ఆహారాన్ని ఉత్పత్తి చేసి యిస్తుంటే పసుపు రంగు దానిని జీర్ణింప జేసి మనని జీవింప చేస్తూ ఉంది. పీతవర్ణం మన శరీరంలోని జీర్ణాశయం వెనుక ఉండే నరాల కూడలిని ప్రభావితం చేస్తుంది. మెదడు నుండి వెన్నుపాము ద్వారా వచ్చే నరాలు ఈ కూడలి నుండే జీర్ణావయవాలైన జీర్ణకోశము, కాలేయము, వృక్కకము (పేంక్రియాస్) చిన్న ప్రేగులు, పెద్ద ప్రేగులు మొదలగు వాటికి పోతాయి. పసుపు వర్ణంతో నివి బలపడి జఠరాగ్ని ఉత్తేజింప బడుతుంది. ఆంగ్లంలో ఈ కేంద్రానికి 'సోలార్ (సూర్య సంబంధమైన) ప్లక్సస్' అనే పేరు ఉండటం జఠరాగ్ని సూచకమే కావచ్చు. ఇది నాడీ మండలాన్ని కూడా ఉత్తేజింప చేస్తుంది.

ఇది శారీరక, మానసిక ఆరోగ్యముల రెంటిని కలుగ జేయగల్గ ఉత్తమమైన రంగుగా పేరు గాంచింది. సుఖ విరేచనం కలిగించుటలో సర్వోత్తమ ఔషధమని పెక్కండ్రు రోగుల చేత, వైద్యుల చేత కొనియాడ బడింది. ఇతర విరేచనకర ఔషధములన్నీ ప్రేగుల గోడలను ఉద్రేకపరిచి వాటికి కొద్దోగొప్పో హాని కలిగిస్తాయి. కానీ పీతోదకం (పసుపు రంగు సీసాలో సూర్యపుటము పెట్టబడిన నీరు) ప్రేగులలోని మ్యూకస్ పొరలకు, గ్రంథులకు ఎట్టి హానిని కలిగించకుండా కేవలం నరాలనే ప్రేరేపించి సుఖ విరేచనం గావిస్తుంది. మందాగ్నికిది ఉత్తమమైన మందు. జీర్ణకోశ సమస్యలన్నిటిలో దీని అవసరం ఉంటుంది. కడుపుబ్బరము, నొప్పి, ఆమ్లాధిక్యత, మంట మొదలగునవన్నీ దీనితో తగ్గుతాయి.

ఇంతేగాక పసుపురంగు గుండె, ఊపిరితిత్తుల రోగాలను తగ్గిస్తుంది. మూత్రావరోధాలను పోగొడుతుంది. మస్తిష్కాన్ని ప్రభావితం చేసి మంద బుద్ధులకు మేలు చేస్తుంది. నపుంసకత్వాన్ని నయం చేస్తుంది. 'యువతీ యువకుల పాలిట వరం' అని కొందరు వైద్యులు కొనియాడారు. వారికి తత్కాలం బలాన్నిచ్చే మందుగా కొందరు వ్రాసారు. ఈ పీతవర్ణం పక్షవాతానికి, అన్ని రకాల వాత వ్యాధులకు ఉత్తమమైన ఔషధం. ఈ పై వ్యాధులన్నిటిలోను సూర్యపుటం పెట్టిన పసుపు రంగు సీసా నీరు కడుపులోనికి త్రాగించాలి. ఈ నీరు ఎక్కువ మోతాదులో వాడరాదు. రెండు లేదా మూడు చంచాలు రోజుకు రెండు లేదా మూడుసార్లు చాలు. ఎక్కువ తీసుకుంటే వేడి చేస్తుంది. కొందరికి విరేచనాలు కావచ్చు.

మన శరీరంలో పసుపురంగు ఎక్కువయితే శరీరం కృశించి పోతుంది. అతి నీరసం వణుకు వస్తుంది. నిద్ర సరిగ్గా రాదు. మలమూత్రాలు బంధింప బడవచ్చు. శరీరం వేడెక్కటం లేదా విడవకుండా జ్వరం రావచ్చు. అప్పుడు ఈ రంగుకు విరుగుడుగా నీలం రంగును ముఖ్యంగా ఆకాశ నీలం వాడవలసి వస్తుంది.

### నారంగ వర్ణం (నారింజపండు రంగు Orange)

ఇది పసుపు ఎర్రుపుల మిశ్రమ వర్ణం. 4 భాగాలు పసుపు, 4 భాగాలు ఎరుపు కలిపి ఈ రంగును తయారు చేయవచ్చు. ఇది పసుపు రంగుకన్న ఎక్కువ ఉత్తేజాన్ని కలిగిస్తుంది. ముఖ్యంగా దీనివల్ల నరాలలో ఉత్తేజం కలుగుతుంది. దానితో మానసిక శక్తి, సంకల్పశక్తి వృద్ధి చెందుతాయి. నిరాశ

నిస్పృహలు దూరమై ధైర్య సాహసాలు వస్తాయి. బుద్ధి వికాసం కలుగుతుంది. నరాల బలహీనత మొదలగు నరాల జబ్బులన్నిటికిది మంచి మందు. పక్షాఘాతము (Paralysis)నకు గురియైన నరాలలో కూడా ఉత్తేజాన్ని కలిగిస్తుంది. ఆధునిక పరిభాషలో చెప్పబడు నెర్వస్ డెబిలిటి, నెర్వస్‌నెస్, నెర్వస్ ఇంపాటెన్సీ, న్యూరస్తీనియా, హిస్టీరియా మొదలగు అన్ని జబ్బులలోను ఇది ఆలోచించవలసిన ఔషధం - వర్ణం. అన్నిరకముల మానసిక క్రుంగుదలల(Mental Depressions)కు అద్భుతమైన మందు.

నారింజ వర్ణం నరాలకే కాక రక్తానికి కూడా ఉత్తేజాన్ని కలిగిస్తుంది. ఇది రక్త ప్రసరణాన్ని ఎక్కువ చేస్తుంది. అందువల్ల కండరాలలోని మాలిన్యాలన్నీ బహిష్కరింపబడి అవి ఆరోగ్యాన్ని పుష్టిని పొందుతాయి. బలపడతాయి. అట్లే వివిధ అవయవాలకు గ్రంథులకు చక్కటి రక్తప్రసారం జరుగుట వల్ల అవి వాటి పనులు సక్రమంగా నిర్వహిస్తాయి. జీర్ణశక్తి వృద్ధి చెందుతుంది. ప్రేవులు మూత్ర పిండాలు బలపడి మాలిన్య బహిష్కరణ జరుగుతుంది.

నారింజ రంగు ముఖ్యంగా కఫ జన్య వ్యాధులను దూరం చేస్తుంది. జలుబు, దగ్గు, కఫం తగ్గుతాయి. ఉబ్బసము, క్షయ, న్యుమోనియా మొదలగు శ్వాసకోశ వ్యాధులలో కఫం ప్రధానంగా ఉంటే ఈ రంగు మేలు చేస్తుంది. కడుపులోని అధిక శ్లేష్మాన్ని తగ్గించి ఆకలిని పుట్టిస్తుంది. కడుపులో వాయువు బంధింపబడినప్పుడు ఈ రంగు గొప్పమేలు చేస్తుంది. స్త్రీల ఋతు దోషాలను, ఋతు శూలను నివారణ చేస్తుంది. బాలింత స్త్రీల స్తన్యాన్ని వృద్ధి చేస్తుంది. రక్తాల్పత (Anaemia)ను దూరం చేస్తుంది. పైన చెప్పిన నరాల జబ్బులన్నిటిని తగ్గిస్తుంది. ఇంతేగాక ఈ రంగు పసుపు, ఎరుపు, తెలుపు రంగులతో వేరు వేరుగా కలిసినప్పుడు మరెన్నో వ్యాధులను తగ్గిస్తున్నదని అనుభవజ్ఞులు చెబుతున్నారు.

నారింజరంగు కడుపులో ప్లీహ (Spleen) ప్రాంతంలో గల నాడీ కూడలిని ప్రభావితం చేస్తున్నదని ఆధునిక పరిశోధనలలో వెల్లడయ్యింది. ఈ నాడీ కూడలి నుండే జననేంద్రియ, మలాశయ, మూత్రాశయాలకు నరాలు పోతాయి. అందుచే ఆయా అవయవాలు ఉత్తేజాన్ని పొందుతాయి. ఈ రంగును శరీరంపై ప్రసరింప చేసినప్పుడు శరీర ఉష్ణోగ్రత కొద్దిగా పెరిగినట్లు గుర్తించారు. దేహంపై కన్న మనస్సుపై ఈ రంగు ఎక్కువ

ప్రభావాన్ని చూపుతున్నట్లు కొందరు చెబుతారు. నారింజ కాంతిని ప్రసరింప చేసిన గదులలో కూర్చున్నచో మనస్సు ప్రసన్న మౌతుందని, క్రొత్త క్రొత్త ఆలోచనలు వస్తాయని వారంటారు. నారింజవర్ణం ఆశావాదులను చేస్తుందట.

**అరుణ వర్ణం (ఎరుపు రంగు -- Red )**

లోకములో ఎరుపు రంగు ప్రమాద సూచకం. కాని సూర్యకిరణ చికిత్సలో అది అంత ప్రమాదకరం కాకపోగా కొన్ని సందర్భాలలో ప్రమాదకర పరిస్థితుల నుండి అది రక్షిస్తుంది. ఏ కారణం చేతనైనా శరీరం చల్లబడి పోయి అవసాన దశకు చేరుకుంటూ ఉంటే ఆ పరిస్థితి నుండి రక్తవర్ణం రక్షిస్తుంది. ఆయుర్వేద వైద్యులు అట్టి సమయాలలో కస్తూరిని ప్రయోగిస్తారు. దానిరంగు ఎరుపే. అది ఉద్దీపక ఔషధం. శరీరంలో వేడిని పుట్టిస్తుంది. రక్తప్రసరణాన్ని అధికం చేసి ఈడ్పులను, కొంకర్లను (Convulsionsను) తగ్గిస్తుంది. ప్రాణాలను రక్షిస్తుంది. ఎరుపు రంగు కూడా సరిగా అట్టి పనినే చేస్తుంది. కాన దీనిని వర్ణ కస్తూరి అనవచ్చు.

మన శరీరంలో ఎర్రని రక్తం ప్రతి కణానికి ప్రాణవాయువును చేరవేసి వాటిని జీవింప చేస్తుంది. అది తక్కువైనా లేక రక్త ప్రసరణ మందగించినా శరీరం చల్లబడి పాలిపోయి నీలవర్ణంగా మారిపోతుంది. ఆ స్థితిలో ఎరుపురంగు రక్తానికి ఉద్దీపన కలిగిస్తుంది. నాడులలో ఉత్తేజాన్ని కలిగిస్తుంది. అధికమౌతున్న వాతాన్ని హరిస్తుంది. శ్లేష్మ ప్రకోపాన్ని శమింప జేస్తుంది. ప్రాణాలను రక్షిస్తుంది. ఇది కేవలం ప్రాణాపాయకర పరిస్థితులలోనే కాక వాత శ్లేష్మాధిక్యతగల వ్యాధులన్నిటిలోను మేలు చేస్తుంది. రోగ తీవ్రతను బట్టి ఈ రంగు అవసరమౌతుంది.

డాక్టర్ ఎస్. పాన్ కోస్టు గారు డిఫ్తీరియా అనంతరం వచ్చిన తీవ్ర పక్షవాతాన్ని (Post Diptheritic Paralysis) ను ఎర్రని కాంతితో కుదిర్చారు. ఇంతేగాక వారు శ్లేష్మాధిక్యతగల 3 వ దశకు చేరుకున్న క్షయవ్యాధిని, మొండి మేహవాత రోగాన్ని, వాత ప్రకోపంచే కలిగిన నాడీ దౌర్బల్యాన్ని ఈ రంగుతో కుదిర్చారు. ఇది శరీరంలోని మాంద్యాన్నే కాక మనస్సులోని మాంద్యాన్ని కూడా మాయం చేస్తుందని వారంటారు. అయితే కేవలం ఎరుపు రంగు ఒక్కటే కాక నీలం లేదా మరేదైనా రంగుతో మార్చి మార్చి ఉపయోగించటం మంచిదని చాల మంది వైద్యుల అభిప్రాయం. ఎందుచేతననగా ఎరుపు రంగులో వేడిచేసేగుణం వుంది. ఇది ధమనుల (Arteries) లోని ఎర్ర రక్తాన్ని

ఉత్తేజ పరుస్తుంది. అందుచే శరీరంలో వాపులు, ఉద్రిక్తతలు, రక్తస్రావాలు ఉన్నప్పుడు ఈ రంగు ప్రసరింప చేయకూడదు.

శరీరం వేడెక్కి ఉన్నప్పుడు, మంటలతో కూడిన బాధలు ఉన్నప్పుడు అతిసారాది ఉద్రిక్తతలు ఉన్నప్పుడు శరీరంలో ఎరుపు రంగు అధిక మగుటవల్ల వచ్చే వ్యాధులకు, బాధలకు, జ్వరాలకు ఈ రంగు వాడకూడదు. ఇంతేగాక, ఈ వర్ణోదకం లోనికి ఎప్పుడు త్రాగించకూడదు. ఆ విధంగా చేస్తే విరేచనాలు, రక్త విరేచనాలు కలగవచ్చు. అందుచే అరుణోదకాన్ని లోనికి త్రాగించుట మంచిది కాదు. శరీరంపై మర్దనచేయవచ్చు లేదా దీనిలో తడిపిన గుడ్డను పైన పట్టీ మాదిరిగా వేయవచ్చు. అప్పుడు అది అయోడిన్ కన్న ఎక్కువ గుణకారి అవుతుంది. అరుణ కాంతిని శరీరంపై అవసరమైన భాగాలకే ప్రసరింప జేయాలి. మిగిలిన భాగాలకు నీలం లేదా మరేదైనా అవసరమైన రంగును ప్రసరింప చేయవలసి ఉంటుంది. ఏమైనప్పటికినిది ఉష్ణాన్ని, ఉద్రేకతను కలిగించేది కనుక అవసరమైనప్పుడు మాత్రమే మితంగా వాడాలి. లేకున్న మేలు కన్న కీడు కలిగే ప్రమాదం ఉంది.

శరీరంలో ఈ రంగు ఎక్కువయితే మల మూత్రాలు, చర్మం, కళ్ళు పచ్చబడతాయి. ఇంద్రియశక్తులు క్షీణిస్తాయి. శరీరంలో తాపం పెరిగి చల్లటి పదార్థాల కోసం, చల్లటి గాలి కోసం రోగులు పరితపిస్తారు. అతిదాహం, నిద్రలేమి, మూర్ఛ, జ్వరాలు, అతిసారం కలగవచ్చు. పిత్త ప్రకోపంతో అనేక చర్మవ్యాధులు కలగవచ్చు. చర్మం పగలవచ్చు. అప్పుడు వీటికి విరుగుడుగా నీలంరంగు వాడవలసి ఉంటుంది. ఎరుపురంగు తక్కువయితే చలి, వణుకు, అగ్ని మాంద్యం, క్షయ, ఉబ్బసం, నాడీ దౌర్బల్యం, నపుంసకత, వాత వ్యాధులు కలగవచ్చు. అప్పుడు మితంగా, హితంగా లేదా వేరే రంగులతో ఈ ఎరుపు రంగును వాడవలసి ఉంటుంది.

ఆధునిక పరిశోధనలలో ఎరుపురంగు మన వెన్నెముక చివరి భాగమైన త్రోటిక (కాకిక్స్) ప్రాంతాన్ని ప్రభావితం చేస్తున్నట్లుగా తెలిసింది. ఇక్కడి నుండే దేహానికి కావలసిన ఉష్ణశక్తి లేదా శక్తి (వైటాలిటీ) ఉత్పత్తి అవుతుందని కొందరి అభిప్రాయం. వారు ఎరుపు కిరణాలను **'ఫాదర్ ఆఫ్ వైటాలిటీ'** (జీవధాతు శక్తియొక్క తండ్రి) అంటారు. త్రోటిక ప్రాంతానికి ఎరుపు కిరణాలు ప్రసరింపజేస్తే రక్తవృద్ధి జరిగిందని, రోగ నిరోధక శక్తి పెరిగిందని వెల్లడయ్యింది. ఈ రంగును ప్రసరింప చేసినగాలిలో దీర్ఘశ్వాసలు తీసుకుంటే కూడా లాభం కలుగుతున్నట్లు గుర్తించారు. విద్యుద్దీపాలతో కృత్రిమంగా

ప్రసరింపజేసిన అరుణ కాంతి కన్న ప్రకృతిలో సహజంగా లభించే సూర్యుని అరుణ కాంతి మరింత గుణకారి. సూర్యోదయం, సూర్యాస్తమయ సమయాలలో అరుణకాంతి మనకు పుష్కలంగా లభిస్తుంది. ఆ కాంతిలో దీర్ఘ శ్వాసలు తీసుకుంటే ఎక్కువ లాభం కలుగుతుంది. గాలి ద్వారా లోపలికి (తక్కువ వస్త్రాలు ధరిస్తే) చర్మం ద్వారా పైకి అరుణ చికిత్స జరుగుతుంది. ఆ సమయాలలో సూర్యుడు ఎర్రగా కనబడతాడు. కొద్ది నీలం కలిసిన ఎర్రని కాంతిని ప్రసరింప జేస్తాడు. అందుచేతనే అరుణ భాస్కరుడని పేరు వచ్చింది. అయితే ఈ అరుణకాంతి ఉదయం కొద్దిసేపే ఉంటుంది. తరువాత సూర్యకిరణాలు సప్తరంగుల మిశ్రమమైన తెల్లని రంగును ప్రసరింప జేస్తాయి. తదుపరి సాయంత్రం సూర్యాస్తమయ సమయంలో మాత్రమే యివి లభిస్తాయి. కనుక అప్పుడే వాటిని సేవించాలి. అరుణ కాంతిని ఎక్కువగా సేవించటం మంచిది కాదనే కాబోలు భగవంతుడు ఆ విధంగా సృష్టించాడు.

అరుణ కాంతి మనలో శారీరక, మానసిక మాంద్యతలను పోగొడుతుంది. అందుచేతనే పెద్దలు అరుణకాంతిలో భ్రమణం (నడక) చేయుమంటారు. సోమరులకు, బద్ధకస్తులకు, బుద్ధి మాంద్యం గలవారికి అరుణకాంతి మేలు చేస్తుంది. నిరాశావాదులను ఆశావాదులుగా చేస్తుంది. అరుణ కాంతిలో భ్రమణం చెయ్యండి. ఆరోగ్యాన్ని, ఆనందాన్ని పొందండి.

## సప్తవర్ణ మిశ్రిత శ్వేత వర్ణం (పారదర్శక తెలుపు)

ఏడు రంగుల కలయికతో ఏర్పడిన సామాన్య సూర్య కిరణాలు ప్రాణులన్నిటికి అనేక విధాల మేలు చేస్తున్నాయి. ప్రాణి జాతులన్నిటికి అవే జీవనాధారాలు. అందుచేతనే వేదం **'సూర్య ఆత్మా జగతః తస్థుషః'** అని చెబుతుంది. ఆరోగ్యవంతమైన శరీరాలు వాటి నుండే అన్ని రంగులను అవసరమైనంత మేరకు పొందుతూ ఉంటాయి. మన శరీరంలోని జీవధాతుశక్తి (Vital Force) వాటిని ఆయా పాళ్ళల్లో పొందలేని స్థితి ఏర్పడినప్పుడే వ్యాధి గ్రస్తమౌతుందని సూర్యకిరణ చికిత్సకులంటారు. నాగరికత పేరుతో ప్రాకృతిక సహజ జీవనానికి దూరం కావటం వల్లనే శరీరానికి వర్ణ స్వీకారశక్తి పోతుంది. అప్పుడే శరీరంలో కొన్ని రంగులు తగ్గటం, కొన్ని రంగులు పెరగటం జరుగుతుంది. దానితో శరీరం రోగగ్రస్తమౌతుంది. మరల

వాటిని సరిచేస్తే ఆరోగ్యం వస్తుంది.

ఎండలోకి పోకుండా ఎప్పుడూ నీడపట్టునే గదులలో భవనాలలో గడిపేవారు సుకుమారంగా కొంత తెల్లగా కనబడుతున్నా వారి అందం ఆరోగ్యవంతమైనది కాదు. రక్త లేమితో పాలిపోయి కొంత తెల్లగా కనబడతారు. అట్టివారికి కొద్ది ఎండ తగిలితే వేడి చేస్తుంది. కొద్ది చలిగాలి తగిలితే జలుబు చేస్తుంది. పని చేసే శక్తి తక్కువగా ఉంటుంది. తొందరగా అలిసి పోతారు. తరచు రోగకారక సూక్ష్మక్రిములకు గురియై రోగగ్రస్తులవుతూ ఉంటారు.

ఎండలో పనిపాటలు చేసుకునే వారి చర్మం కొద్ది నలుపుగా మారినా నిగనిగలాడుతూ ఆరోగ్యవంతంగా ఉంటుంది. స్నోలు, పౌడర్లు, క్రీములు అవసరం లేకుండానే సహజ సౌందర్యంతో ప్రకాశిస్తూ ఉంటారు. ఊబకాయం (స్థూలత) ఉండదు. రోగాలు చాలా అరుదుగా వస్తాయి. వచ్చినా ఒకటి రెండు రోజుల ఉపవాస చికిత్సతో పోతాయి. ఇప్పుడిప్పుడు వారు కూడా అల్లోపతి మాయాజాలంలో పడిపోతున్నారు. కాని అవకాశం యిస్తే మందుల అవసరం లేకుండానే వారు ఆరోగ్యవంతులౌతారు.

ఎండలో తిరగటం అలవాటు లేనివారు ఒకేసారి ఎండలో ఎక్కువ కాలం ఉంటే వారికి వేడి చేస్తుంది. బాలురు, వృద్ధులు, బలహీనులు, సుకుమారులు మరింత జాగ్రత్త వహించాలి. మంచిది కదా అని శరీర శక్తికి మించి ఎండకు గురికాకూడదు. ఆ విధంగా చేస్తే స్పృహ తప్పి పడిపోవడం జరుగవచ్చు. కనుక క్రమంగా అభ్యాసం చేసుకోవాలి. నీడలోనే పనిపాటలు, ఉద్యోగాలు చేసేవారు, గృహిణులు ప్రాతః సాయంకాలాలలో కొద్దిసేపు సౌమ్యమైన ఎండలో తిరగటం మంచిది. చికిత్సాపరంగా శరీరానికి సూర్య కిరణాలు అవసరమైన వారికి ఏ భాగానికి అవసరమో ఆ భాగంపై కొద్ది నిముషాలు సూర్యకిరణాలు ప్రసరింప జేస్తే చాలు. ఏ రంగులేని పారదర్శక అద్దం ద్వారా ప్రసరింపచేస్తే సౌమ్యంగా ఉంటుంది. కొంత వేడి ప్రకాశ తీక్షణత తగ్గి రోగికి బాధ కలుగకుండా ఉంటుంది.

కేంద్రీకృత అద్దము ( భూతద్దము - Double converelens) ద్వారా శుద్ధమైన సూర్యకిరణాలను కంతులు వ్రణాలపై ప్రసరింపజేసి చికిత్స చేయవచ్చు. ఈ పద్ధతిలో శస్త్ర చికిత్స కన్న ఎంతో మేలైన ఫలితాలు కలిగినట్లు డా. ఆగస్టన్ చార్నన్ 'హెరాల్డు ఆఫ్ హెల్తు' అనే న్యూయార్కు పత్రికలో వ్రాసారు. కుదిరిన అనేక రోగుల రోగ వృత్తాంతాలను ప్రచురించారు.

వారు ఎంత అనుభవంతో, ఎంత ఆత్మ విశ్వాసంతో వ్రాసారో చూడండి -- 'ఎట్టి కంతులనైనను .... కేవలము భూతద్దములతో సూర్యకాంతిని కేంద్రీకరించి ఒక్క రక్తబిందువైనను చిందకయే, ఒక కత్తిపోటైనను తగలకయే ఒక్క గుర్తైనను (మచ్చ అయినను) లేకుండా బహుకొలది కాలములో పోగొట్టగలను. శస్త్ర చికిత్సలో కన్న ఈ పద్ధతిలో బాధ తక్కువగా ఉంటుంది. ఉబ్బెత్తు మచ్చలు (Scars) పడవు. కంతులు మరలా రావు. ఏ రాసాయనిక మందులు అవసరం లేకపోవుటచే రాసాయనిక విషము లేవియు శరీరములో చేరవు. మత్తుమందుల అవసరం లేదు. అపాయాలు అసలు లేవు. మనం యుక్తితో వివిధ సూర్యకిరణ చికిత్సలు చేస్తే శరీరాంతర్గత కంతులు కూడా కరిగి పోగలవు. వ్రణాలు మానిపోగలవు.

సామాన్య సూర్యకిరణాలలో రోగజీవులను నశింపజేసే శక్తి ఉంది. దానికి ఈ క్రింద లేఖ ప్రమాణం.

''ఎమ్.ఎస్. ఆర్మీ సర్జన్ జనరల్ గార్కి -

ప్రియమైన అయ్యా!

సూర్యకిరణాలలో చీమును, క్రుళ్ళును పోగొట్టి అంటువ్యాధులను నిరోధించే శక్తులున్నాయని నేను కనుగొన్నాను. 100, 120 డిగ్రీల వేడిలో క్రుళ్ళు నాపి సూక్ష్మ జీవులను చంపే శక్తి ఉంది. నేను మానవుల, జంతువుల పాత, క్రొత్త వ్రణాలపై సూర్యకాంతిని ప్రసరింప చేసాను. చాలా కొద్ది కాలములోనే వ్రణాలలోని క్రుళ్ళంతయు పోయి ఎర్రపుండు పడి త్వరలో మానుటకు సిద్ధమైనవి. ఒక వ్యక్తికి రెండు వ్రణములు పుట్టెను. అందులో ఒకదానికి మందుల పట్టీలతోను, మరొక దానికి సూర్యకిరణ ప్రసారంతోను చికిత్స చేసాను. మందుల పట్టీలతో ఒక మాసమునకు పూర్తిగా తగ్గగా సూర్యకిరణ చికిత్సతో ఒకగంటలో క్రుళ్ళు తగ్గి కొద్ది దినములలోనే పూర్తిగా తగ్గినది. ఇట్టివే అనేక పాత క్రొత్త వ్రణాలు పుండ్లు తగ్గినవి. వ్రణాలే కాక యితర వ్యాధులకును ఇది జయప్రదముగా పని చేయుచున్నది. కాన ప్రకృతిలో నిదియును ఒక చికిత్సా రత్నము కాగలదు.

ఇట్లు

జేమ్స్ టిడెజన్ దారిఫ్

(న్యూయార్క్ మెడికల్ రికార్డు - 10-11-1894)

ఈ లేఖ. గురించి సమీక్షించుచు డా. బాబిట్ గారు ఈ సూర్యకిరణములతో వ్రణ చికిత్సను జేమ్సు టిడెజన్ దారిఫ్ గారే క్రొత్తగా కనిపెట్టిరని వ్రాసారు. ఈ లేఖ క్రీ.శ. 1894లో ప్రచురింప బడింది. కాని ప్రపంచ ఆదిమ గ్రంథమైన మన వేదం ఏమి చెబుతున్నదో చూడండి.

**అవ దివస్తారయన్తి సప్త సూర్యస్య రశ్మయః।**
**ఆపః సముద్రియా ధారాస్తాస్తే శల్యమసిస్రసన్॥**

**(అథర్వ - 7-107 -1)**

సూర్యుని సప్తవిధ కిరణములు అంతరిక్షస్థ జలరాశిని వర్షము ద్వారా భూమిపైకి స్రవింప జేయుచున్నవి. అట్లే ఆ సూర్య కిరణములు నీ శల్యమును (అందలి చీము, చెడు రక్తము, క్రిములు, ఇతర పదార్థములను) స్రవింపజేయును.

శల్యము అనగా శస్త్రములతో గాని, ప్రమాదం వల్ల గాని, అజాగ్రత్త వల్ల గాని తగిలిన గాయాలు లేదా శరీరంలో చేరిన మాలిన్యములు, సూక్ష్మ జీవుల కారణంగా పుట్టిన కంతులు, వ్రణాలు, వీటన్నిటిని సూర్య కిరణములను కేంద్రీకరింపజేసి పోగొట్టవచ్చునని పై వేదమంత్రం చెబుతుంది. మరి డా. జేమ్సు టిడెజన్ దారిఫ్ గారు క్రొత్తగా కనిపెట్టిన దేమున్నది? వేదాలలో విజ్ఞానం ఈ విధంగా బీజ రూపంలో ఉంటుంది. వాటిని చదవకపోవటం మనన చింతనలు చేయకపోవటం, పరిశోధనలు చేయకపోవటం మన పొరపాటు. కాన **వేద స్వాధ్యాయం చెయ్యండి. విజ్ఞాన గురువులై వెలగండి.**

## చికిత్సా పద్ధతులు – పరికరాలు

పై ప్రకరణంలో మనం వివిధ రంగుల సామాన్య గుణాలను తెలిసికొన్నాము. రోగులలో లోపించిన రంగులు ఏవో తెలిసికొని వాటిని పూరించవలసి ఉంది. రోగుల బాధలను బట్టి క్రిందటి ప్రకరణంలో వివరించిన రంగుల వస్తుగుణ దీపిక నుండి అవసరమైన రంగును ఎన్నుకోవచ్చు. ఆ ఎన్నుకొన్న రంగును రోగుల శరీరంలో ప్రవేశింప చేయటానికి కొన్ని పరికరాలు అవసరం. వాటిని సంక్షిప్తంగా ఈ ప్రకరణంలో తెలిసికొందాము. మీకు దగ్గరలోనున్న ప్రకృతి చికిత్సాలయానికి వెళ్ళి

స్వయంగా చూస్తేగాని సరియైన అవగాహన కలుగదు. ఆ విధంగా వీలుపడకపోయినా సూక్ష్మంగా ఆలోచిస్తే ఈ పరికరాల గురించి అర్థం అవుతుంది. లేదా ఈ ప్రకరణంలో చివరగా వర్ణించే వర్ణోదక చికిత్సను చేయవచ్చు. అది అందరికి అందుబాటులో ఉంటుంది.

1) **రంగుల అద్దాలు:** పైన తెలిసికొన్న సప్త వర్ణములుగల అద్దములు సేకరించవలసి యుండును. లేదా దుకాణాలలో అమ్మబడే రంగుల పారదర్శక (సెల్లోఫేన్) కాగితాలతో కావలసిన రంగు అద్దాలను నిర్మించుకోవచ్చు. సుమారు ఒకటిన్నర అడుగుల పొడవు, ఒక అడుగు వెడల్పుగల అద్దములు సరిపోవును. రెండు అద్దముల మధ్య రంగు కాగితమును ముడతలు పడకుండా అమర్చి చిత్రాల వూదిరిగా చుట్టూ కట్టెపట్టీ (Frame) కట్టించుకుంటే అనుకూలం ఉంటుంది. ఉదయం, సాయంకాలం సూర్యకిరణాలు లోపలకు ప్రసరించే వరండాలోగాని, గదిలో గాని ఈ చికిత్స చేయవలసి ఉంటుంది. ఏ శరీర భాగంపై చికిత్స అవసరమో ఆ భాగంపై ఎండ పడేటట్లు రోగిని కూర్చోబెట్టాలి. మిగతా భాగాలకు నీడ వచ్చేటట్లు ఏర్పాటు చేసుకోవాలి. ముఖ్యంగా తలకు నీడ రావాలి. చికిత్సకు ముందు రోగిచే ఒక గ్లాసు నీళ్ళు త్రాగించటం మంచిది. రోగమును బట్టి అవసరమైన రంగును రంగు అద్దముతో అవసరమైన భాగంపై పడేటట్లు పట్టుకోవాలి. లేదా ఏదైనా నిలబెట్టే స్టాండ్ ఏర్పాటు చేసుకోవాలి. శరీరం నుండి ఒకటి లేదా రెండడుగుల దూరంలో అద్దం పట్టుకుంటే మంచిది. ఆ విధంగా 10 నుండి 20 నిముషాల చికిత్స చేస్తే సరిపోతుంది. దినానికి ఒకసారి లేదా రెండుసార్లు ఈ చికిత్స చేయవచ్చు. తరుణ వ్యాధులలో 2, 3 రోజుల చికిత్స సరిపోతుంది. దీర్ఘ వ్యాధులలో కొన్ని వారాల చికిత్స అవసరమౌతుంది..

2) **ఆదిత్య పేటిక:** ఇది రోగులకు సూర్యకిరణముల వేడితో కాంతితో శరీరానికి చమట పుట్టించే ఒక పెద్ద పెట్టె. దీనిలో ఒక పీటపై రోగి కూర్చున్న తల మాత్రము బయటకు కనబడుతుంది. మిగిలిన భాగమంతా పెట్టెలో బంధింపబడి నట్లుంటుంది. పెట్టెకు మూడు వైపుల, క్రింద పూర్తిగా గాలి చొరకుండా మూసి యుంటుంది. పై చెక్కకు మెడ పట్టునంతటి రంధ్రముంటుంది. నాలుగవ వైపు ఏటవాలుగా 4, 5 రకముల రంగు అద్దములు అమర్చుటకు ఏర్పాట్లుంటాయి. పెట్టె యొక్క ఏటవాలు భాగము సూర్యాభిముఖంగా పెట్టి, దాని తలుపును తీసి రోగిని ప్రవేశ పెట్టి

పీటపై కూర్చుండబెట్టుదురు. తలుపు మూసి, పై భాగమున మెడను, తలను తప్పించి మిగిలిన భాగమంతా మూయుదురు. సూర్యాభిముఖంగా ఉన్న ఏటవాలు భాగంలో పైన నీలరంగు అద్దముంటుంది. దానివల్ల ముఖం తలలపై నీలంకాంతి ప్రసరిస్తుంది. దాని క్రింద ఊదారంగు (Violet) అద్దముంటుంది. దీని కాంతి ఛాతీ భాగముపై ప్రసరిస్తుంది. దాని క్రింద పసుపు అద్దముండి కడుపుపైన అట్లే జననేంద్రియాలపై ఆకుపచ్చ, కాళ్ళపై ఎరుపు రంగులు ప్రసరించునట్లుగా అద్దములు ఏర్పాటు చేయబడతాయి. ఈ రంగుల క్రమం సామాన్య స్థితికి చెందింది. వ్యాధిని బట్టి, రోగ స్థితిని బట్టి పై రంగులలో మార్పులు చేయవలసి ఉంటుంది. కూర్చుండలేని రోగుల కొరకు పొడువుగా పరుండుటకు వీలుగా ప్రత్యేక ఆదిత్య పేటికలుంటాయి. వాటిలో రోగిని బోర్ల పడుకోబెట్టి శరీర వెనుక భాగాలకు కూడా రంగు కాంతిని ప్రసరింప జేసే వీలుంటుంది.

ఈ పెట్టెలోని విశేషమేమంటే యితర ఆవిరి పెట్టెలలో 140, 150 డిగ్రీల ఉష్ణమున్నప్పుడు ఎంత చెమట పడుతుందో అంత చెమట కేవలం 80 డిగ్రీల ఉష్ణంలోనే పడుతుంది. వేడి యావిరి, నీటి యావిరి కేవలం కండరాల మాంస పేశీల మాలిన్యాలనే చెమటద్వారా వెళ్ళగొట్టగలుగుతాయి. ఈ ఆదిత్య పేటికలోని సూర్యకిరణ సంబంధమైన వేడి నరాలలోని మాలిన్యములను కూడా చెమట ద్వారా వెళ్ళగొట్టగల శక్తివంతమైనది. నరాల ఈడ్పు, పిచ్చి మొదలగు నాడీ వ్యాధులకు ఇది ఉత్తమమైన చికిత్స. ఈ పద్ధతిలో నీరసం రాదు. నాడులు బలపడతాయి. తల పెట్టె బయటనే ఉండి తలకు నీలికాంతి ప్రసరించటంవల్ల చల్లగా, హాయిగా ఉంటుంది. మనస్సు ప్రశాంతంగా ఉంటుంది. వ్యాధిని బట్టి అవసరమైన రంగులను, అవసరమైన భాగాలకు ఒకేసారి ప్రసరింప జేసే వీలుంటుంది. శరీరంలో వేడి, మంటలు ఉన్న భాగానికి నీలంకాంతి, కరుడుగట్టిన వాతం ఉన్న భాగానికి ఎరుపు, పసుపు రంగులు ప్రసరింప చేయవచ్చు. డా. ఇ.డి. బాబిట్ ఎం.డి. గారు దీని విశేషతను కొనియాడుతూ ''మిగతా ఆవిరి పెట్టెలలో కన్నా దీనిలో మాలిన్య బహిష్కరణ ఎక్కువగా జరగటమే గాక నాడులకు బలం, రక్తానికి ప్రాణ శక్తి లభిస్తాయి. సూర్యుని నుండి వచ్చే రంగు అణువులు, ఈథర్స్ (Ethers) నరాలకు బలాన్ని, ఉత్తేజాన్ని కలిగిస్తాయి. నరాలలో చేరిన మాలిన్యం వల్లనే పిచ్చి వ్యాధి వస్తుంది. ఈ ఆదిత్య పేటిక ఆ నాడీ

మాలిన్యాన్ని చెమట ద్వారా బహిష్కరించి ఆరోగ్యాన్ని కలిగిస్తుంది. నరాల సంబంధమైన అన్ని వ్యాధులకు ఇది ఉత్తమ చికిత్స'' అంటారు.

ఇది చెమట పుట్టించే చికిత్స కనుక ముందుగా రోగిచే 2, 3 గ్లాసుల నీరు త్రాగించాలి. అవసరమనుకుంటే తలకు తడిగుడ్డ చుట్టవచ్చు. వీలైనంత తక్కువ వస్త్రాలతో కూర్చుండబెట్టాలి. సామాన్యంగా ఉదయం 9-11 గంటల మధ్య, సాయంత్రం 3-5 గంటల మధ్య ఎక్కువ అనుకూలంగా ఉంటుంది. ఈ చికిత్స 10 నుండి 20 నిముషాలు చేయవచ్చు. చెమట ఆరిన తరువాత సామాన్య ఉష్ణం గల నీటితో స్నానం చేయాలి.

ఎండ లేనప్పుడు చికిత్స చేయడానికి అనువుగా విద్యుత్ పేటికలు నిర్మించి విదేశాలలో చికిత్సలు చేస్తున్నారు. విద్యుత్ కాంతివల్ల కూడా ఫలితాలు కలుగుతున్నట్లు చెబుతున్నారు. చికిత్సానంతరం రంగుల కాంతులలో సుగంధ జలాలతో స్నానాలు చేయిస్తున్నారు. ఈ ఆడంబరాలన్నీ విలాసవంతులను ఆకర్షించడానికే అనిపిస్తున్నది. ఏమైనా విద్యుత్ కాంతి కన్న ప్రాకృతిక సూర్యకాంతే ఎక్కువ గుణకారి అని మా అభిప్రాయం. అయితే సూర్యరశ్మి లేనప్పుడు లేదా చికిత్సకు అనుకూలంగా లేనప్పుడు రాత్రులలోను, ప్రత్యేక పరిస్థితులలోను ఈ విద్యుత్ పేటికలను ఉపయోగించుకోవచ్చు. విద్యుత్ కాంతి కూడా ఒక సూక్ష్మమైన రాసాయనిక పదార్థమే. సూర్యకాంతి మాదిరిగానే అది మన శరీరంలోకి చొచ్చుకు పోగలదు.

## 3. అరటి ఆకులతో ఆతపస్నానం

ఎండలో ఒక చాపపై అడ్డముగా పెద్ద పెద్ద అరటి ఆకులు పరవాలి. దానిపై రోగిని పరుండబెట్టి ఆకులను అతని శరీరముపైకి మడచి తాళ్ళతో జారిపోకుండా కట్టాలి. వాటిపై నుండి మరల అడ్డముగా అరటి ఆకులు పరచి శరీరం క్రిందికి మడచి పెట్టాలి. శ్వాస పీల్చుకోవడానికి కావలసినంత స్థలమును వదిలి తలను, అరికాళ్ళను కూడా యుక్తితో కప్పాలి. వీలైనంతగా లోపలికి గాలి జొరకుండా జాగ్రత్తగా శరీరాన్నంతటిని ఆకులతో కప్పాలి. ఆ విధంగా 15 లేదా 20 నిముషాలు ఉంచి ఆకులు తీసివేసి రోగిని నీడకు చేర్చాలి. చెమట ఆరిన తదుపరి చన్నీటితో స్నానం చేయించాలి. ఈ చికిత్స వల్ల బాగా చెమట పడుతుంది. చెమట పట్టని మొద్దు చర్మం గలవారిలో 3,

4 రోజుల కొకసారిగా కొన్ని రోజులు చికిత్స చేస్తే తప్పక చెమట పడుతుంది. ఇది శ్వేదజనక చికిత్స కనుక ముందుగా రోగిచే 2, 3 గ్లాసుల నీరు త్రాగించాలి. అవసరమనుకుంటే రోగి తలకు తడిగుడ్డ చుట్టాలి. లేదా తలకు నీడనిచ్చే ఏర్పాటు చేయాలి. అరటి ఆకులు దొరకని చోట క్రోటాన్ ఆకులవంటి పెద్ద ఆకులు వాడుకోవచ్చు. సామాన్యంగా ఈ చికిత్స ఉదయం 9, 11 గంటల మధ్య, సాయంత్రం 3, 5 గంటల మధ్య చేస్తే అనుకూలంగా ఉంటుంది.

ఇది ప్రాకృతిక ఆకుపచ్చ రంగుతో చేసే సూర్యకిరణ చికిత్స కాన ఆకుపచ్చ రంగులోని గుణాలన్నీ దీనివల్ల కలుగుతాయి. అన్ని రకాల చర్మ వ్యాధులలోను, నాడీ మండల వ్యాధులలోను ఇది చాలా మేలు చేస్తుంది. కుష్ఠ వ్యాధి నయమౌతుంది. అన్ని వ్యాధులలోను ఎంతోకొంత మేలు చేస్తుంది. ఏలయన ఇది శరీరంలో అతిపెద్ద బహిష్కారావయవమైన చర్మాన్ని ఉత్తేజపరచి మాలిన్యాలను బహిష్కరిస్తుంది. చర్మానికి బలవర్ధక ఔషధం వలె మేలు చేస్తుంది.

### 4) సూర్య కిరణ కేంద్రీకరణి (Chromo Disk)

ఇది యిత్తడితో తయారైన బాకావంటి గొట్టమువలె ఉంటుంది. ఒకవైపు పెద్ద గుండ్రముగా, రెండవ వైపు కొంత చిన్నగా ఉండి లోపల వైపు కళాయి చేయబడి ఉంటుంది. ఎక్కువ వృత్త వైశాల్యముగల వైపు సూర్యాభిముఖంగా పెట్టిన అందు ప్రసరించిన సూర్య కిరణములు కొంత కేంద్రీకృతమగును. వాటిని వెనుకగల రంధ్రము ద్వారా రోగి శరీర భాగములపై ప్రసరింప జేస్తారు. దీనితో ఏ అవయవ భాగమునకు ఎంత అవసరమౌతుందో ఆ భాగమునకు అంత మాత్రమే ప్రసరింప జేయవచ్చు. కిరణాలు కేంద్రీకృత మగుటచే కొద్ది వేడిగా కాపడం పెట్టినట్లుంటుంది. సూర్యాభిముఖంగా ఉన్న వెడల్పు భాగంపై రంగుల అద్దాలను గాని, కాగితాలను గాని పెట్టి కావలసిన రంగు కిరణాలను ప్రసరింప జేయవచ్చు. దానివల్ల రంగుల గుణాలు ద్విగుణీకృత మౌతాయి.

కేంద్రీకృత నీలకాంతిని వేడి, మంటలు, రక్తస్రావాలు గల భాగాలపై ప్రసరింపజేస్తే మంచి ఫలితాలు వస్తాయి. వెన్ను చివర ప్రసరింపజేసి

కామాతిరేకాన్ని తగ్గించవచ్చు. ఎరుపు రంగుతో కంతులను హరింప చేయవచ్చు. కీళ్ళ వాతాన్ని తగ్గించవచ్చు. పసుపు రంగును కేంద్రీకృతం చేసి చచ్చుపడిన నాడులను ఉత్తేజ పరచవచ్చు. జీర్ణ కోశాన్ని, కాలేయాన్ని, ప్రేగులను ఉత్తేజింప జేయవచ్చు. అట్లే ఏ రంగును కేంద్రీకరిస్తే ఆ రంగు శక్తి పెరుగుతుంది.

**5) కిరణ కేంద్రీకరణ అద్దము(Chromo Lens)**

వేసవిలో చల్లటి నీటి కొరకు ఉపయోగించే తాబాటికాయ కూజా వంటి గాజు కూజాలను సంపాదించి అందులో నిండుగా నీరుపోసి గట్టిగా బిరడా పెట్టాలి. దాని వెడల్పు భాగాన్ని సూర్యాభిముఖంగా పెట్టి రెండవ వైపు 4 - 6 అంగుళాల దూరంలో రోగిని ఉంచాలి. భూతద్దములో నుండి కిరణాలు ప్రసరించి కేంద్రీకృతమైనట్లు దీని ద్వారా కొంత కేంద్రీకృతమైన కాంతి లభిస్తుంది. రంగు కూజాలయితే ఆయా రంగుల కాంతి లభిస్తుంది. లేదా తెల్లటి కూజాలకు రంగు కాగితాలు చుట్టి ఆయా రంగులను పొందవచ్చు. వీటివల్ల రెండు విధాలైన లాభాలున్నాయి. (1) రోగి శరీరంపై ఆయా భాగాలకు కావలసిన కాంతిని కొంత కేంద్రీకృతం చేసి ప్రసరింప జేయవచ్చు. ఇది బాహ్య చికిత్స అవుతుంది. (2) ఆ రంగు కూజాలోని నీటిని రోగులచే త్రావించిన శరీరాంతర చికిత్స ఔతుంది.

ఇవేగాక కూజాలను కొన్ని గంటలు ఎండలో ఉంచి సూర్యపుటము పెడితే అందులోని నీటికి మందులకన్న మించిన ఔషధ శక్తులు వస్తాయి. మందులను ఎంత సూక్ష్మీకరించినా నాడీ కేంద్రాల వద్దకు చేరుకోలేవు. కాని ఈ సూర్య కిరణ జలం అతి సూక్ష్మంగా ఉండి నాడీ కేంద్రాల వరకు చేరి వాటిని ఉత్తేజపరచ గలుగుతుంది. మందులలో కొన్ని దుర్లక్షణాలు ఉద్రేకాలు ఉండవచ్చునేమో కాని ఈ నీటిలో అట్టివేమీ ఉండవు.

పసుపు కూజాలో నీరు నిండుగా పోయకూడదు. పసుపు రంగుకు వృద్ధి చేసే గుణం ఉంది. అందుచేత నిండుగా పోస్తే ఎండకు పగిలి పోవచ్చు. దానిలో పోసిన నీళ్ళు 2 రోజుల కొకసారి మారిస్తే మంచిది. నీలి, ఊదా రంగులకు క్రుళ్ళును ఆపే శక్తి ఉంది. అందుచే ఆ కూజాలలోని నీళ్ళు చెడిపోకుండా ఎక్కువ రోజులు నిలువ ఉంటాయి. మిగిలిన రంగు కూజాలలోని నీళ్ళు 2 రోజుల కొకసారి మార్చాలి. ప్రయత్నిస్తే ప్రయోగశాలలో లేదా వాటి పరికరాలు అమ్మే దుకాణాలలో గాజు కూజాలు లభిస్తాయి. రంగులవి దొరకక పోవచ్చు. తెల్లనివి తీసుకొని అవసరమైన రంగుల

కాగితాలు చుట్టుకుని ప్రయోగింపవచ్చు. లేకున్న ఈ క్రింది వర్ణోదకములను తయారు చేసుకోవలెను.

**వర్ణోదకాలు:** ఇది అన్నిటికన్నా సరళ పద్ధతి. సీసాలు ఏ ఆకారంలో ఉన్నా సరిపోతుంది. మనకు కావలసిన రంగుల సీసాలు దొరకక పోయినా తెల్లని పారదర్శక సీసాలను రంగుల సెల్లోఫేన్ కాగితాలు చుట్టి వాడుకోవచ్చు. సామాన్యంగా దుకాణాలలో ఎరుపు, ఆకుపచ్చ, ముదురు నీలం, పసుపు రంగుల పారదర్శక కాగితాలు (సెల్లోఫేన్ ప్లాస్టిక్ కాగితాలు) దొరుకుతాయి. వాటితో మిగిలిన 3 రంగులు తయారు చేసుకోవచ్చు. ఎట్లనగా

(2) ఎరుపు + నీలం రంగులను జోడిస్తే = నారింజ

(2) ఎరుపు + నీలం రెండు పొరలు జోడిస్తే = ఊదా

(3) ముదురు నీలం + తెలుపు జోడిస్తే = ఆకాశ నీలం రంగులు వస్తాయి. ఆ విధంగా మనకు అవసరమైన రంగులు నిర్మించుకునే వీలుంటుంది.

అవసరమైన రంగుల కాగితాలను తెల్లని పారదర్శక సీసాలకు ముడతలు లేకుండా చుట్టుకోవాలి. సీసాలు లోపల, బయట శుద్ధంగా ఉండాలి. అదే రంగు కాగితం మూతగా వాడుకోవచ్చు. లేదా ఏ రంగులేని మూతలు వాడాలి. రంగు ఎంత గాఢంగా ఉంటే అంత గుణకారి అని అనుకోవద్దు. ఎంతగా సూర్య కిరణాలు ఆ రంగు నుండి సీసాల లోనికి నీటిలోకి పోతున్నాయన్నదే ముఖ్యం. రంగు గాఢంగా ఉంటే సూర్య కిరణాలను ఆపి వేస్తుంది. అట్టి రంగు సీసాలలో 3 భాగాలు శుద్ధమైన నీటితో నింపి ఒక భాగం ఖాళీగా ఉంచాలి. మూతపెట్టి ఎండలో ఒక పీటపై గాని, చెక్కపై గాని పెట్టాలి. వాటికి ఏ రంగూ ఉండకూడదు. వాటికి ఏదైనా రంగువేసి ఉంటే దానిపైన తెల్లని కాగితం గాని, గుడ్డగాని పరచి పెట్టవచ్చు. సహజమైన చెక్క రంగు ఉండవచ్చు. ఉదయం 9 నుండి సాయంత్రం 5 గంటల వరకు ఆ విధంగా ఉంచి ఆ నీటిని మరునాడు ప్రయోగిస్తే మంచిది. తొందరగా అవసరమైన 4 గంటల తరువాత తీసి వాడుకోవచ్చు. ఒకే రంగువి రెండు సీసాలు ఉంటే మంచిది. ఒకటి ఎండలో ఉంటే క్రిందటి రోజుది ఆరోజు వాడుకోవచ్చు.

రెండు, మూడు రంగుల సీసాలను ఎండలో పెట్టేటప్పుడు ఒకదాని రంగు మరొక దానిపై పడకుండా దూర దూరంగా పెట్టాలి. పుటం పెట్టిన టి సీసాలను కూడా యింట్లో వేరువేరుగా పెట్టాలి. వాటిపై మరే రంగు

ప్రసరించకుండా అలమరలో పెట్టటం మంచిది. ఇంట్లో కూడా సీసాలను చెక్కపై పెట్టాలి. లేకున్న వాటి ఔషధ శక్తి తగ్గిపోవచ్చు. ఒక ఔన్సు మోతాదుగా రోజుకు 2 నుండి 4 మార్లు వాడుకోవచ్చు. భోజనంతో కాక ఒక అరగంట ముందుగాని లేక 3 గంటల అనంతరం కడుపు ఖాళీగా ఉన్నప్పుడు తీసుకుంటే మంచిది. బాధలను బట్టి ఒకే రంగు సరిపోదనుకుంటే 2 లేదా 3 రంగుల సీసాలలోని నీటిని కలిపి ఒక మోతాదుగా ప్రయోగించవచ్చు.

**వర్ణ శర్కరలు:** ప్రయాణంలో ఉన్నవారికి, కార్యాలయ, కర్మాగారాలలో పనిచేసే వారికి, ఎక్కువ సమయం బయట తిరిగే వారికి వర్ణోదకాలు ఉపయోగించటం యిబ్బందిగా ఉంటుంది. అట్టివారికి ఈ వర్ణారోపిత శర్కరలు - చక్కెర, పాలు-పంచదార, (Sugar ofMilk), చిన్న చక్కెర మాత్రలు మొదలగునవి అనుకూలంగా ఉంటాయి. ఇంతేగాక ఇవి అన్ని అత్యవసర పరిస్థితులలోను సిద్ధంగా ఉంటాయి. మబ్బులు, వర్షాలు, పొగమంచులు మొదలగు కాలాలలోను అందుబాటులో ఉంటాయి. బాగా ఎండలు కాసే వసంత, గ్రీష్మ ఋతువులలో వీటిని సిద్ధం చేసి పెట్టుకుంటే సంవత్సరం పొడుగునా వాడుకోవచ్చు. మోతాదుగా 10 మాత్రలను గాని, 1 గ్రాము శర్కర గాని తీసుకోవచ్చు.

**నిర్మించు పద్ధతి:** వీటికి 4 ఔన్సులు పట్టు పరిమాణముగల ఆయా రంగుల సీసాలు లేదా ఆయా రంగు కాగితాలు చుట్టబడిన తెల్లని సీసాలు సరిపోతాయి. సీసాలు తప్పడగా కోడిగ్రుడ్డు ఆకారములో గాని, దీర్ఘచతురస్రాకారంలో గాని ఉంటే ఎక్కువ అనుకూలం. పొడువు భాగాన్ని సూర్యాభిముఖంగా పెడితే ఎక్కువగా వర్ణస్వీకారం జరుగుతుంది. అట్టివి లభించకున్న గుండ్రటివే సరిపెట్టుకోవాలి. వాటిలో నాలుగింట మూడు వంతులు చక్కెర గాని, పాల చక్కెరగాని మాత్రలు గాని నింపి వర్ణోదకాల వలెనే చెక్కపై ఎండలో పెట్టాలి. వీటిని సిద్ధం చేయడానికి ఒకరోజు సరిపోదు. 40 నుండి 90 దినాల సూర్యపుటం అవసరమౌతుంది. ప్రతిరోజు సీసాలను బాగా కుదిపి (కలిపి) పెడుతూ ఉండాలి. అప్పుడే అందలి పదార్థానికంతటికి వర్ణప్రసారం జరుగుతుంది. తదుపరి వాటిని వర్ణోదకాల వలెనే అలమరలో దూరదూరంగానే (రంగు కాగితాల తోనే) జాగ్రత్తగా పెట్టుకోవాలి.

అవసరమైన వర్ణౌషధాన్ని చిన్న సీసాలో నింపుకొని దగ్గర పెట్టుకుంటే సమయానికి సేవించవచ్చు. హోమియోపతి ఔషధం వలె చిన్న తెల్లకాగితం ముక్కపై తగినంత మోతాదు వేసుకొని దానిని నాలికపై వేసుకొని చప్పరించాలి. పిల్లలకు సగం మోతాదు చాలు. రోజుకు 2 నుండి 4 మోతాదులు వాడవచ్చు. కొందరికి ఒక మోతాదులోనే అద్భుతమైన ఫలితం కలుగుతుంది. అప్పుడు మిగతా మోతాదులు అవసరం లేదు. మరల బాధలు కలిగినప్పుడే రెండవ మోతాదు వాడాలి. ఒకవేళ తాత్కాలిక ఉపశమనమే జరిగి మరల మరల బాధలు వస్తూ ఉంటే కొద్ది రోజులు వరుసగా వాడవచ్చు. సూర్యకిరణ చికిత్సా పద్ధతులన్నిటిలో యిదే సూత్రం వర్తిస్తుంది.

**వర్ణ తైలాలు:** వర్ణ శర్కరలు మాదిరిగానే ఈ తైలాలను 2, 3 నెలలు ఎండలో పెట్టి నిర్మించుకోవాలి. ఇవి శరీరంపై బాధగా ఉన్న భాగాలకు మర్దన చేయడానికి ఉపయోగపడతాయి. పూత మందుల (Ointments) వలె వాడుకోవాలి. కొబ్బరి నూనె, నువ్వుల నూనె, ఆవు లేదా గేదె నెయ్యిలు సూర్యకిరణపుటం పెట్టడానికి అనుకూలంగా ఉంటాయి.

**ఏహ్యశ్మానమా తిష్ఠాశ్మా భవతు తే తనూః।**
**కృణ్వన్తు విశ్వే దేవా ఆయుష్టే శరదః శతమ్॥ (అథర్వ. 2-13-4)**

ఓ బ్రహ్మచారి లేక ఓ బ్రహ్మచారిణీ ! (విద్యార్థినీ లేక విద్యార్థీ)నీవు ఈ శిలపై ఎక్కుము. ఈ శిలవలె (ఱాయివలె) నీ శరీరము దృఢముగాక ! సమస్త దేవగణము (ప్రాకృతిక శక్తులు) నీకు శత శరత్తుల (నూరు సంవత్సరముల) ఆయువు నిచ్చును గాక !

(విద్యార్థినీ విద్యార్థులు ప్రాచీన బ్రహ్మచర్యాశ్రమ నియమములను పాటించుచు శరీరమును బలపరచుకోవలెను. చెప్పులు, గొడుగు ధరించరాదు. మెత్తటి పరుపులపై పరుండ రాదు. వాహనముల నెక్కరాదు. సంగీత నృత్యాది వినోదముల చూడరాదు. వీర్యనష్టము చేసుకొనక శరీరమును బలపరచుకోవలెను).

# అవసరమైన రంగును ఎన్నుకోవడం ఎలా?

సామాన్యంగా రోగి బాధలను బట్టి అవసరమైన రంగును ఎన్నుకోవలసి ఉంటుంది. ఉదాహరణకు వ్యాధి మంటలతో, వేడితో, తాపముతో, రక్తస్రావాలతో ఉద్రిక్తతలతో కూడి ఉంటే నీలం రంగులు అవసరమౌతాయి. వాటి తీవ్రతను బట్టి ఆకాశ నీలం, గాఢ నీలం, ఊదా రంగులలో ఏదో ఒకటి అవసరమౌతుంది. ఇందుకు భిన్నంగా చలి, వణుకు, శరీరం చల్లబడి పోవటం, విడవని జలుబులు, కఫం, కొద్ది చలిగాలిని కూడా భరించలేక పోవటం మొదలైనవి ఉంటే వేడిని పుట్టించే ఎరుపు, నారింజ రంగులు అవసరమౌతాయి. కీళ్ళ వాతం, గర్భవాతం, వివిధ నొప్పులు, మల బద్ధకం మొదలగు వాటికి పసుపు, ఆకుపచ్చ రంగులు అవసరం. చర్మ వ్యాధులలో ఆకుపచ్చ, నీలం ఉపయోగపడతాయి.

ఆయుర్వేద దృష్టితో వీటిని ఈ క్రింది విధంగా వర్గీకరించవచ్చు

(1) వాతం ప్రకోపిస్తే - పసుపు, ఆకుపచ్చ

(2) పిత్తం ప్రకోపించి ఉంటే - నీలం రంగులు (ఆకాశ నీలం, ముదురు నీలం, ఊదా)

(3) శ్లేష్మం వృద్ధిచెందితే - ఎరుపు, నారింజ రంగులు ప్రయోగించవలసి ఉంటుంది. కొందరిలో రెండు లేదా మూడు దోషాలు ప్రకోపించి ఉండవచ్చు. అటువంటి వారికి రెండు లేదా మూడు రంగుల సీసాలలోని నీరు కలిపి యివ్వవలసి ఉంటుంది. ఉదాహరణకు - వాత జ్వరంలో పసుపు మూడు భాగాలు + ముదురు నీలం ఒక భాగం, పిత్త జ్వరం అయితే ఆకాశ నీలం 3 భాగాలు + ముదురు నీలం 1 భాగం, కఫ జ్వరానికి పసుపు 3 భాగాలు + నీలం ఒక భాగం కలిపి యివ్వాలి. చాలాకాలం నుండి ఉన్న జీర్ణ జ్వరం అయితే ముదురు నీలం + పసుపు రంగుల నీటిని సమానంగా కలిపి ప్రయోగించాలి. అజీర్ణ జ్వరానికి పసుపు 2 భాగాలు + ఆకాశ నీలం 1 భాగం, జలుబుతో కూడిన జ్వరానికి నీలం 2 భాగాలు + ఆకుపచ్చ 2 భాగాలు, మలేరియాకు నీలం 3 భాగాలు + పసుపు 1 భాగం, టైఫాయిడ్‌కు ముదురు నీలం 3 భాగాలు + పసుపు 1 భాగం కలిపి యివ్వాలి. పైవన్నీ సామాన్య పరిస్థితులలో ఉపయోగపడుతాయి. రోగులలోని బాధలను బట్టి పైవాటిలో మార్పులు, చేర్పులు చేసుకోవలసి ఉంటుంది.

దీర్ఘవ్యాధులలో శారీరక లక్షణాలతో బాటు మనస్సులో వచ్చిన మార్పులను గుర్తించవలసి ఉంటుంది. ఇందులో వ్యాధి రాకపూర్వం ఉండే మనస్తత్వం, వ్యాధి వచ్చిన తరువాత కలిగిన మార్పు, అన్నిటికి మించి వ్యాధికి మానసిక కారణాలేమైనా ఉన్నాయా? అనే విషయాలు తెలిసికోవలసి ఉంటుంది. తదుపరి శారీరక, మానసిక లక్షణాలను సరి చేయగల రంగును ఎంచుకొని కొన్ని వారాలు, నెలలు ప్రయోగించవలసి ఉంటుంది. 'సప్త వర్ణాల విశిష్టగుణాలు' అనే ప్రకరణాన్ని బాగా అధ్యయనం చేస్తే తగినమందు ఏదో మీకు తెలుస్తుంది.

దీర్ఘవ్యాధులకు చికిత్స చేసే ముందు వ్యాధులు కలగడానికి కారణాలేవి? అనే విషయాలు తెలిసికొని ఉండటం చాలా అవసరం. గ్రంథ విస్తరణ భీతిచే ఈ విషయాన్ని యిక్కడ వ్రాయుట లేదు. నాచే రచింపబడిన 'వేదాలలో జల చికిత్సా విజ్ఞానము' అనే గ్రంథాన్ని చదువగోరెదను. ముఖ్యంగా వ్యాధులకు ప్రజ్ఞాపరాధం అంటే జీవుడు తన స్వస్వరూపాన్ని మరచి, అవిద్యతో, అజ్ఞానంతో దేహాత్మ భ్రాంతిని చెంది యింద్రియాలకు, కోరికలకు దాసుడై ఆరోగ్య నియమాలను అతిక్రమించటం, దానితో సమస్థితిలో ఉండవలసిన వాత పిత్త శ్లేష్మములనే త్రిదోషాలు, జఠరాగ్ని ధాతు నిర్మాణాగ్నులు (Digestion and Metabolism) క్షీణిస్తాయి. బహిర్గతం కావలసిన మాలిన్యాలు శరీరంలో పేరుకుంటాయి. దానితో క్రిములు, వ్యాధులు, బాధలు బాధిస్తాయి. వీటిని తొలగించటానికే వివిధ చికిత్సా పద్ధతులు రూపొందించబడ్డాయి. అందు సూర్యకిరణ చికిత్స ఒకటి.

సూర్య కిరణ చికిత్స పైరోగ కారణాలతో బాటు శరీరంలో ఉండవలసిన సప్తవర్ణాల పాళ్ళలో వ్యత్యాసాలు ఏర్పడటం కూడా ఒక కారణ ముంటుంది. లక్షణాల ద్వారా, బాధల ద్వారా వాటిని గుర్తించి సరిచేయ ప్రయత్నిస్తుంది. శరీరంలోని వర్ణ వ్యత్యాసాలను గుర్తించటానికి ఈ మధ్య క్లిరనార్ స్క్రీన్ అనే క్రొత్త పరికరాన్ని రూపొందించారు. మూడు వైపుల రెండు మడతలు గల గాజుగోడలతో నిర్మించబడిన ఈ పరికరం ఒక మనిషి లోపల పీటపై కూర్చొనగల వైశాల్యం కలిగి ఉంటుంది. రెండు మడతల గాజుగోడల మధ్య భాగములో డయోసీన్ లేదా ఇండిగో వైలెట్ లిక్విడ్ పోసి ఉంటుంది. అంటే గాఢ నీల ఊదారంగులుగల పారదర్శకమైన నీరు పోసి ఉంటుంది. అందులో మనిషిని పీటపై కూర్చుండబెట్టి నాల్గవ వైపు (బ్లీచింగ్ చెయ్యని మస్లిన్ క్లాత్ స్క్రీన్) తెలుపు చెయ్యని మృదువైన తెర వేస్తారు. తదుపరి ఆ వ్యక్తిపై నల్లని

వస్త్రాన్ని కప్పి గదిని చీకటి చేసి అతనిని తదేకంగా చాలాసేపు చూస్తారు. ఆ విధంగా చూస్తే ఆ వ్యక్తిలో ఏడు రంగుల వలయం మెరుస్తూ కనబడుతుందట. చాలా సాధన చేసి ఏకాగ్రతను పొందినవారికే ఆ ఏడు రంగుల వలయం కనబడుతుందట. ఆ వలయంలో ఏదైనా రంగు లోపించిందేమో పరీక్షించి ఆ లోపించిన రంగుతో అతనికి చికిత్స చేసి ఆరోగ్యవంతుని చేస్తారట. దీనిని వారు 'హెల్త్ ఆరా' - ఆరోగ్య కాంతి సూచిక అంటున్నారు. ఆ పరికరాన్ని గాని, పరీక్షను గాని నేనెప్పుడు చూడలేదు. కాబట్టి దానిని గురించి నేనేమీ చెప్పలేను.

అయితే వారు ఇచ్చే వివరణ ఆలోచింప తగినది. అది ఈ విధంగా ఉంది. ''మన శరీరంలో ఏడు అంతః శరీరాలున్నాయి. కనిపించే ఈ స్పర్శా (సెన్సేషనల్) దేహాన్ని (1) ఇథరిక్ బాడీ అంటారు. దాని లోపలిది (2) ఆస్ట్రల్ బాడీ లేదా కోర్కెల దేహం. ఇంకా లోపలిది (3) లోయర్ మెంటల్ బాడీ లేదా కాంక్రీట్ మైండ్. దాని లోపల వరుసగా (4) హయ్యర్ మెంటల్ బాడీ (5) స్పిరిచ్యువల్ (ఆత్మకు సంబంధించిన) (6) ఇన్ట్యూషనల్ (అంతర్ జ్ఞాన సంబంధమైన), (7) క్యాజువల్ (హేతు) శరీరాలు ఉంటాయి. ఈ ఏడు దేహాలు ఏడు రంగులను కలిగి ఉంటాయి. వ్యాధి ముందు ఈ అంతః శరీరాలలో ప్రవేశించి తదుపరి భౌతిక శరీరానికి ప్రాకుతుంది. ఏ అంతః శరీరంలో వ్యాధి ప్రవేశిస్తే ఆ రంగు లోపించినట్లు కనబడుతుంది. ఆ లోపించిన రంగుతో వ్యక్తికి చికిత్స చేస్తే ఆరోగ్యవంతుడౌతాడు. ఈ వివరణ ఎలా ఉన్నా కేవలం బాహ్య శరీరమే కాక అంతః శరీరాలున్నాయని వీరు అంగీకరిస్తున్నారు. వ్యాధి బాహ్య శరీరంలోనే కాక అంతః శరీరాలలోను చోటు చేసుకుంటుందని నమ్ముతున్నారు.

ఆధునిక మనో వైజ్ఞానికులు సప్త శరీరాలుగా విభజిస్తే మన ఋషులు స్థూల సూక్ష్మ కారణ శరీరాలని మూడుగా విభజించారు. ఈ మూడు జీవాత్మకు సాధనాలుగా - రథాలుగా ఉంటాయి. ముందుగా జీవుడు సూక్ష్మ శరీరంతో ప్రజ్ఞాపరాధం చేస్తాడు. దానితో వ్యాధి సూక్ష్మ శరీరంలో ప్రవేశిస్తుంది. తదుపరి అది స్థూల శరీరానికి ప్రాకుతుంది. వివరంగా తెలిసికొన గోరువారు చరక, శుశ్రుత సంహితలు చదువండి. లేదా మా 'వేదాలలో జల చికిత్స విజ్ఞానము' చదువండి.

ఏది ఏమైనా వ్యాధులు కలగడానికి కేవలం రంగులోపాలు, రంగు వ్యత్యాసాలే కాదు. మరెన్నో కారణాలుంటాయి. వాటిని గుర్తించి రోగి నుండి వాటిని తొలగిస్తూ చికిత్స చేయవలసి ఉంటుంది. ఏ కారణంవల్ల వ్యాధి కలిగినా స్థూల శరీరంలో కొన్ని మార్పులు జరుగుతాయి. కొన్ని అవయవాలు దెబ్బతింటాయి. శరీరం తన ధర్మాన్ని నిర్వహించ లేకపోతుంది. దానితో మాలిన్యాలు క్రిములు చేరుతాయి. సప్త ధాతువుల సమస్థితి తప్పినట్లే సప్తవర్ణాల సమస్థితి తప్పుతుంది. బాధలను బట్టి, వ్యాధిగ్రస్తమైన అవయవాలను బట్టి ఏ రంగు లోపించిందో, ఏ రంగు ఎక్కువయ్యిందో గుర్తించవచ్చు. సూర్య కిరణ చికిత్సతో వాటిని సరి చేయవచ్చు.

భారతీయులారా ! ఉత్తిష్ఠత ! జాగ్రత !

"ఎప్పుడు భారతీయులు మరొకమారు తమ ప్రతి గృహమునందు వేదములు మరియు ఉపనిషత్తుల ఉపదేశములు వినుచుందురో, ఎప్పుడు భారతీయులు మరొకసారి తమ ప్రతి గృహము నందును వేదోపదేశముల సరిగా నర్థము చేసుకొని సర్వేశ్వరుడైన ఏకేశ్వరుని ఉపాసింతురో అప్పుడే భారతజాతి తన శతాబ్ధముల దీర్ఘనిద్ర నుండి మేల్కొంచి మరొకసారి ప్రపంచ దేశాలలో తల ఎత్తుకుని నిలువగలదు".

అనిబిసెంట్

# కొన్ని ప్రాథమిక చికిత్సలు

చికిత్సా ప్రకరణం చాలా విశాలమైనది. దానినంతా ఈ పుస్తకంలో వ్రాయటానికి వీలు పడదు. ముఖ్యంగా ఈ పుస్తకం వేదాల మహాత్మ్యాన్ని తెలపటానికి వ్రాయబడింది. వేదాలలో విజ్ఞానం ఏ విధంగా బీజ రూపంలో ఉంటుందో, దానిని ఏ విధంగా విస్తృతపరచి ఉపయోగంలోనికి తీసుకు రావాలో వ్రాయుట జరుగుతున్నది. సూర్యకిరణ చికిత్సా గ్రంథాలు తెలుగు, హిందీ, ఆంగ్ల భాషలలో అన్ని ప్రకృతి చికిత్సాలయాలలో దొరుకుతాయి. వివరంగా తెలిసికొనగోరు వారు వాటిని చదువగోర్తాను. అయినప్పటికి కొన్ని ప్రాథమిక చికిత్సలు వ్రాయుట మంచిదని మిత్రులు సూచించుటచే వ్రాయుట జరుగుతున్నది.

సూర్య కిరణ చికిత్స జల చికిత్స కన్నను సూక్ష్మమైన చికిత్స. హోమియో చికిత్స కన్నను సూక్ష్మతరమైన చికిత్స. దీనిని ఆంగ్లంలో ఫైన్ ఫోర్స్ థెరపీ (Fine Force Therapy) అంటారు. ప్రాకృతిక చికిత్సకులు కొందరు దీనికి సునిశిత చికిత్స అని పేరు పెట్టారు. సృష్టిలోని కొన్ని ప్రాకృతిక శక్తులు ఔషధాలుగా పని చేస్తాయి. అందులో సూర్య కిరణ చికిత్స - (వర్ణ కిరణ చికిత్స) ఒకటి. కొందరి దేహ తత్త్వాలు, మరికొందరి శరీరతత్త్వాలు స్థూల సూక్ష్మ ఔషధాలకన్న సూక్ష్మతర ప్రాకృతిక శక్తులకు ఎక్కువగా స్పందిస్తాయి. స్థూల ఔషధాల కన్న సూక్ష్మ ఔషధాలకు ఎక్కువగా స్పందిస్తాయి. ఎవరి శరీరం ఏ చికిత్సకు చక్కగా స్పందిస్తుందో ముందే చెప్పలేము. ప్రయోగించి చూడవలసి ఉంటుంది. ఎన్నో చికిత్సలు చేసి విసిగి వేసారిన కొందరిలో సూర్య కిరణ చికిత్స అద్భుతమైన ఫలితాల నిచ్చింది. అయస్కాంత చికిత్స (Magnatotherapy) ఆక్యుప్రెషర్, ఆక్యుపంక్చర్, ప్రాణ చికిత్స, హిప్నటో థెరపీ మొదలైనవి యిట్టి సూక్ష్మతర చికిత్సలే. అవి కొందరిలో అద్భుతమైన ఫలితాల నివ్వగా కొందరిలో నిరాశను కలిగిస్తాయి. కనుక ముందే ఒక నిర్ణయానికి రాక ప్రయత్నించి చూడండి.

ఇచ్చట నిత్య జీవనంలో వచ్చే కొన్ని సామాన్య వ్యాధులకు, బాధలకు అవసరమైన రంగులు సూచింపబడుతున్నాయి. వాటిని వర్ణోదకాలుగా కాని, వర్ణ శర్కరలుగా కాని లోనికి సేవించాలి. కొన్ని చోట్ల వర్ణతైలాలు సూచింపబడితే వాటిని ఆయా భాగాలపై మర్దన చెయ్యాలి.

**(1) తలనొప్పులు:** సామాన్యంగా తల నొప్పులు ఏదైనా వ్యాధి కారణంగా వస్తాయి. కనుక కారణాన్ని తొలగించే ప్రయత్నం చేస్తూ ఈ చికిత్సలు చేయవలసి ఉంటుంది.

(అ) సామాన్య తలనొప్పి - ఆకాశ నీలం నీరు లోపలికి యిస్తూ పైకి ఆకాశ నీలం తైలం మర్దన చేయాలి. బాధ తీవ్రంగా ఉంటే గాఢ నీలం వాడవలసి ఉంటుంది. నీలం కాంతిని తలపై ప్రసరింప జేయవచ్చు. అన్ని రకాల తలనొప్పులలో జల చికిత్సలలోని వేడినీటి పాదస్నానం చాలా ఉపశమనాన్ని కలిగిస్తుంది. ఉపవాసం లేదా ఆహారం తక్కువగా తీసుకోవటం వల్ల చాలా మేలు కలుగుతుంది.

(ఆ) అజీర్ణంతో కూడిన తలనొప్పికి నారింజ, విరేచనాలతో కూడి యున్న - నీలం వాడాలి.

(ఇ) తలలో చీము చేరుటవల్ల (Sinusitis) అయినచో నీలం+ఆకుపచ్చ కలిపి వాడాలి. దీనికి రెండు చిట్కాలు - (1) శనగలు బాగా వేయించి వెంటనే పల్చని గుడ్డలో మూటకట్టి వాసన చూచుట. (2) నిప్పులపై ఎండిన మామిడి ఆకులు వేసి వాసన చూచుట.

(ఈ) నరాల సంబంధమైన తలనొప్పి (Migrane)కి నీలం+నారింజ కలిపి లోపలికి యివ్వాలి. పైకి నీలం కాంతి, నీలం తైలం.

**(2) తలలో చుండ్రు (Dandruf):** నీలం, ఆకుపచ్చ.

**(3) తలలో పేలు (Lice), జుట్టు రాలుట:** నీలం.

**(4) బట్టతల:** నీలం, నీలం తైలం, నీలం కాంతి.

జుట్టు తెల్లబడుట - గాఢ నీలం తైలం మర్దన చేయుట. పండ్లు, కూరగాయలు, ఆకుకూరలు ఎక్కువగా సేవించుట.

**(5) కండ్ల మంటలు, ఎరుపులు, పుసులు** మొదలగు కంటి బాధ లన్నిటికి - నీలం సీసా, నీరు లోపలికి, పైకి కంటి చుక్కలుగాను, కండ్లు కడుగుటకు దృక్ శక్తి పెరగటానికి - ఆకుపచ్చ.

**(6) కంటి శుక్లాలు (మోతియా బిందు Cataract) :** ఊదా తైలం రెండేసి చుక్కలు రోజుకు రెండు మార్లు చాలా కాలం వాడాలి. శుద్ధమైన కొబ్బరి నూనె లేదా ఆముదము మంచిది. ఊదా లేదా నీలం విద్యుత్ కాంతిని ప్రసరింప జేయవచ్చు.

**కర్ణ (చెవి) వ్యాధులు:** చెవిపోటుకు ఆకాశ నీలం నీటితో లోనికి పిచకారి చెయ్యాలి. పైకి నీలం కాంతిని ప్రసరింపజేయవచ్చు. చీము కారుట కూడా దీనివల్ల తగ్గుతుంది. చెవులలో శబ్దాలు (హోరు మొదలగునవి) ఉంటే పసుపు + ఆకుపచ్చ నీటిని రోజుకు 2, 3 పర్యాయాలు లోపలికి సేవించాలి. ఇదే నీటిని వేడిచేసి చెవి కడగవచ్చును. చలిగాలి తగులుట వల్ల వచ్చిన చెవి నొప్పికి నీలం నీటిని వేడిచేసి దానిలో గుడ్డను ముంచుతూ పైకి సౌమ్యంగా కాపడం పెట్టాలి. పసుపు వర్ణారోహిత తైలం వేడిచేసి చెవిలో వెయ్యాలి. దీర్ఘకాలం నుండి ఉన్న చెవిలో చీముకు నీలోదకంతో శుభ్రం చేస్తూ, నీలం లేదా ఆకుపచ్చ తైలం చెవిలో వెయ్యాలి. ఆ రంగు వర్ణోదకాలు లోపలికి సేవిస్తే మరింత గుణకరముగా ఉంటుంది.

**చెముడు:** జన్మతో వచ్చిన చెముడు కుదరటం కష్టమే. మధ్యలో ఏ కారణం చేతనైనా వస్తే ఈ చికిత్సతో నయమౌతుంది. నీలోదకాన్ని లోనికి సేవిస్తూ, పైకి పసుపు కాంతిని ప్రసరింప చేయాలి. చెవి వెనుక సౌమ్యంగా కాపడం పెట్టి తదుపరి చల్లటి గుడ్డ వెయ్యాలి. ఈ విధంగా కొన్ని వారాలు చెయ్యవలసి ఉంటుంది. జల చికిత్సలలో వేడినీటి పాదస్నానం ఉపయోగకరంగా ఉంటుంది.

**నాసికా వ్యాధులు:** నాసికా సంబంధమైన దీర్ఘకాలిక జలుబు, చీమిడి, చీము చేరుట (Sinusitis) మధ్య ఎముక వంకరగుట, వివిధ కంతులు (Polypus Adenoids etc., ) తుమ్ములు మొదలగు వాటన్నిటికి ఈ క్రింది ప్రయోగం చేస్తే సరిపోతుంది.

పసుపు రెండు భాగాలు, గాఢ నీలం ఒక భాగం, ఆకుపచ్చ ఒక భాగం కలిపిన నీటిని దినానికి రెండు లేదా మూడు మార్లు సేవించాలి. పసుపు లేదా ఆకుపచ్చ రంగు నీటిని ముక్కుతో లోనికి పీల్చాలి. లేదా ఆ నీటిలో గుడ్డను తడిపి కొద్దిసేపు ముక్కుపై పట్టీగా వేసుకోవాలి. లేదా ఆకుపచ్చ కాంతిని ముక్కుపై ప్రసరింప చేయాలి. ముక్కు నుండి రక్తం కారటంకు నీలోదకం ముక్కుతో లోనికి త్రాగటం లేదా పీల్చటం చెయ్యాలి. తీవ్రమైన తాత్కాలిక జలుబుకు ఆకుపచ్చ నీటిని సేవిస్తూ అదే కాంతిని ముఖానికి తలకు ప్రసరింపచేయాలి. శరీరానికి నీటియావిరి పట్టటం సహాయకారిగా ఉంటుంది. కేవలం వేడి నీటిని మాత్రమే సేవిస్తూ రెండు రోజులు ఉపవాసం చేస్తే ఏ చికిత్సా అక్కర లేకుండా తొందరగా జలుబు తగ్గుతుంది.

## నోటికి సంబంధించిన వ్యాధులు

నోటి పూతకు (Apltoe) కు గాఢనీలం నీటిని గోరు వెచ్చగా చేసి దినానికి 4, 5 మార్లు పుక్కిలించాలి. గాఢనీలం+ ఆకుపచ్చ నీటిని సమభాగాలుగా కలిపి లోనికి సేవించాలి. ఈ నీరు చిగురువాపుకు కూడా ఉపయోగపడుతుంది. ఈ నీటిలో గుడ్డను తడిపి వాచిన చిగురుపై పట్టీ మాదిరిగా ఉంచి పై నుండి వేడికాపడం పెడితే మంచి ఫలితం ఉంటుంది. చిగురు వాపు వల్ల వచ్చిన పంటి నొప్పికిని యిదే చికిత్స సరిపోతుంది. దీర్ఘకాలికమైన చిగురు చీము, రక్తస్రావాలు ఉంటే పై ప్రక్రియతో బాటు ఒక వారం భోజనం మాని ఫలాహారం చెయ్యాలి.

చిగురువాపు లేకుండా కేవలం పంటిపోటు ఉంటే నారింజరంగునీటితో పుక్కిలించి అదే నీటిని లోనికి సేవించాలి. పళ్లు కదిలి రక్తం కారటం, వాపు ఉంటే పసుపు, ఆకాశ నీలం, ఆకుపచ్చ రంగుల నీటిని సమభాగాలుగా కలిపి కొద్ది వేడిచేసి దినానికి 3, 4 మార్లు సేవించాలి. గాఢనీలం, ఆకుపచ్చ నీటిని పుక్కిలించాలి. ఒక వారం ఫలాహారం చేయటం మంచిది.

**గొంతు సంబంధమైన వ్యాధులు:** గొంతువాపు, టాన్సిల్స్ వాపుకు నీలం నీరు దినానికి 4 మార్లు లోనికి సేవించాలి. పైకి వేడికాపడము పెట్టి తదుపరి చల్లటి గుడ్డ వేయాలి. మట్టిపట్టీ వేస్తే మరింత గుణకారిగా ఉంటుంది. ఒకవారం నీలం నీటితో ఎనిమా చేసుకోవటం మంచిది. దుష్టవేడి, మలాలు విసర్జింప బడతాయి. గొంతు బొంగురుకును పై చికిత్స సరిపోతుంది. నీలం నీరు తరచు సేవిస్తూ ఉంటే గొంతు గరగర తగ్గి స్వరం మధురం అవుతుంది.

**శ్వాసావయవ వ్యాధులు:** సామాన్య పొడి దగ్గుకు గాఢ నీలం, జలుబు దగ్గుకు నారింజ రంగుల నీరు లోనికి సేవిస్తూ ఆ నీటితోనే పుక్కిలించవలెను. కోరింత దగ్గుకు గాఢనీలం నీరు సేవిస్తూ ఆ నీటితో తడిపినగుడ్డతో గొంతుపై పట్టీ వేయాలి. బ్రోంకైటిస్ (వాపుతో కూడిన) దగ్గుకు పసుపునీరు సేవించాలి. ఉబ్బస దగ్గుకు నారింజరంగు సరిపోతుంది. ఒకవేళ వేడితో వస్తే ఆకాశ నీలం ఒక భాగం, నారింజ మూడు భాగాలు కలిపి సేవించాలి. క్షయవ్యాధికి ఆకాశనీలం నీటిని చాలా కాలం (ఆరు నుండి పన్నెండు నెలలు) సేవించవలసి ఉంటుంది. రోగి ఛాతిపై ఆకాశ నీలకాంతిని ప్రసరింప చేయాలి. కోరింత దగ్గుకు గాఢనీలం పని చేస్తుంది.

**గుండె వ్యాధులు:** బలహీనతవల్ల వచ్చే సామాన్య గుండె దడకు పసుపు నీరు సరిపోతుంది. మిగిలినగుండె వ్యాధులన్నిటికి (కవాటాలలో లోపాలు, గుండె పెరుగుట, నొప్పి, గుండెకు రక్తప్రసార లోపాలు మొదలగు వాటికి) నిత్యం ఉదయ సాయంకాలాలలో నీలం నీరు సేవిస్తూ వీలయినప్పుడు నీలం కాంతిని ఛాతికి ప్రసరింప చేసుకోవాలి.

**జీర్ణావయవ వ్యాధులు:** మందాగ్ని(ఆకలి లేమి)కి పసుపు నీరు మూడు భాగాలు + నీలం నీరు ఒక భాగం కలిపి సేవించాలి. అజీర్ణానికి నారింజ, కడుపుబ్బరానికి పసుపు, పుల్లని త్రేన్పులకు ఆకాశ నీలం, సామాన్య త్రేన్పులకు నారింజ రంగుల నీరు సేవించాలి. చాల కాలం నుండి ఉన్న ఆమ్ల పిత్తానికి (Acidity) ఆకాశ నీలం నీరు, వాంతులు అవుతుంటే ఆ నీటిలో పసుపు నీరు ఒక భాగం చేర్చి వాడాలి. వ్రణాలు (Ulcers) ఏర్పడితే ఆకాశ నీలోదకం కొంతకాలం వాడి తదుపరి హరితోదకం వాడాలి. చాలాకాలం నుండి ఉన్న కడుపునొప్పికి నారింజోదకం పని చేస్తుంది. కడుపులో కంతులు (కేన్సర్ మొ॥నవి) ఉంటే కూడా ఈ నీరు ఉపయోగపడుతుంది. వీటికి తోడు నీరు అరుచి, వికారం, బద్ధకం ఉంటే నారింజోదకంతో బాటు ఆకాశ నీల పీతోదకాలను చేర్చి వాడాలి. కడుపులో మంటకు మూడు భాగాలు ఆకాశ నీలం + ఒక భాగం గాఢనీలం కలిపి వాడాలి. బొడ్డువద్ద చిన్న ప్రేవులలో మెలిపెట్టే నొప్పికి ఆకాశ నీలం రెండు భాగాలు, గాఢనీలం పసుపు రంగులు ఒక్కొక్క భాగం కలిపి వాడాలి. దీనికి పైన ఆకుపచ్చ నీటి పట్టి వేస్తే మరింత గుణకారి. ప్రేగులలో గాలి బంధించి బయటకు రాకుంటే నాభిపై ఆకుపచ్చ తైలంతో వెన్నెముకపై ఆకాశ నీల తైలంతో మర్దన చేస్తే వెంటనే ఉపశమనం కలుగుతుంది.

సామాన్య మలబద్ధకానికి పీతోదకం సరిపోతుంది. దీర్ఘకాలిక మలబద్ధకానికి నారింజ లేదా పసుపు నీరు సేవిస్తూ పొత్తి కడుపుకు నీలం తైలంతో మర్దన చేయాలి. తదుపరి తడిమట్టి వేస్తే మరింత గుణకారిగా ఉంటుంది. చిన్న ప్రేగులలోని మాలిన్యాలను తొలగించడానికి నాభికి పసుపు తైలం మర్దన చేసి వేడి కాపడం పెట్టి తదుపరి తడిగుడ్డ వేయాలి. ప్రేగులలోని క్రిములకు పీతోదకం మూడు భాగాలు, హరితోదకం ఒక భాగం కలిపి త్రాగాలి. నిమ్మ ఆకులు వయస్సును బట్టి రెండు నుండి పది వరకు తింటే మందు మాదిరిగా పని చేస్తుంది. సామాన్య నీళ్ళ విరేచనాలకు ఆకాశ నీలం,

రక్తబంక విరేచనాలకు గాఢనీలం రంగుల నీరు సరిపోతుంది. కలరా వంటి తీవ్ర వ్యాధులకు వైద్యుల పర్యవేక్షణలో చికిత్స చెయ్యాలి. అజీర్ణంతో కూడిన అతిసార వ్యాధికి ఆకాశనీలం నీరు చాలాకాలం సేవించాలి.

ఆసనం (Anus) పుండు పడుట (ఎరుపు) దురుదలకు హరితోదకము లోనికి సేవిస్తూ పైన హరిత తైలం రాయాలి. మూల శంకలు (Piles) పగుళ్ళు (Fissures) కు నీలోదకం పని చేస్తుంది. వీటితో మలబద్ధకము కలిసి ఉంటే పీతోదకం సగభాగం కలిపి వాడాలి. రంధ్రం ఏర్పడి చీము కారుతూ ఉంటే (Fistulae కు), హరితోదక, నీలోదకాలు కలిపి వాడాలి. విరేచనాల వల్ల కాని ఇతర కారణాల వల్ల గాని ఆసనం జారితే (Prolapses) రెండు భాగాలు ఆకాశనీలం, ఒక భాగం గాఢనీలం, ఒక భాగం పీతోదకం కలిపి లోపలికి సేవించాలి. పైన పసుపుమట్టి (పీలీ మిట్టీ) పట్టీగా వేస్తే చాలా మేలు చేస్తుంది. మలబద్ధకం ఉంటే నీలోదక వస్తి ఎనిమా చెయ్యాలి.

కాలేయ వ్యాధులైన కామెర్లు, కాలేయము గట్టి పడుట, పెద్దదగుట మొదలగు వాటికి ఊదా రంగు అద్భుతంగా పని చేస్తుంది. ఆ నీటిని లోపలికి సేవిస్తూ కాలేయంపై ఊదా కాంతిని ప్రసరింప చేయాలి. (కామెర్ల వ్యాధి బాగా ముదిరి శరీరమంతా పచ్చబడితే పసుపు+ నీలం రంగునీరు లోపలికి సేవించవలసి ఉంటుంది). సూర్యోదయ సమయంలో ప్రసరించే సూర్య కిరణాలు సహజ సిద్ధమైన ఊదా కిరణాలు. వాటిని శరీర మంతటికి ప్రసరింప చేసుకోవడం ఉత్తమమైన పద్ధతి. వాటివల్ల పాండువ్యాధి కూడా నయమవుతుంది. పెద్ద ప్రేగుల వాపు (Colitis) కు ఆకాశనీలోదకం సేవిస్తూ అదే కాంతి కడుపుపై ప్రసరింప చేయాలి. జీర్ణావయవ వ్యాధులన్నిటిలో కొద్దో గొప్పో అజీర్ణం మలబద్ధకం ఉంటుంది. కాన అవసరమును బట్టి ఒకటి రెండు దినాలు ఉపవాసం ఉండి క్రమంగా ఆహార పరిమాణం పెంచుకుంటూ సామాన్య పరిమాణానికి రావాలి. హితమైన సాత్త్వికాహారాన్ని మితంగా భుజిస్తూ మరల వ్యాధులు రాకుండా చూచుకోవాలి.

**మూత్రావయవ వ్యాధులు:** మూత్ర పిండాల వాపు (Nephritis) నారింజరంగు నీరు లోపలికి యిస్తూ పైకి (వెనుక వీపుకు) అదే కాంతిని ప్రసరింప చేయాలి. మూత్ర విసర్జన మంట, పోటుతో తక్కువగా అగుచున్నచో ఆకాశ నీలోదకం చాలా మేలు చేస్తుంది. మూత్రనాళాలలో రాళ్ళు ఉంటే పీతోదకం యివ్వాలి. అప్రయత్నంగా మూత్రం అవుతూ ఉంటే

హరితోదకం లోపలికి సేవిస్తూ మూత్రకోశంపై (పొత్తి కడుపుపై) హరిత కాంతిని ప్రసరింపచేయాలి. అతి మూత్రానికి పీతోదకం ఒక భాగం, గాఢ నీలోదకం ఒక భాగం హరితోదకం రెండు భాగాలు కలిపి తీసుకోవాలి. మధు మూత్రానికి (Diabetis Mellitus) రెండు భాగాలు పీతోదకం, ఒక భాగం నీలోదకం, ఒక భాగం హరితోదకం కలిపి సేవించాలి.

**స్త్రీ జననేంద్రియ వ్యాధులు:** ఋతు శూలాలకు హరితోదకం సేవించాలి. పదిరోజులు ముందు నుండి వాడుతూ ఉంటే ఋతుశూాల రాకుండా ఉంటుంది. ఋతు స్రావం కనబడక పోతే (Amenorrphea) పసుపు లేదా నారింజ నీరు లోనికి యిస్తూ గర్భకోశముపై అరుణ కాంతి ప్రసరింప చేయాలి. ఋతు స్రావం తక్కువగా అయ్యేవారు పీతోదకం వరసగా రెండు లేదా మూడు నెలలు సేవించాలి. ఋతుస్రావం ఎక్కువగా అయ్యేవారు ఆకాశ నీలోదకం మూడు భాగాలు + పీతోదకం ఒక భాగం కలిపి ప్రతి మూడు గంటలకొకమారు సేవించాలి. హరితోదకంతో డూష్ (ఎనిమా మాదిరిగా) చేస్తే తొందరగా గుణం కనబడుతుంది. వీలుకాకుంటే హరితోదకంతో తడిపిన శుభ్రమైన గుడ్డను లోనికి చొప్పించుకోవచ్చును. శ్వేతప్రదర (తెలుపు స్రావం - Leucorrhoea) కు హరిత, గాఢనీల ఉదకాలను సమభాగాలుగా కలిపి కొంతకాలం సేవించవలసి ఉంటుంది. గర్భాశయ కంతులు, పుండ్లు మొదలగు వాటికి హరితోదకం చాలాకాలం సేవించాలి. గర్భిణీ కాలంలో వచ్చే వికారం వాంతులకు ఆకాశ నీలోదకం పని చేస్తుంది. ఆ నీరు ఎన్నో యిబ్బందులను పోగొట్టి ప్రసన్నంగా ఉంచుతుంది. ఒకవేళ గర్భస్రావ సూచనలు కనబడితే ఆకాశ నీలోదకం గంటగంటకు లోనికి యిస్తూ హరితోదకాన్ని కొద్దిగా వేడిచేసి అందు గుడ్డను తడిపి పొత్తికడుపుపై వేయాలి. చల్లటి హరితోదకంతో తడిపిన గుడ్డను యోని మార్గంలో ఉంచాలి. వీలయితే హరిత కాంతిని గర్భాశయ ద్వారంపై ప్రసరింప చేయాలి. సుఖ ప్రసవానికి పీతోదకం సేవించాలి. స్తన్యవృద్ధికి నారింజ నీరు, స్తనములలో గడ్డలు, నొప్పి ఉంటే హరితోదకం, హరితకాంతి ఉపయోగపడతాయి. ప్రసూత జ్వరానికి నారింజోదకం మంచిది.

**పురుష జననేంద్రియ వ్యాధులు:** వీర్యదోషాలకు హరిత పీతోదకాలు సమభాగాలుగా కలిపి కొంతకాలం సేవించాలి. తదుపరి నీలోదకం మూడు భాగాలు + పీతోదకం ఒక భాగం కలిపి తీసుకోవాలి. స్వప్నదోషాలకు

నీలోదకం లోపలి కిస్తూ తల వెనుక భాగానికి హరిత తైలం లేదా గాఢనీల తైలం మర్దన చేయాలి. నపుంసకతలో నీల పీతోదకాలను సమభాగాలుగా కలిపి సేవించాలి. శిశ్నేంద్రియానికి అరుణ తైలం మర్దన చేసుకోవాలి. అరుణ కాంతిని గూడ ప్రసరింపచేసుకోవచ్చును. వీర్యకోశముల వాపు, నొప్పి, అవి గట్టి పడుట, పెద్దవగుట, వాటిలో నీరు చేరుట మొదలగు వాటికి పీతోదకం సేవిస్తూ పైకి అరుణ కాంతిని కొంత సమయం ప్రసరింపజేసి దానికి రెట్టింపు సమయం నీలం కాంతిని ప్రసరింపచేయాలి.

**కాళ్ళు, చేతులకు సంబంధించిన వ్యాధులు :** అన్ని రకాల కీళ్ళ నొప్పులకు, వాపులకు నారింజోదకం లోపలికి సేవించాలి. పైకి అరుణతైల మర్దన చేయాలి. కీళ్ళపై అరుణ కాంతిని ప్రసరింపచేయవచ్చు. పక్షాఘాతము (Paralysis) కు 2 భాగాలు పీతోదకం, ఒక భాగం అరుణోదకం, ఒక భాగం గాఢ నీలోదం కలిపి సేవించాలి. రోగిని సౌమ్యమైన ఎండలో కూర్చోబెట్టి అరుణ తైలం మర్దన చెయ్యాలి. నిత్యం ఒకటి రెండు గంటలు వ్యాధిగ్రస్తమైన అవయవానికి అరుణ కాంతిని ప్రసరింపడజేస్తే మరింత గుణకారిగా ఉంటుంది. కాలినరం నొప్పి (Sciatica) కి మిశ్రిత పైవర్ణోదకం పని చేస్తుంది. అరుణోదకంలో గుడ్డను ముంచి, పిండి, బాధగా ఉన్న భాగంపై పరచి వేడికాపడం పెడితే చాలా ఉపశమనంగా ఉంటుంది. లేదా ఎర్రని కంబలి కప్పి ఎండలో పెట్టవచ్చు. చేతినరం నొప్పికిని (Brachial Neuralagis) కు ఇదే చికిత్స సరిపోతుంది. మెడపట్టుకుంటే నీలోదకాన్ని పైకి మర్దన చెయ్యాలి. నడుంనొప్పికి పై మిశ్రిత వర్ణోదకం లోనికి ఇస్తూ పైకి అరుణ తైలం మర్దన చెయ్యాలి.

**చర్మ వ్యాధులు :** అన్ని రకముల గడ్డలకు పీతోదకం రెండు భాగాలు + గాఢనీలం ఒక భాగం + హరితోదకం ఒక భాగం కలిపి లోనికి సేవించాలి. పైకి హరితోదక పట్టీ వేయాలి. గడ్డలపై ముందుగా ఒక అరగంట అరుణకాంతిని తదుపరి ఒక అరగంట హరిత కాంతిని ప్రసరింపచేయాలి. గడ్డలు మొనతేలక పక్వము కాకున్నచో నీలం నీటిని త్రాగుతూ అదే నీటి పట్టీ వేసి అదే కాంతిని ప్రసరింపచేయాలి. చీముకురుపులకు హరితోదకం సేవిస్తూ హరిత కాంతిని ప్రసరింపచేస్తే సరిపోతుంది. దురద పొక్కులకు నీలోదక సేవనం, పట్టీ, కాంతి ప్రసారం చెయ్యాలి. కుష్ఠువ్యాధికి హరితోదకం, హరితకాంతి ప్రసారం. అరటి యాకులతో ఆతపస్నానం, ఉపవాసాలు, తదుపరి లవణరహిత శుద్ధ సాత్వికాహార సేవనం చాలాకాలం చేయాలి.(Leucoderma) శ్వేతకుష్ఠులో పీతోదకం లోనికి సేవిస్తూ పైకి ఆకాశ నీల తైలం రాయాలి. నీలకాంతిని ప్రసరింపజేయాలి. లవణరహిత ఆహారం సేవించాలి. మొటిమలకు హరితోదకపానం, హరిత కాంతి ప్రసారం

సరిపోతుంది. బట్టతలకు హరితోదక సేవనం చేస్తూ నీలం కాంతిని పైకి ప్రసరింపజేయాలి. గాయాలకు లోనికి హరితోదకం పైకి హరిత కాంతి, మడిమలు పాదాలు పగులుటకు, అరచేతుల పొరలు ఊడుటకు, పొడి చర్మానికి వివిధ మచ్చలకు లోనికి హరితోదకం, పైకి హరితకాంతి సరిపోతుంది. అవి మంటలతో కూడి ఉంటే నీలం కూడా కలపాలి. సూక్ష్మ క్రిములవల్ల కలిగే మశూచి, ఆటలమ్మ, పొంగు మొదలగు వాటికి నీలోదకసేవనం చేస్తే చాలు.

## ప్రమాదములు

**దెబ్బలు, గాయాలు :** అన్ని రకముల దెబ్బలకు హరితోదకం, హరిత కాంతి ఉపశమనాన్ని కలిగిస్తాయి. రక్తస్రావం, గాయం ఏర్పడితే నీలోదక నీలకాంతులు ఉపయోగపడతాయి. ఆ గాయాలు చీముపడితే హరితోదక హరితకాంతులు అవసరమౌతాయి. అచ్చట రక్తం గడ్డకట్టి వాపు, నొప్పి ఉంటే ఎరుపు, నారింజ కాంతులను ప్రసరింపజేయాలి. ఇవి గాంగ్రీన్ కాకుండా (కుళ్ళిపోకుండా) కాపాడతాయి. నీలోదకానికి క్రిమి సంహారక గుణం ఉంది. కాన, ఏ గాయాలనైనా నీలోదకంతో నిర్భయంగా కడుగవచ్చు. తదుపరి హరిత కాంతిని ప్రసరింపచేస్తే అవి చీము పట్టకుండా ఉంటాయి.

**కాలిన కాల్పులు చర్మానికి :** కాలిన వెంటనే మంట తగ్గువరకు చల్లటి నీటిలో ముంచి ఉంచాలి. తదుపరి నీలోదకంలో ముంచుటం కాని నీలోదకంలో తడిపిన గుడ్డ పట్టీని కాని వేయాలి. పుండ్లకు నీలం తైలం వేయాలి. హరిత కాంతిని ప్రసరింపచేయాలి.

**కుక్క, పిల్లి, ఎలుక మొదలగు జంతువుల కాట్లు :** అన్ని రకముల కాట్లను నీలోదకంతో శుభ్ర పరచి నీలోదక పట్టీ వేయాలి. జ్వరం ఉంటే నీలోదకం సేవించాలి. వాపు, చీము ఏర్పడితే హరిత కాంతిని ప్రసరింపజేయాలి. నీలోదకంతో హరితోదకం కలిపి యివ్వాలి.

**తేలు కుడితే :** లోనికి నీలోదకం, పైకి నీల తైలం, నీలకాంతి.

**పాము కాటుకు :** తీవ్ర విషసర్పాల కాట్లకు అరుణోదకం, అరుణ కాంతి అవసరమౌతాయి. సామాన్య సర్పాల కాట్లకు నీలోదకం, నీల తైలం, నీల కాంతి సరిపోతాయి. వాటి గాయాలు మానకుంటే హరితోదకం, హరిత కాంతి ఉపయోగించాలి.

ప్రమాద పరిస్థితులలో ఒళ్ళు చల్లబడి మృత్యుముఖంలోకి వెడుతూ ఉంటే లేదా తీవ్రంగా వాతం కమ్మి అవసాన దశకు చేరుకుంటూ ఉంటే అరుణోదకం, అరుణ కాంతి గొప్ప మేలు చేస్తాయి.

**కంటి జాగ్రత్తలు :** సర్వేంద్రియాణాం నయనం ప్రధానం అన్నారు పెద్దలు. ఇంద్రియాలన్నింటిలో కన్ను ప్రధానమైనదని దీని అర్థం. అట్టి కన్నులను జాగ్రత్తగా కాపాడుకోవడం ఎంతో అవసరం. అందుకు జాగ్రత్తలెన్నో ఉన్నాయి. అందువల్ల చికత్సా విషయాలే ఇక్కడ పేర్కొనుచున్నాను.

ఎండలో బయట తిరుగవలసియున్నప్పుడు లేదా ఎక్కువ ప్రకాశం చూడవలసి వచ్చినప్పుడు నీలం అద్దాలు కంటిని కాపాడతాయి. ఆ విధంగా చేయడానికి వీలు లేకపోతే తిరిగి సామాన్య ప్రకాశంలోకి వచ్చినప్పుడు కొద్దిసేపు ఆకుపచ్చ రంగను చూడడం మంచిది. ఆ రంగు కంటి శ్రమను ఉపశమింపజేస్తుంది. ఈ కారణం చేతనే పూర్వం నాటకాలను ప్రదర్శించేవారు దుస్తులు మార్చుకునే గదికి ఆకుపచ్చ రంగు వేసేవారట. నాటక వేదికపై ఎక్కువ ప్రకాశంలో నటించవలసిన వారికి ఆ రంగు ఉపశమనం కలిగించేదట. అందువల్లనే అట్టి గదికి గ్రీన్ రూమ్ (Green Room = ఆకుపచ్చగది) అని పేరు వచ్చింది. నేడు ఈ జాగ్రత్త పాటించకున్నా రూఢిగా ఆ పేరు అట్లే కొనసాగుతోంది. ఇప్పటికైనా నాటక నటులు, సినిమా నటులు ఈ జాగ్రత్తను పాటించడం మంచిది. మనంకూడా మన గృహాలలో మొదటి గదికి (డ్రాయింగ్‌రూంకు) లేతాకుపచ్చ రంగు వేసుకుంటే మంచిది. ఎండలో తిరిగి ఇంటికి వచ్చిన మనకు, అతిథులకు ఆ రంగు ఉపశమనం కలిగిస్తుంది.

అయస్కాంత చికిత్స (Magneto Therapy) లో కంటి సమస్యలను సరిచేయడానికి అయస్కాంత కళ్ళజోడును నిర్మించారు. వాటిలో అద్దాలకు బదులు మధ్యలో రంధ్రంగల గుండ్రటి అయస్కాంతాలను అమర్చారు. వాటిని ధరించి ముందుగా ఎండ ఉన్నప్పుడు దూరపు వినీలాకాశాన్ని కొద్దిసేపు చూడాలంటారు. తదుపరి దగ్గరలో వున్నపచ్చని చెట్లను చూడాలంటారు. దీనితో అయస్కాంత ప్రభావం, దూరంగా దగ్గరగా చూచే వ్యాయామం, వీటితోపాటు రంగులప్రభావం అన్నీ కలిసి దర్శన శక్తి బలపడుతుందని ఆ వైద్యులు చెబుతారు.

# ఉపసంహారము

పాఠక మహాశయులారా !

ఇందు సూర్యుని గురించి, సూర్యకిరణాలవల్ల కలిగే లాభాలను గురించి సంక్షిప్తంగా చెప్పడం జరిగింది. వీటిని దృష్టిలో పెట్టుకుని ఆలోచిస్తూ పోతే మరెన్నో విషయాలు తెలియగలవు. నేడు విజ్ఞానం శరవేగంతో ప్రయాణం చేస్తోంది. సూర్యుని గూర్చి ఎన్నెన్నో విషయాలు తెలుస్తున్నాయి. నేటి లెక్కల ప్రకారం సూర్యుని లోపలి ఉష్ణోగ్రత 15 మిలియన్ల డిగ్రీల కెల్విన్ (Kelvin). కేంద్రసాంద్రత 160 జి/సిసి పీడనం. 250 బిలియన్ల ఆటోమోస్ఫియర్ (వాతావరణం). ప్రతి సెకండుకు 5 మిలియన్ల టన్నుల న్యూక్లియర్ ఇంధనం వృధాగా మండిపోతోందట. ఈ ప్రకియలో న్యూట్రినోలు కూడా విడుదలవుతున్నాయట. సూర్యుని నుండి సెకనుకు 18 వేల కోట్ల న్యూట్రినోలు, విడుదలవుతూ ఉంటాయట. కాని వాటిని గుర్తించి పట్టుకోలేకపోతున్నారు. ఇక కాస్మిక్ కిరణాలు ఎక్కడినుండి వస్తున్నాయో? వాటివల్లకలిగే లాభాలు ఏమిటో కనిపెట్టవలసివుంది.

సూర్యుని నుండి భూమికి చేరే కొద్దిపాటి సౌరశక్తినైనా మనం చక్కగా వినియోగించుకోగలిగితే నేటి ఇంధన సమస్య కొంతవరకైనా పరిష్కారమవుతుంది. చరిత్రను పరిశీలిస్తే క్రీ.పూ,.215 సంవత్సరంలో ఆర్కిమెడిస్ అనే శాస్త్ర వేత్త సిరాక్యున్ నగరాన్ని ముట్టడిస్తున్న రోమన్ల సైన్యాన్ని కేవలం సౌరశక్తితోనే నాశనం చేశాడని వ్రాయబడి వుంది. ఆయన రూపొందించి యిచ్చిన పలకాలతో ఈజిప్షన్ల సైన్యం సౌరశక్తిని కేంద్రీకృతం చేసి శత్రునాశనం చేసింది. ఆ మంటల్లో రోమన్లు మల మల మాడిపోయారు. కాని దానిని నేడు శాంతియుత ప్రయోజనాలకు వాడుకోవడమే శ్రేయస్కరం. మన తంత్ర గ్రంథాలలో ఇటువంటి ప్రక్రియలు ఎన్నెన్నో వ్రాయబడి ఉన్నాయని చెబుతారు. వాటిని పరిశోధించి వెలుగులోనికి తీసుకురావలసి ఉంది. ఇక చికిత్సాపరంగా నాగార్జున తంత్ర గ్రంథంలో 'రంగు చికిత్స' అనే పేరుతో ఒక ప్రకరణం ఉంది. అందులో చికిత్సలు తెలుపబడ్డాయి. వాటిని నేటి విజ్ఞానంతో జోడించి ప్రయోగాలు చేయవలసివుంది. ప్రభుత్వ సహాయ సహకార ప్రోత్సహాలు లేనిది ఈ పరిశోధనలు సాధ్యం కావు.

ఈ మధ్య ఒక శుభవార్త ఏమనగా (సార్వదేశిక్, 30 జూలై) వేద భక్తులు

ఆర్య వైజ్ఞానికులునైన డాక్టర్ సూర్యప్రకాశ్ కపూర్‌గారు కొన్ని వేదమంత్రాలు ఆధారంగా విలయతాండవం చేసే తుఫానులను నిరోధించే బృహత్ ప్రణాళికను రూపొందించారు. వీరు భారత ప్రభుత్వ వైజ్ఞానిక విభాగంలో పనిచేసే వైజ్ఞానికులు. వీరు జల వాయువులపై సూర్య కిరణముల ప్రభావాన్ని జాగ్రత్తగా అధ్యయనం చేసి వేదం సూచించే మార్గంలో పరిశోధించి ఈ ప్రణాళికను నిర్మించారు. ఇట్టి ప్రణాళికను వారు బెంగళూరులోని భారత ప్రభుత్వ వైజ్ఞానిక పరిశోధనాలయం సి-మ్మెక్స్(C-MMACS)కు పంపించారు. ఎంతోకాలంగా తుఫాన్లను ఎలా నిరోధించాలో తెలియక సతమతమవుతున్న వైజ్ఞానికుల దృష్టి ఈ ప్రణాళికవైపు ఆకర్షింపబడింది. వారు మరొకసారి ఆలోచించి, పరిశోధించి ఇది చక్కని ఆలోచనయని ప్రశంసించారు. 18-8-2000వ తేదీన ఆ పరిశోధనాలయ అధ్యక్షులైన డాక్టర్ గగన్ ప్రతాప్‌గారు భారత ప్రభుత్వ వైజ్ఞానిక విభాగమునకు ఈ పథకాన్ని కొనియాడుతూ ఉత్తరం వ్రాశారు. అందు ఈ పథకం అమలుచేసినందువల్ల ప్రభుత్వానికి ఏమీ నష్టం జరుగక పోవుటయేకాక భారతదేశ ప్రతిష్ఠ పెరుగగలదని వ్రాశారు. ఇంతేగాక, దీనిని అమలు చేస్తే మరికొన్ని మహత్త్వపూర్ణమైన వైజ్ఞానిక విషయాలు వెలుగులోకి వచ్చి విజ్ఞాన భండారం మనకు లభించగలదని వెల్లడి చేశారు. అది సఫలమైతే వేదాల ప్రతిష్ఠ తారస్థాయికి చేరుకోగలదు. అస్తు.

ఈ గ్రంథ రచనలోని ముఖోద్దేశ్యముకూడా అదే. సృష్టికర్తయైన పరమేశ్వరుని ద్వారా మానవులకివ్వబడిన సమగ్ర జ్ఞాన నిధులైన వేదాలలో సృష్టి రహస్యాలలో విజ్ఞానం ఏ విధంగా ఇమిడి వుంటుందో సూచనప్రాయంగా తెలపడమే. నా స్వల్పబుద్ధికి అందినంత వ్రాశాను. కామారెడ్డి అర్ష గురుకుల ఆచార్యులు తమ బృహత్ పీఠికలో, సూర్య విజ్ఞానం మరికొన్ని విశేషాలు, అనే శీర్షికతో మరికొన్ని విషయాలు వ్రాశారు. ఎవరెంత వ్రాసినా స్వల్పమే - సూర్యుని దివిటీతో చూపించడమే. వేద మంత్రాలను ఎంతగా మననం చేస్తే అంతగా విజ్ఞాన రహస్యాలు విశదమౌతూ ఉంటాయి. కనుక ఓ సంస్కృత

విద్వాంసులారా! వైజ్ఞానికులారా! విద్యావేత్తలారా! ఆలోచనా పరులారా!

**మీరంతా వేదాలను చదవండి. ఆలోచించండి. పరిశోధించండి**
**భౌతిక ఆత్మికోన్నతులను పొంది ఆనందించండి**

శమ్ ఇతి ఓమ్



# మరొక ముద్రణ వ్యయదాత
# శ్రీ బాశెట్టి సత్తయ్య గారి పరిచయం

వీరు ఈ పుస్తక ముద్రణకు కావలసిన మరొక 11వేలు దానంగా యిచ్చినారు. శ్రీ బాశెట్టి సత్తయ్యగారు ఒక కర్మయోగి యని చెప్పవచ్చు. తాను ఒక నిరుపేద కుటుంబములో జన్మించినా ఒక ప్రక్క తన ఉన్నతికై కృషి చేస్తూ మరొక ప్రక్క సమాజ ఉన్నతికై కృషిచేసారు. తాము ఏ సంస్థలో పనిచేసినా పదవిని కాని, పేరు ప్రతిష్ఠలను కాని కాంక్షించలేదు. ఆర్థిక ప్రయోజనాన్ని అసలే ఆశించలేదు. ఆ పుణ్యకర్మల ఫలాన్ని కూడా పరమేశ్వరున కర్పిస్తూ పరమేశ్వరప్రాప్తియే లక్ష్యంగా తమ జీవితాన్ని గడుపుతున్న ఒక పుణ్యజీవి.
అహంకార అభిమానాలు లేకుండా ఏ పనిచేయటానికైనా వారు సిద్ధంగా ఉంటారు. శ్రమించటంలోనే వారు ఆనందిస్తారు. ఇట్టివారినే కర్మయోగు లంటారు.

వీరి జన్మస్థలం సికింద్రాబాద్‌లోని రాంగోపాల్‌పేట. తేది.12-1931 తేదీన కీ॥శే॥ శ్రీమతి బాశెట్టి లక్ష్మమ్మ, శ్రీ కిష్టయ్య గార్ల ప్రథమ సంతానంగా వీరు జన్మించారు. తల్లిదండ్రులిరువురు ఉత్తమ స్వభావం కలవారు. ధార్మిక ప్రవృత్తి, పరోపకార పరాయణత కలవారు. ఎన్ని కష్టనష్టాలొచ్చినా సహనంతో ఉండేవారు. శ్రద్ధాభక్తులతో సాధు సత్పురుషుల నాదరించి సేవలు చేసేవారు. అతిథి సత్కారమంటే వారికి అత్యంత ప్రీతి. ఆ పుణ్యదంపతులిద్దరిది ఒకే మాట ఒకే బాటగా ఉండేది. వారి మరణం కూడా అట్లే జరిగింది. 80 సంవత్సరాల వయస్సులో 31-8-1990 తేదీన శ్రీ కిష్టయ్యగారు దివంగతులు కాగా, ఆ మరునాడే కేవలం 15 గంటల తేడాలోనే 75 సంవత్సరాల వయస్సులో 1-9-1990 తేదీన శ్రీమతి లక్ష్మమ్మగారు దివంగతులయ్యారు. వీరికి ఏడుగురు కొడుకులు, నలుగురు కుమార్తెలు. ఇంతమందిని పెంచి పెద్ద చేయటానికి ఆ నిరుపేదలు ఎంత కష్టపడ్డారో ! వీరి వృద్ధాప్య బలహీన పరిస్థితిలో సత్తయ్య, శ్రీదయానందం (చిన్న కుమారుడు) మరియు శ్రీమతి ప్రమీల (పెద్ద కుమార్తె) గార్లకే తల్లిదండ్రుల సేవచేసే భాగ్యం లభించింది.

ఇంత పెద్ద కుటుంబములో పెద్ద కుమారునిగా శ్రీ బాశెట్టి సత్తయ్యగారు చేసిన శ్రమకూడా తక్కువది కాదు. కుటుంబ పోషణలో తల్లిదండ్రులకు చేదోడువాదోడుగా ఉండేవారు. ముఖ్యంగా నలుగురు చెల్లెండ్రకు పెండ్లిళ్ళు చేయటానికే తమ కష్టార్జితాన్నంతా ఖర్చుపెట్టి, చివరకు తాను అవివాహితునిగానే

ఉండిపోయారు. తమ చెల్లెండ్రు, తమ్ముళ్ళు సంసారాలతో కలకలలాడుతూ ఉంటే చూసి సంతృప్తి చెందారు.

వీరు పాఠశాలలో చదివింది నామమాత్రమే. వీధి బడిలో కొద్దిగా చదివారు. కొంత వివేకం కలిగాక చాలా శ్రమించి హిందీ నేర్చుకొన్నారు. హైదరాబాద్‌రాష్ట్ర హిందీ ప్రచార సభవారు నిర్వహించే 'ఉత్తమ' పరీక్షకు హాజరై ఉత్తీర్ణులయ్యారు. 18 సంవత్సరాల వయస్సులో 2, 3 సంవత్సరాలు శ్రమించి బట్టల దుకాణంలో లెక్కలు వ్రాయటం నేర్చుకున్నారు. అనంతరం నెలకు రు.300/- వేతనంగా ఒక బట్టల దుకాణంలో గుమస్తాగా ఉపాధిని పొందగలిగారు. తమ వృత్తికి న్యాయం చేస్తూ యజమానుల మన్ననలను పొందుతూ నెలకు రు.1200/- లు వేతనం పొందేవరకు ఎదిగారు. తదుపరి 2 సంవత్సరాలు ఒక బట్టల దుకాణంలో పార్టనర్‌గా పెట్టుబడి పెట్టి వ్యాపారం చేసి కొంత డబ్బు సమకూర్చుకోగలిగారు.

అనంతరం 'ధేను టెక్స్‌టైల్స్' పేరుతో ఒక బట్టలషాపులో పెట్టుబడితో కూడిన పార్ట్‌నర్‌గా చేరి 6 సంవత్సరాలు పనిచేసారు. క్రమంగా పార్టనర్ తొలగిపోగా శ్రీ సత్తయ్యగారే దానికి పూర్తి యజమానియై 12 సంవత్సరాలు దానిని నడిపి కొంత ఆస్తి సంపాదించుకున్నారు. శిథిలావస్థకు చేరుకొన్న యింటిని చక్కటి రెండంతస్థుల భవనంగా పునర్నిర్మించుకున్నారు. మొదటినుండి తననే అంటిపెట్టుకొని యున్న చిన్న తమ్ముని చి॥ దయానందంగారిని, అతని పరివారాన్ని ఆదరించి తనవద్దనే పెట్టుకున్నారు. వారి పిల్లలను సంతృప్తిగా చదివించి పెండ్లిండ్లు చెయ్యాలన్నది వారి ఆశయం. అందుకై శ్రమిస్తున్నారు. ఇదంతా వారు తమ కుటుంబం కోసం చేసిన శ్రమ కాగా సమాజం కొరకు వారు చేసిన సేవ విశిష్టంగాను ఆదర్శంగాను ఉంటుంది. వారి పిల్లలను సంతృప్తిగా చదివించి, మంచి సంబంధాలు చూసి పెండ్లి చేశారు. అందుకు వీరు చాలా శ్రమించారు. ఇదంతా వారు తమ కుటుంబానికి చేసిన శ్రమ కాగా సమజాం కొరకు వారు చేసిన సేవ విశిష్టంగా ఉంది.

వీరికి గురుకులాలంటే అమితమైన శ్రద్ధ. వాటి అభివృద్ధికి లక్షల రూపాయిలు వారు వ్యక్తిగతంగా దానమివ్వటమే కాక మరెన్నో లక్షలు చందాలుగా ప్రోగుచేసి ఇచ్చి వాటికి సహకరించారు. అందుచే వీరిని నేను **"గురుకుల మిత్ర"** అంటూ గౌరవిస్తున్నాను. వీరికి, వీరి కుటుంబానికి శతాధిక ఆయురారోగ్యలనచ్చి కాపాడుమని సర్వవ్యాపక సర్వేశ్వరుని ప్రార్థిస్తున్నాను.

సుమ్నార్థి

గ్రంథకర్త

# గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణలు

(సుమ్నార్థి డా॥ సుబ్బారావు గారి రచనలు)

1. గాయత్రీ మహిమ 30-00
2. గాయత్రీ విజ్ఞానం (ముద్రణలో)
3. మన ఇతిహాసం 70-00
4. మన వేదశాస్త్రాల పరిచయం 60-00
5. అగ్నిహోత్రం 100శాతం వైజ్ఞానికం 60-00
6. అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ 30-00
7. అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము 30-00
8. గోమాత 40-00
9. వేదాలలో సూర్యకిరణ చికిత్స 80-00
10. వేదాలలో జలచికిత్సా విజ్ఞానం (ముద్రణలో)
11. పెండ్లినాటి ప్రమాణాలు 40-00
12. గర్భాదాన విజ్ఞానం 50-00
13. దౌహృదిని 40-00
14. మరణానంతరం జీవుని ప్రయాణం 40-00
15. మానవ ధర్మము 40-00
16. ఈశావాస్యమిదం సర్వమ్ 35-00
17. దేవుడు - జీవుడు - ప్రకృతి 30-00
18. వేదాలలో అశ్వనీదేవతలు 20-00
19. సంధ్యావందనం - వైజ్ఞానిక సమాలోచన 20-00
20. జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ 60-00
21. వేదాల వెలుగుచూపే ఆర్యసమాజము 30-00
22. వైదిక జన్మదిన వేడుక 30-00
23. పండుగల పరమార్థం 40-00
24. వైదిక గృహప్రవేశ విధి 30-00
25. వేదాలలో వర్షేష్టి విజ్ఞానం 25-00
26. వైదిక క్రాంతి పథం 30-00
27. పురుషసూక్తము 20-00
28. వైదిక శాంతి పాఠం (వైజ్ఞానిక వ్యాఖ్య) 20-00
29. సృష్టికథ 20-00
30. సరస్వతీ సూక్తము 10-00
31. స్వతంత్ర సముపార్జనలో మహర్షి దయానందుడు 10-00
32. వైదిక సంస్కృతిలో వానప్రస్థాశ్రమము 10-00
33. గంగాధర శివుడు 10-00
34. ప్రణవస్తోత్రము 10-00
35. లక్ష్మీశాంతి సూక్తాలు (ముద్రణలో)
36. వేదాలలో మనోవిజ్ఞానం (ముద్రణలో)
37. వేదోపదేశాలు (ముద్రణలో)
38. వైదిక సుప్రభాతం (ముద్రణలో)
39. శివరాత్రి రహస్యము (ముద్రణలో)
40. గణపతి రహస్యము (ముద్రణలో)

ఇతర విద్వాంసుల రచనలు

1. మాతాపుత్రికల జ్ఞాన చర్చ 60-00
2. సత్యధర్మ విచారణ 6-00
3. స్వరాజ్య సంగ్రామములో ఆర్యసజాము (ముద్రణలో)
4. ధర్మవీర్ పం. లేఖారామ్ 5-00
5. వేదాలలో విజ్ఞానబీజాలు (ముద్రణలో)

ముద్రణలో ఉన్నవి
దాతలు లభించినపుడు
ముద్రింపబడును

Gayathri Series - 34

# VEDALALO SURYAKIRANA CHIKITSA

Rs. 80/-



శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య

## మహర్షి దయానంద సరస్వతి

(1824-1883)


Published by :

**GAYATRI ASHRAM TRUST**

12-10-586/6, Arya Samaj - Vyas Nagar, Medibavi,
Warasiguda, Secunderabad - 500 061.
(Secretary : SRI K.P. NARSING RAO, Cell : 98480 11073)